# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మే 1964

సంపుటము 41 : సంచిక 5.

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1964

# దైవసూక్తము

శ్రీమతి ఎస్. సుందరమ్మ

ఆ మహోన్నత దీర్ఘ నీహారశైల
శిఖర సంభవ సంతతాకీర్ణ విమల
జీవనాంతరపావన సింధుతతుల
కెవడు చూపును జలనిధి కేగుదారి ?

రంగదుత్తుంగ భంగ సంరంభయగుచు
ప్రళయ సమయాభ్ర మాలికార్భటులతోడ
వేల స్పృశియించి వెనుకకు వెడలుచున్న
దెవ్వడిచ్చెను మున్నీటి కిట్టియాజ్ఞ ?

పాల నిద్దంపురాల నీ లాలనింగి
నేర్పుచునున్నదీ విచిత్రేంద్ర ధనువు
భూతలమ్మును రంగుల ప్రోవుజేయు
నేడు వన్నెల దీనిలో నెవడుదిద్దె ?

పవలు గతియించె రాతిరి పరుగుతోడ
నరుగుదెంచెను జగమెల్ల నలముకొనియె
కటికి చీకటి—అది యేమి గగనవీధి
వెలుగు దీపంబు లెవ్వడు వీనిదీర్చె ?

చొక్కపుగడా నిరేకులు చుట్టుపేర్చి
పొట్టలోపల కమ్మపుప్పొడులు చిమ్మి
వలపు పెంపార లేత సంపంగి పూల
చేత జెక్కిన దేవతా శిల్పియెవడు ?

## భా ర తి

గున్న మామిడికొమ్మపై గూరుచుండి
కవుల హృదయాలు కవితలో గరగిపోవ
తీయగా పాడుచున్నది కోయిలమ్మ
ఎవడు నేర్పెను దీనికీ యీలపాట ?

కడుపులో జిలుబొట్టెకు గాలినొసగి
పాలుపట్టించి చేరిచి పూలమెత్త
సొగసుబుగ్గల ముద్దాడి జోలపాడి
పేర్మి తొమ్మిది మాసాలు పెంచు నెవడు ?

ఆపు, అడ్డంకి లేకుండ మాపుబవలు
తిరుగుచున్నది భూచక్ర మొరుగకుండ
నెవడు దీనిని ముంగేల నెత్తి త్రిప్పు ?
ఈ మహోత్తర సృష్టికి నెవడు ప్రభువు ?



# ఎత్తుపల్లాలు

శ్రీ విహారి    శ్రీ శాలివాహన

మదకుంభి కుంభస్థలాన్ని తప్ప అన్యమొల్లని కేసరి — చిట్లిన ఎముకలు దొరకని చిల్లర మృగాలు, ఒకే కాంతారంలో జీవయాత్ర సాగిస్తున్నాయి. శాఖోపశాఖలై విస్తరిల్లిన మహా వృక్షాలు — ఆరడగులకన్నా మించి పెరుగని అలతి చెట్లు, అంబరచుంబితోత్సాహులైన అవనీధరాలు — కొండల ఆకారాన్ని మాత్రం కలిగిన చట్టుబండలు — ఇవన్నీ ప్రకృతిలో గోచరించే వింతలే.

భిన్నత్వం, అంతరం, అసమానత్వం ప్రకృతి ధర్మాలు!

ప్రకృతిలోని భిన్నత్వాన్ని మించిన అంతరం మానవుల్లో సైతం ఉంది. మనస్తత్వాల్లో — వ్యక్తిత్వాల్లో, రూపాల్లో — వయస్సుల్లో, ఉనికిలో — జీవన మార్గాల్లో కొట్టవచ్చినట్లు కనపడుతుంది ఈభేదం.

అయితే ఏం? భారతదేశ సాంఘిక, రాజకీయ, ఆర్థిక విధానాలలోవలె, భిన్నత్వంలో ఏకత్వం పొసగుతూ ఉంటుంది. ఈ అనేకత్వంలోని ఏకత్వం శాశ్వతమా అంటే సందేహించకుండా 'అవునని' సమాధానం చెప్పలేం!

రోడ్డుమీద రిక్షా ఆగింది.

రిక్షాలోని పెద్దమనిషి క్రిందికి దిగి జేబులో పర్సు తీశాడు. రోడ్డుకు యీ వైపున ఉన్న గుడిసె బయటి యిసుక దిబ్బమీద పడుకున్న ఆరేళ్ల కుర్రవాడు రిక్షాను చూసి గబ గబా పరిగెత్తుకుంటూ వచ్చాడు. రిక్షా గంటనుగణ గణలాడించాడు. ఏదో అవ్యక్తానందంతో చిందులు వేయసాగేడు. అతని మొహంలో సంతోషం విరిసింది.

"అరేయ్, ఏ వి(ట్రా వెధవ రొద" అంటూ డబ్బులు రిక్షావాని చేతిలో పడేసి ఎదురుగా ఉన్న భవంతిలోకి సాగిపోయాడు పెద్దమనిషి.

ఆ కుర్రవాడు గంట కొట్టటం మానలేదు. రిక్షా అతను చిల్లర జేబులో వేసుకుని వాడి వైపు చూశాడు. సంబరంతో పొంగిపోతున్నాడతను. రిక్షావాలా సన్నగా నవ్వుకున్నాడు. పరిసరాల్ని పరికించాడు.

గుడిసె ప్రక్కగా నేలమట్టంవరకూ లేచిన పెద్ద భవంతి తాలూకు గోడలు, దాని ప్రక్కనే భవన నిర్మాణానికి అవసరమైన సామగ్రి ఉన్నాయి. ఆ భవనం తయారుకాగానే యీ గుడిసెకి అక్కడ స్థానం ఉండదు. మరో చోట వెలుస్తుంది. అంతేకాని, శాశ్వతంగా ఆ గుడిసె లేకుండాపోవటానికి అవకాశం లేదు.

రిక్షావాలా రిక్షాను వెనక్కు త్రిప్పి ముందుకుసాగాడు. కుర్రాడు రిక్షా వెనుకభాగాన్ని పుచ్చుకుని కొంతదూరం పరుగెత్తి అలసిపోయి మధ్యలో ఆగిపోయాడు. రిక్షా సినిమాహాలు ముందుకొచ్చి ఆగింది. ఆట వదలటానికి యింకా వ్యవధి ఉండటంవలనకాబోలు, రిక్షా వాలాలంతా బండ్లలో నడుములు వాల్చి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"ఏరా, రాఘువులూ, ఏమాత్రం తోలావ్, యియ్యాల?" అప్పుడే వచ్చిన రిక్షావాలాను మరో అతను ప్రశ్నించాడు.

రాఘువులు అన్యమనస్కంగా ఉన్నాడు. అతనికి సమాధానం చెప్పకుండా రిక్షా సీటును ఎత్తి లోపలి అరలోనుంచీ పుస్తకానొకదాన్ని బయటికి తీసుకున్నాడు. రిక్షాలో కూర్చుని దాన్ని చూడసాగేడు.

"ఏందిరా అది. పిలుస్తుంటే పలకవేం? నిన్నేరా రాఘువులూ" మళ్లీ హెచ్చరించాడతను.

"ఏందిరా నీ ఎధవ గోల. ఆడెంత సంపాయిస్తే నీకేర్రా, రంగా." యింకోకతను విసుక్కున్నాడు.

రంగడు అతనివైపు తీక్షణంగాచూసి, "పానకంలో పుడకలా మద్దెలో నీకెందుకు?" అన్నాడు కోపంగా. రంగణ్ణి విసుక్కున్నాతను ఏదో గొణుక్కుంటూ రిక్షా ముందుకులాక్కుని వెళ్లిపోయాడు.

"ఏరా రాఘువులూ. అంత యిదిగా చూస్తున్నావే. ఏంవన్నా బొమ్మా!" అని 'ఇహిహి' అంటూ నవ్వాడు రంగడు.

రాఘువులు పుస్తకాన్ని ప్రక్కకుతీసి రంగణ్ణి చూశాడు. రంగడి వెకిలి నవ్వుకు అతనికి ఒళ్లు మండింది. "వెధవ

చేస్కోలా మవ్వ్యానూ....నేనెంత సంపాయిస్తే నీకెందుకురా? ఎప్పుడూ ఎవడో ఓడినెత్తిన చెయి పెట్టటానికి ప్లాన్ వేస్తూనే ఉంటావ్''

రంగడు మొహం చిన్నపుచ్చుకుని, ప్రాధేయపడ్డాడు. ''అదిగాదు రాఘవులూ, మా అయ్యకు వంట్లో బాగాలేదురా: ఇయ్యాల రూపాయన్నా మిగల్లేదు. మందెత్తుకు పోవాల్రా, ఓ రెండు రూపాయలుంటే యియ్యి. రేపు చూసుకుందాం, అమ్మా అయ్యా లేనివాడివి, నువ్వుగాక యింకోడెవడు అప్పు పెడతాడురా నాకు....నువ్వే రచ్చించాలి.''

రాఘవులు సందేహంగా రంగణ్ణి చూశాడు. ఇలాంటి అబద్ధాలాడటంలో రంగడిది పెద్ద తెలివి! కాని, అయ్య మాటనేసరికి, రాఘవులు ఆలోచన తన తండ్రిమీదకు మరలింది. అతని కళ్లలో నీళ్లు తిరిగినై.

అది గమనించి రంగడు, ''ఏందిరా ఏడుస్తుండావ్?'' అన్నాడు.

రాఘవులు కళ్లు తుడుచుకుని చెప్పాడు, ''రేపణ్ణుంచీ మ్వా నాన్నా వస్తాడురా. బాడుగ డబ్బులు సరిపోతవో లేదోనని భయంగా ఉంది. సర్లే. రేపటి సంగతి రేపు చూసుకుందాం. ఇవిగో డబ్బులు. రేపు తప్పకుండా యిచ్చేయ్.'' అంటూ జేబులో నుంచి రెండు రూపాయ నోట్లు తీసి రంగడిచేతిలో పెట్టాడు. రంగడి కళ్లు సంతృప్తితో మిల మిలలాడినై. హుషారుగా యీల వేసుకుంటూ రిక్షా తీసుకుని వెళ్ళిపోయాడు.

రాఘవులు మళ్లీ పుస్తకం తీసి చూశాడు. అదొక చిన్న నోట్‌బుక్. దానినిండా జమా ఖర్చుల అంకెలూ చిందర వందరగా వేసివున్నై. పుస్తకం మధ్యపేజీలో పెద్ద అంకెల్లో రేపటి తారీఖు వేయబడి ఉంది. దాన్నిచూస్తూ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు రాఘవులు.

* * *

రాత్రి పదిగంటలు దాటితే ప్లీడరు రాజశేఖరం గారింట్లో పిట్టా—పురుగుకూడా మేలుకుని ఉండటానికి వీలు లేదు. ఇది ఆయన కఠిన శాసనం. వంటింట్లో కాపురముండే వంటావిడ దగ్గర్నుంచీ, పెరట్లో ఓ మూల కాపురముండే తోటమాలివరకూ అందరూ యీ శాసనానికి బద్ధులైనవారే. ఇక ఆయన సంతానం — నలుగురి పిల్లలసంగతీ చెప్పనక్కర్లేదు. ఎంత పరీక్ష రోజులైనాసరే, ఎంత చదువుకోవలసిన అవసరం ఉన్నాసరే — ఆ సమయం దాటి మేలుకొని ఉండరు. అందుకనే రాత్రి పదిగంటలు కాగానే ఆ భవంతిలోని అన్ని గదుల్లోని లైట్లు ఆర్పివేయబడతాయి. అలాంటిది ఈ రోజు ఆ ఇంటి రెండవ అంతస్థులోని ఓ మూలగదిలో లైటు వెలుగుతూ ఉంది. — రాత్రి పదకొండు గంటలు కావస్తున్నాకూడా!

రాజశేఖరం గదిలో పట్టె మంచం మీదపడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. మంచానికి ప్రక్కనే కుర్చీలో ఆయన భార్య కాంతం కూర్చుని ఉంది.

చేతిలో ఉత్తరాన్ని అటూ యిటూ త్రిప్పుతూ, భర్త కళ్లల్లోకి చూస్తూ అందామె, ''అయితే యీ సంబంధమూ తప్పిపోయినట్లేనన్న మాట. అమ్మాయిని ఎంతమంది వచ్చి చూసి వెళ్తున్నా, ఒక్క సంబంధమూ కుదరకపోవటానికి మీ వాళ్ల ప్రవర్తనే ముఖ్యకారణం. ప్రతివాళ్లూ మొరికనే ఎంచుతుండిరి. లేకపోతే మన కామేశ్వరికేం తక్కువ. చదువు అందం అన్నీ ఉండికూడా దాని ఖర్మలా కాలింది. ఇక ఈ జన్మలో దానికి పెళ్లవుతుందనే ఆశ నాకేం ఏ కనపడటం లేదు.''

రాజశేఖరం ఆమెవైపు సాలోచనగా చూశాడు. భార్య మాటలు ఆయన మనస్సుకు కష్టం కలిగించినై. దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు, ''గతించిపోయిన సంఘటనలకు ప్రాముఖ్యాన్నిచ్చి, రంధ్రాన్వేషణచేసి తప్పు లెన్నాలనుకుంటే ఎవరిలోనైనా దొరుకుతాయ్. అంతా మనుషులమేగాని దేవుళ్లం కాముగదా. అలా జరగాలని రాసిపెట్టి ఉంది, జరిగిపోయినై. అందుకే ఒక్క విషయానికి నాకు విచారంగా ఉంది. ఈ రోజుల్లో కూడా పూర్వంలోలా యివన్నీ చూస్తున్నారంటే మనమెంత అభివృద్ధిచెందామో అర్థమవుతుంది.''

''సరేలెండి. మీరనేది మరీబాగుంది. మనవాళ్లు బుద్ధులిలా తగలడటంలో తప్పులేదుకానీ, ఊళ్లోవాళ్ళు వాటిని ద్వేషిస్తున్నారంటే విచారమెందుకు ? పోయేవాళ్లుపోక యీ అప్రతిష్ఠలన్నీ మన నెత్తిన పడేసిపోయారు.'' కాంతం కొంచెం తీవ్ర స్వరంలో విసుగ్గా అంది.

రాజశేఖరం ఏమీ మాట్లాడలేకపోయాడు. అతని హృదయంలో సంచలనం రేగింది. గత జీవిత విషాదరేఖలు అతని కళ్లకు గోచరించినై. తండ్రి, పినతల్లి చేసిన నేరాలు తమ జీవితాలమీద ఎలాంటి చెరగని ముద్రవేసిందీ అవగతమై మనస్సు బాధపడింది. కామేశ్వరికి పెళ్లికి అడ్డికపుటబ్బందుల్ని గాని, ఆమె అందచందాలుగానీ, ఏ ఆటంకం కావటం లేదు. ఉన్న పెద్ద అవరోధం ఇదొక్కటే — తమవంశం మంచిది కాదనేది!

ఆ విషయంలో తామెంత మెలుకువగా వ్యవహరిస్తున్నా అది బయటికి పొక్కుతూనే ఉంది. వచ్చినవాళ్లంతా ఆ వంక చూసి వెళుతూనే ఉన్నారు. రాజశేఖరంకు భార్య మాటలే నిజమౌతాయేమోననే భయం కలిగింది. నిజంగానే కామేశ్వరికీ జన్మలో

పెళ్లికాదేమోననే సందేహం మొట్టమొదటిసారిగా ఆయన మనస్సులో ప్రవేశించింది. ఈ సమస్యను పరిష్కరించటానికి ఏదారీ తోచటం లేదు.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అంది కాంతం, "ఉన్న దుండగా ఉపాకర్మ అన్నట్లు, అజ్ఞాతంగా ఉంటేనే యిట్లా ఉండి దరీదారీ తోచక చస్తుంటే, రేపు మీ నాన్నగారు బయటికొస్తార్ట. గుర్తుందిగా. ఇహ, మనమ్మాయి పెళ్లి మాటల్లో తప్ప చేతల్లో జరగదు."

రాజశేఖరానికి రేపటి రోజు ప్రాముఖ్యత గుర్తుకొచ్చింది. రేపు తన తండ్రి విడుదలై బహిః ప్రపంచంలోకి వస్తాడు. సరాసరి తనవద్దకే వస్తే —........

రాజశేఖరం కలవరపడ్డాడు. కాంతం చెప్పినట్లు నేరస్థులు కనపడనప్పుడే తమను వ్రేలెట్టి చూపి పరిహసిస్తున్న సంఘం — ఆ నేరస్థులు ప్రత్యక్షంగా కనపడుతుంటే సహించదు. బహిరంగంగా విమర్శిస్తుంది. అపహసిస్తుంది. అంతే కాదు, తమనుంచీ బహిష్కరించవచ్చు.

'అబ్బ.' రాజశేఖరం రెండు చేతులతో తల పట్టుకుని వెనక్కు వాలిపోయాడు.

కాంతం భర్తను చూసి కలవరపడింది. ఆయన ప్రక్కన కూర్చుంటూ చెప్పింది. "ఎంత తల బ్రద్దలు కొట్టుకుని మాత్రం ప్రయోజన మేమిటి ? జరిగిందేదో జరిగింది కానీ, రేపు ప్రొద్దున్నే పోయి ఆయనగార్ని ఇక్కడికి తోలుకు రాకండి. చేచేతులా ఈమాత్రపు ప్రశాంతిని కూడా లేకుండా చేసుకోకండి. ఏమంటారు ?"

రాజశేఖరం సమాధానం చెప్పలేకపోయాడు. భార్య ఆలోచనని గర్హించాలో, ఆమె ముందు చూపుకు గర్వించాలో తెలియలే దాయనకు. భార్య కళ్లల్లోకి చూస్తూ ఉండి పోయాడు.

* * *

ఠాణాలో పన్నెండు గంటలు కొట్టారు.

ఉసురుసురుమంటూ కంబళిమీద అప్పటి వరకూ పొర్లాడిన శంకరయ్య లేచి కూర్చున్నాడు. పున్నమిచంద్రుని కాంతి కిరణాలు వెంటిలేటరుగుండా గదిలో ఓమూల పరచుకున్నై. విషాదావృతమైన శంకరయ్య హృదయంలో ఓమూల వెలుగు విరిసింది. గదిలోని వెలుగు చీకట్లతో పోటీచేస్తూ శంకరయ్య మనస్సులో సంతోష విషాదాల సంచలనం రేగింది.

ఇరవై సంవత్సరాలు !

అనంతమైన కాల ప్రవాహంలో ఇరవైఏళ్లు తృణకణాలు కావచ్చునేమో కాని, అరవై అయిదేళ్ల తన జీవితంలో అవి మరపురాని మహత్తర సంవత్సరాలు. గడచిన ఇరవై ఏళ్ల నుంచీ చీకటికొట్లో బందీగా గడచింది తన జీవితం.

పచ్చని చేలు—పండు వెన్నెల, ప్రాణికోటి—ప్రకృతి సౌందర్యాలను చూసి పులకించే తరుణం మళ్లీ ఇంతకాలానికి లభించింది. ! బహిః ప్రపంచంలో, స్వేచ్ఛా వాతావరణంలో పక్షిగా విహరించే మహద్భాగ్యం మళ్లీ తన బ్రతుక్కు లేదనే తలచాడు తను. కాని—భగవంతుడు తాను నిర్దయామయుడిని కానని ఋజువు చేసుకున్నాడు ! తనకు వెలుగు చూపబోతున్నాడు.

ఆనందం ముప్పిరిగొని ఉప్పొంగిపోతున్న శంకరయ్య హృదయం అంతలోనే క్రుంగింది. నేరస్థుడుగా లోకానికి రోసి కఠిన నరకానికి గురిచేయబడిన తను బయటికి పోయి సాధించే దేమిటనే ప్రశ్న ఎదురైంది. అవును. తాను పొంద బోయే సౌఖ్యం కాని, లాభం కాని ఏమిటి ? అయినవారికి కాని, పరాయివాళ్లకు కాని తా నెలా ఉపయోగపడగలడు ?— లేనప్పుడు వారికి భారమే గదా ?

అయినవారి ఆలోచన రాగానే శంకరయ్య మనస్సు గతంలోకి గెంతింది. కళ్లు మూసుకుని మళ్లీ నేలమీదికి ఒరిగాడు.

పదేళ్లపాటు కాపురంచేసి, ఎనిమిదేళ్ల పిల్లవాడ్ని పెంచి పెద్దచేసే భారాన్ని తన భుజస్కంధాల మోపి, కామేశ్వరి హఠాత్తుగా యీ లోకాన్ని వీడిననాడు తన హృదయ వీణా తంత్రులు పెటపెటమని తెగిపోయినై. ప్రపంచమంతా చీకటి మయంగానే కనిపించింది. 'అమ్మేది నాన్నా' అని తల్లడిల్లి పోయే శేఖరాన్ని సముదాయించలేక గుండెలు పిండినట్లయ్యేది తనకు. స్కూల్లో కో టీచర్స్ బలవంతంవల్ల నైతేనేమి, ఊళ్లో శ్రేయోభిలాషుల సలహాలకు లొంగయితే నేమి తాను సుమతిని పెళ్లాడాడు. ఆమె తన హృదయవీణాతంత్రుల్ని సరిచేసి, బిగించి, పూరవీణాగానాన్నాలపించి తనను మధురగాన ఝరిలో ముంచి తేలుస్తుందని ఎన్నెన్నో ఊహించాడు. కాని, ఆశాభంగమే లభించింది తనకు.

ఆరోజు—

సుమతితొ ప్రథమ సమాగమం !—

కాలి అందెల రవళికి, దినపత్రికను మూసి తలెత్తి చూశాడు తను.

అదే సందడి !—కామేశ్వరి కంకణ నిక్వాణానికీ, సుమతి మంజీర శింజితానికీ భేదం గోచరించలేదు తనకు. అయినా తా నావేళ సుమతిచే సమ్మోహితుడు కాలేక పోయాడు.

కారణం ?—తన కది ప్రథమ సమాగమం కాకపోవటం. మనస్సును కాదని ఎంత మరలించినా, కామేశ్వరితో తన సాహచర్య మధురోహల్ని తన కళ్లముందు నుంచీ పార్రదోలలేక పోయాడు. 'పోనీ సుమతి అందచందాలైనా తన మనుస్సును తట్టి లేపేయా' అంటే అదీ లేదు. సుమతి అంతటి భాగ్యశాలీ కాదు. అలాగని అనాకారీ కాదు. అసలు జీవితంలో ఏ అనుభూతి అయినా పునరావృత్తమైతే తొలిసారి కలిగే హృదయస్పందన కాని, పొందే ఆనందపు పొంగు కాని మలిసారి లభించదు.

పర్యవసానం ?—సుమతి కన్నీళ్లు.

తన ప్రవర్తన వలన ఆమెకు తానంటే ఒక విధమైన అలక్ష్యం ప్రబలింది. మాటల్లో చేతల్లో ఈసడింపు గోచరించేది.

ఋతువుల్లో వసంతం, వసంతంలో మధుమాసం, మధు, మాసంలో పున్నమిరేయి, పున్నమిరేయిని ఆమని కోయిల గానం—ఆ ఆహ్లాదకర వాతావరణంలో ప్రియా సమాగమ లబ్ధమైన సమ్మోదం. కలకాలం కాంతల మనసుల్ని కరగించే యిలాంటి వేడుకను సుమతికి తాను తీర్చలేకపోయాడు. ఇప్పుడనిపిస్తున్నది, తా నామె కావిధంగా అన్యాయమే చేశానని. ఎంతసేపటికీ శేఖరం భవిష్యత్తుమీద నిమగ్నమై ఉండేది తన మనస్సు. సుమతికి తన భవిష్యజ్జీవితాన్ని గురించిన ఆరాటం ప్రబలిపోతూ ఉండేది. దాన్ని తాను గమనించి కూడా నిర్లక్ష్యం చేశాడు. తన నిర్లక్ష్యానికి ప్రోద్బలమైన మరో కారణం, రఘు జననం. సుమతి కడుపు పండి బిడ్డడిని కనటమే ఆమె జీవితానికి మహద్భాగ్యంగా తలచేడు తను. కాని, సుమతి మనస్సు కేవలం మాతృత్వాన్ని పొందటంతో తృప్తి పడలేదు. తన వయసును తరింపచేసుకుని, గుండెల్లో ఆనందం పండించుకోవాలనే కాంక్ష ఆమె కుండేది.

ఈవిధంగా కొన్ని రోజులు గడచినై.

తానంటే ఈసడింపే కాకుండా, శేఖరమంటే ఈర్ష్య కూడా ఆమెలో విజృంభించింది. చీటికి మాటికి తిడుతూనో, కొడుతూనో వాణ్ణి వేధించసాగింది. వస్తుతహా మెతక స్వభావం కలిగిన శేఖరం సవతి తల్లి పెట్టే బాధల్ని వేటినీ తనదాకా చేరవేయకపోయినా, శేఖరమంటే సుమతి చూపుతున్న సవతి తల్లి ప్రేమను తాను గమనించకపోలేదు. గమనించినా, పైకి ఆమె నేమీ అనకలిగేవాడు కాదు.

చుట్టపు చూపుగా వచ్చిన శేఖరం అమ్మమ్మ వాడిపట్ల సుమతి ప్రవర్తనను కళ్లారా చూసి వాణ్ణి తనతో తీసుకు పోతానంది. తానూ అదే మంచిదని భావించాడు. సుమతి 'వాడికి నే నిక్కడేం తక్కువ చేస్తున్నా' ననీ మొదట్లో కొంచెం రాద్ధాంతం చేసినా, వాణ్ణి పంపటానికి సుముఖతచూపింది.

శేఖరం మేనమామ ఇంటికి వెళ్లిపోయాడు. వాడి కంటే తనకు బెంగ ఎక్కువైంది. కాని, ఆ బెంగ ఎంతోకాలం నిలవలేదు. కాలక్రమేణా శేఖరానికి మేనమామ చదువు సంధ్యలు నేర్పటం, పద్దెనిమిదో ఏటే తన కూతుర్నిచ్చి పెళ్లి చేయటం జరిగిపోయినై. శేఖరం వెళ్లిన తర్వాత సుమతి ప్రవర్తనలో ఇంకా మార్పు వచ్చింది.

. ఠాణాలో ఒక గంట కొట్టారు. శంకరయ్య కళ్లు ముడుచుకున్నాడు. కళ్లు మండుతూ నీళ్లు కారుతునై. ప్రక్క కొట్లో ఖైదీ పిచ్చి ముసలయ్య ఏవో అరుస్తున్నాడు. బూతులు తిడుతున్నాడు ఎవర్నో. అతనూ తనలాగా 'దగా పడిన తమ్ముడే.' హత్యా నేరానికి శిక్ష ననుభవిస్తున్నాడు. ఏమిటో ఈ జీవిత మనిపించింది శంకరయ్యకు. 'మిథ్య' అని సమాధానం చెప్పుకునేసరికి సన్నగా నవ్వొచ్చింది. నేరస్థునిలో పశ్చాత్తాపం, మానసిక పరివర్తన—ఈ రెండూ జైలుశిక్ష విధించటంలో అధికారి ఆశించే పరిణామాలు. కాని, ఎందరిలో యీ మార్పు కలుగుతోంది ?— ఏమో ?

శంకరయ్యకు నిద్ర రావటంలేదు. పూర్వాశ్రమంలోని తన జీవితమంతా నెమరుకు వచ్చి మనసును కలత పరుస్తుంటే నిద్రేం పడుతుంది ?— ప్రక్కకు తిరిగేడు. జైలు గోడమీద పాతబడిన చలనచిత్రం మసక మసకగా కనపడసాగింది.

క్లాసులో పాఠం పూర్తిచేసుకుని టీచర్స్ రూమ్స్ లోకి వచ్చాడు తను. గది ద్వారం దగ్గరికి చేరేసరికి తనను గురించిన సంభాషణ వినపడి అలాగే నిలబడిపోయాడు. కృష్ణమూర్తి—రామ్మూర్తీ సన్నగా మాట్లాడుకుంటున్నారు.

"శంకరయ్యగారి పెళ్లాం పెద్ద నాయకురాలైందిట గదండీ ?"—!!

తన కడుపులో దేవినట్లైంది.

"ఆఁ .... కాక ఏం చేస్తుందండీ. ఈయ నొక పెద్ద విశాల హృదయుడు. ఆమెకు కావలసిన స్వేచ్ఛ నిచ్చాడు కాని, ఆనందా న్నివ్వలేదు. దాన్ని పొందే మార్గాన్ని తెలుసుకుందావిడ. అంతే."

తన హృదయం వ్రయ్యలైంది. మండే గుండెతో కొంపకు చేరాడు. సుమతిని రకరకాల ప్రశ్నలు వేశాడు. ఆమె మీద అనుమానపు దృక్కులు బరపాడు. తన హృదయంలోని బాధనంతా త్రవ్వి ఆమె ముందు కుప్పగా పోశాడు.

# ఎత్తుపల్లాలు

సుమతి కళవళపడింది. ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. దెబ్బ తిన్నదానిలా అయిపోయి అంతలోనే తేరు కుంది. పొడి నవ్వు నవ్వి తన దగ్గర చేరింది. చుబుకాన్నెత్తి, తన కళ్లల్లో కళ్లు పెట్టి "మీ రెంత అమాయకులండీ. ఎందు కంత తికమక పడతార" ని ప్రశ్నించింది.

తా నేమీ చేయలేకపోయాడు. ఆమె చంచల నేత్రాల్లో చంచలత్వాన్ని, చపలత్వాన్నీ పసికట్టలేకపోయాడు. కాగా, రగిలి పోతున్న తన హృదయానికి అమృతపు చిలకరింపులైనా యామె పలుకులు. ఏమైనా తనలో అనుమాన బీజాలు నాటు కున్నాయి. మనస్సులో ఆరాటం మొదలైంది. ఎవరితో కలిసి తిరుగుదామన్నా ఏదో లజ్జ ముంచుకొచ్చేది. తన నెవరు చూస్తున్నా ఏదో చులకనచూపు చూస్తున్నా రనిపిస్తూ ఉండేది. ఇద్దరు కలిసి మాట్లాడుకుంటూంటే తనను గురించేననే భావన కలుగుతూ ఉండేది. ఆవిధంగా తనకు తానుగా పదిమందికీ దూరమై పోయాడు.

ఒకసారి తా నేదో పనిమీద పట్నానికి పోయి మర్నాడు ఊరుకు చేరుకునేసరికి ఊరు ఊరంతా గుప్పుమంది. ఇద్దర్ని వ్యక్తులు కలిసినచోటల్లా సుమతి మాట వినపడింది. ఏటి ఒడ్డున అమ్మలక్కల దగ్గర్నుంచీ, తన ఇంటి ప్రక్క చిల్లర కొట్టు శేషావతారం వరకూ—అంతా ఇదే విషయాన్ని చిలవలు పలవలుగా చెప్పుకొని ఆనందిస్తున్నారు. తనను చూసి వచ్చే నవ్వును ఆపుకుంటూ బాధపడ్డారు.

తల కొట్టేసినట్లయింది తనకు. ఇంటికిపోయి కోపంతో సుమతిని నానా హింస పెట్టాడు. కాని, సుమతి తాను నిర్దోషినని వగలుపోయింది. నిజా నిజాల్ని తా నెంతగానో ఆలో చించి చివరికి నిప్పులేని పొగ రాజుకోదనే నిశ్చయాని కొచ్చాడు.

ఆనాటినుంచీ తన జీవితం నిప్పులు చెరిగింది. ఇల్లొక నరకకూపంగా మారిపోయింది. సుమతికీ, తనకూ మాటా మంతీ లేకుండా పోయాయి.

ఒకరోజున టీచర్స్ రూములో తా నేదో ఆలోచించు కుంటూ కూర్చున్నాడు. హిందీ మేష్టరు పూర్ణానందం మాస పత్రిక నొకదాన్ని తెచ్చి, "ఈ కథ చాలా గొప్పగా ఉందండీ. చదవండం" టూ పుస్తకాన్ని తనచేతి కిచ్చాడు. ఆయనంటే తనకు గల సదభిప్రాయం తానా కథను చదివేటట్లు చేసింది.

తీరా చదివితే—ఆ కథకూ తన జీవితానికీ పోలికలు గోచరించినై. అందులోని పాత్రలు, వాటి మనస్తత్వాలు తమ కన్వయించుకుంటే అతికినట్లు సరిపోయినై.

అందులో ఒక భర్త అసమర్థత కారణంగా భార్య పతి తగా మారుతుంది. ఆమె చాలా విద్యా సంపన్నురాలు. కవ యిత్రి. సంఘంలో మంచి గౌరవస్థానంలో ఉండి కూడా సమాజంలో విచ్చలవిడిగా సంచరిస్తూ ఉంటుంది. ఆమె నైచ్యాన్ని చూస్తూ చూస్తూ కూడా సహించి ఊరు కుంటాడు భర్త. పైగా ఆమె ప్రవర్తనను తనలో తానుగా సమర్థించుకుంటాడు. కాని, లోలోపల కృశించిపోతూ ఉంటాడు. ఆ బాధతో క్రుంగి రోగంతో తీసుకుపోతాడు.

హృదయాన్ని కదలించే కథ. కాని, భర్త పాత్ర పోషణలో అవాస్తవికత చోటు చేసుకుం దనిపించింది తనకు. ఏ భర్తా అంతటి సహనశీలిగా ఉండలేడని భావించాడు.

పూర్ణానందం ఆ కథను చదవమని తన కెందు కిచ్చాడో అర్థమైంది తనకు. ఇలాంటి హేళనల కెన్నింటికో తన కడుపు రగిలిపోయింది.

సుమతి చరిత్రలో తర్వాతి అధ్యాయం క్రొత్త పరిణా మాన్ని తెచ్చిపెట్టింది. ఊళ్లో కొందఱి పేర్లతో 'సుమతి' పేరు జత చేయబడింది. ప్లైలరు వీరాస్వామి, మునసబు కొడుకు గోపయ్య పేర్లు అలాంటి వాటిలో కొన్ని. తనకు జీవితమంటేనే రోత పుట్టింది. ఆ విషపూరిత వాతావరణంలో, ఆ నరకంలో బ్రతకలే ననిపించింది. మనుష్య సంచారంలేని ఏ సుదూర తీరాలకో పారిపోవా లనిపించేది. కాని, సుమతి జాలిచూపుల కన్నీటిధారలు తన ముందరి కాళ్లకు బంధం వేసినై. ఆమె అమాయకంగా చూస్తూ 'దేవుడులాంటి మీకు అబద్ధం చెప్తానా ?" అంటే నీళ్లు కారేవాడు తను. అంతలోనే లోకుల మాటలకు బాధతో హృదయం కలత చెందేది. కామేశ్వరి సుగుణసంపదను, ఆమెతో తాను గడపిన మధుర క్షణాల్ని గుర్తు చేసుకుని, వాటిని సుమతితో పోల్చు కుని మనస్సు వ్యథ చెందేది. హృదయంలో బడబాగ్నుల్ని, అగ్ని పర్వతాల్ని దాచుకొని రోజులు వెళ్లబుచ్చాడు. ఆ బడబాగ్నులు భయంకరంగా ఎగసి, ఆ విషజ్వాలలు తనను దహించివేసిన రోజు, ఆ అగ్నిపర్వతాలు బ్రద్దలై తనను తుత్తునియలు చేసిన దుర్దినం—అదే ఆరోజు !—

ఠాణాలో మూడు గంటలు మ్రోగినై. శంకరయ్య గుండెలమీద సమ్మెటపోటు లైనాయా గంటలు.

ఆ రోజును తా నెలా మరువగలడు ?

స్కూల్లో మీటింగుకు హాజరయి, బజారుపని చూసు కుని తాను ఇంటికి చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది. పరధ్యానంగా తలుపు తట్టబోయిన తను లోపలి గుసగుసల్ని విని ఆ ప్రయత్నం నుంచీ ఆగాడు. లోపల ఏవో కిలకిలలు, పకపకలు !—

క్షణంలో సగకాలం, ఒక లిప్తలో సహస్రాంశంసేపు గుండె కొట్టుకోవటం మానేసింది. కాలు వెనకడుగు వేసింది. కాని, అప్రయత్నంగా తలుపును దడదడ లాడించింది తన చెయ్యి. లోపలి వ్యక్తులు తికమక పడ్డారు. కలవరంతో తలుపు తీసిన సుమతి తనను చూసి దిగ్భ్రమ చెందింది. నేరస్థురాలిలా కంపించిపోయింది. ఈ హఠాత్సంఘటనకు తప్పుకుపోయే మార్గం లేక బిత్తరిచూపులు చూస్తూ గదిలో ఓ మూల ముడుచుకు నిలబడ్డాడు—టైలర్ వీరాస్వామి !

అసంభవమూ, ఊహాతీతమూ అనుకున్న సంఘటన సంభవిస్తే కలిగే ఆశ్చర్యం, ఆవేశం కూడా ఊహాతీతంగానే ఉంటాయి. తన పెదవులు బిగపడి పళ్ళు పటపట లాడినై. కళ్ళు నిప్పులు క్రక్కినై. బరితెగించిపోయిన కాముకుల్ని చూసి తనకేదో పిచ్చి ఆవేశం ఆవరించింది. టేబుల్‌మీద ఉన్న రూలర్‌ని తీసుకుని 'ఛా' అంటూ ఒకేఒక్క వేటు ..... !

''అబ్బా'' అంటూ కూలిపోయాడు వీరాస్వామి. తాను భయంతో నిలువెల్లా వణికిపోయాడు. ఈ గందరగోళానికి నలుగురూ చేరారు. తనకు కళ్ళు తిరిగినట్లు కావటం, తల పట్టుకు క్రింద కూలిపోవటం వరకే తనకు తెలుసు.

స్పృహ వచ్చి చూసేసరికి పోలీసుల ఎదుట పడున్నాడు తను. తాను వేసిన రూలర్ తగలరాని చోట తగిలి వీరాస్వామి మరణించాడని తర్వాత తెలిసింది. తాను హంతకుడుగా నిరూపింపబడ్డాడు. యావజ్జీవ కారాగార శిక్ష విధించారు తనకు.

చివరిసారి తనను చూస్తూ గ్రుడ్ల నీరు గుడ్ల కుక్కుకుంది సుమతి. తన కామెవైపు చూడటానికి అసహ్యం వేసింది. 'నాన్నా—నాన్నా' అంటూ రోదించాడు రఘు. వాణ్ణి చూసి తన కడుపు తరుక్కుపోయింది. శేఖరం కాంతంతో సహా తనను చూడటానికి వచ్చాడు. శేఖరం కళ్ళల్లో తా నానాడు ఎన్నెన్నో చదివాడు. తను రెండోపెళ్లి చేసుకున్నందుకే వాడికి కొంత బాధ ఉన్నట్లు తెలుసు తనకు. అలాంటిది పినతల్లి ఇంత నీచానికి ఒడిగట్టటం, తండ్రి ఒక హంతకుడుగా మారటం శేఖరం మనస్సును కలచివేసి ఉంటై. అందుకనీ అతనిలో తానంటే ఏదో ఏహ్యభావం గోచరించింది. కడసారి తనను పలకరిస్తూ అదే అన్నాడు. ''ఎలాంటివాళ్లం చివరికి ఎంత దుస్థితికి దిగజారేం, నాన్నా'' అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్న శేఖరం తన కళ్లముందు నిలుస్తున్నాడు. ఏమైనా తానంటే అసహ్యమే వాడికి. ఆవిధంగా చీకట్లోకి వచ్చేశాడు తను. చిత్రం ముగిసింది.

గాలికి ఎగిరివచ్చి తన ప్రక్కన పడిన జీర్ణపుటాన్ని చదివినట్లయింది శంకరయ్యకు. తన జీవన గ్రంథంలో నలిగిన పేజీ అది !

ఠాణాలో గంటలు మ్రోగుతున్నై. ఖైదీలు విశ్రాంతి చాలించే వేళయింది. జైలు వరండాల్లో కాపుదార్ల కేకలు ప్రతిధ్వనిస్తున్నాయి.

శేఖరానికి తనమీది ఏహ్యభావం ఇప్పుడు మాసి పోయిందో లేదో మరి ? రఘు ఎంతవాడైనాడో ? ఏం చేస్తున్నాడో ? ఈరోజు శేఖరం, రఘు—యిద్దరూ తనను తీసుకుపోవటానికి వస్తారు కాబోలు. సుమతి ఏమైందో ?

శంకరయ్య ఆలోచించలేకపోయాడు. బరువుగా కళ్ళు మూసుకున్నాడు. నులివేడి కన్నీరు కణతల్ని తడిపింది. చేతి చూపుడు వ్రేలితో అశ్రుకణాన్ని తుడుచుకుంటూ లేచి కూర్చున్నాడు. ఒళ్లంతా విరక్కొట్టినట్లుంది. ఏదో బద్ధకం దాన్ని పారద్రోలుతూ ఏదో ఉత్సాహం. ఆ ఉత్సాహాన్ని వెలుపలికి రానీకుండా భయం. ఆ భయాన్ని పెరుగనీయని నిర్లిప్తత. అనేక రకాలైన శారీరక, మానసికావస్థలకు లోనై ఊగిపోయాడు శంకరయ్య.

ఖైదీల కోలాహలం హెచ్చింది.

శంకరయ్య లేచి తలుపుదాకా వచ్చాడు. ఊచల్ని పట్టుకుని బయటికి చూడసాగేడు.

కొద్దిసేపటికి ఎవరో వచ్చారు. తలుపుతీసి తమ వెంట జైలు సూపర్నెంటు దగ్గరకు తీసుకుపోయారు.

శంకరయ్య దుస్తులు ఆయనకిచ్చి హితబోధచేశారు సూపర్నెంటు. పరితప్త హృదయంతో నూతన జీవితాన్ని ప్రారంభించి, జన్మ సార్థకం చేసుకోండి. తప్పుచేయటం మానవ సహజం. చేసిన తప్పును తిరిగిచేయటం రాక్షసతత్వం. కనక మళ్లీ ఏనేరానికి పూనుకోకండి.''

శంకరయ్య ఆయనకు నమస్కరించి ఇవతలకు నడిచాడు.

జైలు బయటికి రాగానే శంకరయ్యచూసిన వ్యక్తి—రిక్షా హేండిల్‌మీద ఒరిగి ఆతృతగా గేటువైపు చూస్తున్న రాఘవులు. తన రఘు పోలికల్ని అతనిలో వెతుక్కున్నాడు శంకరయ్య.

నాలుగు కళ్ళూ రెండయి ఆనందంతో మిల మిలలాడాయి!

'నాన్నా' అంటూ బావురుమని శంకరయ్య చేతుల్లో వాలిపోయాడు రాఘవులు. పుత్రగాత్ర పరిష్వంగ సుఖంలో పులకించిపోయింది శంకరయ్య హృదయం.

ఆనంద జలధినుంచీ బయటపడిన శంకరయ్య చుట్టూ చూసి కొడుకును అడిగాడు. ''అన్నయ్య రాలేదురా, రఘూ, అని

''ప్చ్'' అని పెదవి విరచి, ''ఇప్పుడు నాపేరు రాఘవులు నాన్నా'' అన్నాడు రాఘవులు, ముందడుగు వేస్తూ.

శంకరయ్య అంతరంగం కలుక్కుమంది. దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆయన కంఠంలో ఏదో కొట్టుకులాడింది.

''మీ అమ్మ.....' అని ఏదో అడగపోయేడు గానీ, ఆయన గొంతు మూగవోయింది.

ఎదురుగా ఉన్న ఎత్తు పల్లాల రోడ్డు వారికి స్వాగతం పలికింది.

# నత్కీరుని కథ ఔచిత్యము

శ్రీ నోరి నరసింహశాస్త్రి

శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునందు తృతీయాశ్వాసములో 92 గద్య పద్యములలో ధూర్జటి నత్కీరుని కథ చెప్పినాడు. బహుశః దాని కథా మూలము శ్రీ కాళహస్తి స్థలపురాణమై యుండును. ఇందులో, ప్రయత్న పూర్వకముగా గాని అప్రయత్నముగా గాని, శ్రీ కృష్ణదేవరాయుల సభలో మధ్య మధ్య కవులకు కవులకు నడుమ పొడసూపుచుండిన స్పర్ధలు, అసూయలు, వివాదములు ధూర్జటికి అనుభవ సిద్ధములు గనుక, అవి ఏ కొంచెమైనను ప్రతిబింబించి యుండునని భావించుట సహజమే. ఆధునిక కవులు, మిథ్యా దోషము ఆరోపించిన విమర్శకునిగా నత్కీరుని తరుచుగా ఉదాహరించుట పరిపాటి యైనది. కొంత వరకు ధూర్జటికి గూడ ఆ భావమే ఉన్నదేమో సందేహమే !

ఏమైనను, నిజముగా కథాంశము లందులోనున్నవున్నట్లు నిర్భయముగా సూక్ష్మ దృష్టితో పరిశీలించిన యెడల, నత్కీరుడు చేసిన సాహిత్య విమర్శ సహేతుక మనియే తోచును. ఆతడు చేసినా డను శివనిందయు, ఆ వచ్చినది వేషధారి యగు నైంద్రజాలికుడను భావముతో చేసినదే కాని, శివుడని తెలిసి చేసినది కానందున నిజముగా శివనింద యనుటకు గూడ వీలులేదు. అందులో నాతడు చూపిన నైతిక ధైర్యము హర్షింప దగినది. చివరకు శాపము పొంది తీర్థయాత్ర చేయుచు గూడ, 'ఈ కవితాభి మానము వహించితి నేటికి ?' అనియే విచార పడినాడు కాని, దుర్వాదము చేసితినని చింతపడలేదు. ఇట్టి అనుభవము మోమోటము లేకుండ విమర్శించు వారికి ఏ కాలమందైనను ఉండునదే. నత్కీరుడు ప్రదర్శించిన ధైర్యము అసూయా దోష దూషితులు చేయగలిగినది కాదు. అందువలన తుదకు అతని నీశ్వరుడు శపించుట అన్యాయముగా తోచును. ఈ సందర్భములో ఔచిత్యము లోపించిన దనికూడ తోపక తప్పదు.

ఈ విధముగా ఔచిత్య లోపమే కాక పరస్పరమువిరుద్ధముగా నుండి అసందర్భముగా కనిపించు నంశములు కూడ ఈ కథలో లేక పోలేదు. పాండ్య భూపతి సభలోని శంఖ ఫలకము అంతకు ముందెన్నడో అగస్త్యుడు ద్రవిడ కవిత్వ సరణి నిర్మించుచు ఇచ్చినది. అది కూర్చుండుటకు 'భారతీదేవి కెనయైన వారి కెందరికైన జోటిచ్చు' నట్టిది. అందుపై కథా కాలమందలి పాండ్యరాజు నత్కీరాది కవీంద్రులను పన్నిద్దర నుంచెను. వారందరును 'ద్రావిడ భాషాదేవీ గ్రైవేయక మనగ గీర్తి గని తత్కవితా శ్రీ విపుల శంఖ ఫలకముపై వసియింపం దగు విభాసిత మతులు.' వారింకను 'దివిష దన్న ప్రాయ వాగ్గుంభ సంపత్కావ్య ప్రతిపాదక ప్రతిభులు,' మరియు 'శైవ సంవిత్కాసార మరాళ రత్నములు.' అట్టి సభవారు మెచ్చునట్లుగా ఏ సరసుడు కవిత్వము చెప్పినను రాజు వేయి మాడలు బహూకరించుచుండెను.

మధురా నగరములో గొప్ప క్షామము వచ్చినది. ఆహారము కరవుకాగా భరింపలేక - అందలి మూల స్థానములోని హరద్విజుడు వలస పోదలచెను. ఆతనిపై మహేశ్వరుడు కరుణించి పాండ్యరాజు మీద అరవభాషలో 'శృంగార రసానుబద్ధముగా' పద్య మొకటి వ్రాసి ఇచ్చి దానిని రాజ సభలో చదివి రాజు వద్ద వేయి మాడలు తీసికొని కరవు తీర్చుకొమ్మని పంపెను.

పాప మాహరద్విజుడు రాజ సభకు పోయి ఆ పద్యము చదివెను. ఆ పద్యము పూర్తి పాఠమేదో మన కిప్పుడు తెలియరాదు. అరవ భాషలో చాటువులలో నైనను అది ప్రసిద్ధ

ముగా నున్నదో లేదో మన మెరుగము. ఇది ద్రావిడ భాషా కవి పండితులు విచారించి మన ఆంధ్రులకు తెలిపి విప్పదగిన చిక్కు. శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో చెప్పిన దానిని బట్టి అందులో 'సింధురరాజగమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు' అను నర్థము వచ్చు పదబంధము కలదట. అది విని నత్కీరుడు సభలో నవ్వుచు, "వేనలికి సహజగంధము కల దన్న, లోకము నవ్వదా ? ఇది తప్పు, చెప్పరాదు. కవితా సమయ మైనా లేదు. నీ విటు వ్రాయుట తగదు," అనెను. ఆ బ్రాహ్మ ణుడు మారుమాటాడక తలవంచుకుని పోయి పార్వతీశ్వరునికి జరిగినది విన్నవించుకొనెను.

అది విని, 'నేను చెప్పిన దానిలో తప్పుకూడా ఉండునా? అని అహంకరించెడి కొందరీకాలపు కవులవలెనే, నిటలాక్షుడు కోపించి నత్కీరుడు ఎట్లు తప్పు పట్టెనో చూతునని స్వయముగా సభకు వచ్చెను. సభకు వచ్చి, 'ఈరాజున్యుని మీద నేఁ గవిత సాహిత్య స్ఫురన్మాధురీ చారు ప్రౌఢిమఁ జెప్పి పంప విని మాత్సర్యంబు పాటించి నత్కీరుండూరకె తప్పువట్టెనట, యేదీ లక్షణంబోయలంకారంబో పద బద్ధమో రసమో చక్కం జెప్పుడా తప్పనన్. సరిగ్గా కొంద ఱాధునిక కవులు తమ పద్యములు తామే పొగడు కొనునట్లే ఈశ్వరుడును తన పద్యము పొగడుకొన్నాడు.' నత్కీరుడు చెప్పిన దోషము తెలిసియు, అతడు చెప్పని దోషముల మాట అసందర్భముగా ఎత్తి, ఏమిటా దోషమని గర్జించెను. మరల నత్కీరుడు వెనుకటి వలెనే ఆక్షేపించెను.

ముక్కంటి పాండ్యరాజు ప్రియురాలి మీద తాను చెప్పుటకు దిగిన పద్యమును సమర్థించు కొనుటకై "పార్వతీ దేవి కచ భారము సహజగంధము కలది" అని సమర్థించెను.

పాపము, నత్కీరు డప్పు డేమనెను ? "అగిరిజకచ భారమునకు సహజ గంధ ముండుట ఉచితమే, ఆమె పర మేశ్వరి. కాని ఈ లోకములోని స్త్రీల వెండ్రుకలకు సహజ గంధము కలదనుట తగదు. మత్సరము మానుము. గగన ప్రసూన వాదము ప్రత్యక్షమునకు సరికాదు. ఈలాలా మాలపు మాటలు చాలింపుము !"

ఫాలాక్షునికి కోపము వచ్చినది. తాను చేసిన పని సమర్థించుకోలేక, అధికారము ప్రదర్శించు అధికారి వలెనే, నత్కీరునితో హేతువాదము చేయలేక తన మహత్త్వము చూపి బెదరింప దలచెను. నిటల నేత్రము చూపినాడు నీలగ్రీవుడు !

ఆహా, ఏమి, ఆ నత్కీరుని ఆత్మ విశ్వాసము ! "నీ వెవ రవో మాయదారివిగా ఉన్నావు. తలచుట్టు ధార గన్నులు గలిగిన బద్యంబు తప్పు కాదన వశమే ? వలదిచ్చట నీ మాయా విలసనములు, పనికిరావు విడువుము" అనెను.

నత్కీరుడాతడు మాయా దారియే అని నిశ్చయించు టకు ఆధార మున్నది. నిటల నేత్రము చూపినచో భువనము లకే ప్రళయము రావలె. నత్కీరునితో పాటు రాజసభ యంతయు మాడిపోవలె. అది జరుగలేదు. నత్కీరునికి వేడికూడ తగులలేదు.

అప్పటికైనను సర్వజ్ఞునికి నత్కీరునిపై ననుగ్ర హము కలుగవలసినది. అట్లు కాకపోగా అధికార దుర్మదు డైన ఏ ప్రాకృత ప్రభువు వలెనో రుద్రుడు కోపించి నత్కీ రుని కుష్ఠ వ్యాధి వచ్చునని శపించినాడు.

అప్పటికి గాని తానంతవరకు వాదించినది ఈశ్వరునితో నని నత్కీరునికి తోచినట్లు లేదు. తోచిన వెంటనే అతడు శివుని పాదాలపై బడి శాపాంతము అనుగ్రహింపుమని ప్రార్థించినాడు. భక్తమందారుడు కైలాస శైల దర్శన ముతో వ్యాధి శాంతి పొందునని అనుగ్రహించినాడు. స్థల పురాణము లన్నిటిలోవలెనే, ఇక్కడ గూడ మధుర సుందరేశ్వ రుని కంటె శ్రీ కాళహస్తీశ్వరుడు ఎక్కువ మాహాత్మ్యము కలవాడను సూచన యున్నది.

"ఈ కవితాభిమానము వహించితి నేటికి ?— దేవుని తోడ నేల చార్వాక మొనర్చితిని ?" అని మొదలుగా పరితాప పడెనే కాని అసూయతో లేని దోషము ఆరోపించితి నని పశ్చాత్తాప పడలేదు, 'ఆ కవి సింహము !' ఆ 'నత్కీర కవి చంద్రుడు' ఇట్లెన్నో తీర్థయాత్రలు చేసెను. మధుర నుండి బయలుదేరి విక్రమసింహ పురము వద్ద పెన్నదాటి కూడా సమీపములో నున్న కాళహస్తికి పోక, కాశి గయా మొదలైన క్షేత్రాల వరకు కాళిదాస మేఘునివలె యాత్ర చేసెను. ఇంత బాధలో గూడ నత్కీరుని కవితాత్మ గమనింప దగినది. ఒక చోట వటవృక్షపు ఆకులు కొన్ని క్రింద నున్న 'జలాశయంబున సగమును తట ప్రదేశంబున సగంబును బడి మీన పక్షిత్వంబులు గైకొని లోపలికి వెలుపలికిం దివియు చమత్కారమును నత్కీరుండు చూచి యద్భుత రసపరవశుండై యుండె'నట. ఇంతలో భూత మొకటి యాతని నెత్తుకొని పోయినది. కుమార స్వామిని ప్రార్థింపగా స్వామి రక్షించి 'ఆ కవి మండలేంద్రుని' దక్షిణ కైలాస మగు శ్రీ కాళహస్తిని దర్శింప జేసెను. కుష్ఠవ్యాధి మానినది. అప్పుడు నత్కీరుడు ద్రావిడోక్తిలో నూరు పద్యములతో శివుని స్తుతించెను. జ్ఞాన ప్రసూనాంబా నాథుడు నత్కీరునికి ప్రత్యక్షమై ఆతడు కోరినట్లు సాయుజ్యము ప్రసాదించెను.

# నత్కీరునికథ ఔచిత్యము

భక్తానుగ్రహమునకై పరమేశ్వరుడు ఏమైన చేయ వచ్చును, అసందర్భముగా వాదించి యుండవచ్చును, ఈశ్వరుని లీలలు మానవ మాత్రులకు బోధపడునని కావు. శంభో మహాదేవా అని నమస్కరింప వలసినదే ! అంతేకాని అట్లు వాదించినది శివుడు కాక మానవమాత్రుడే అని భావించి విమర్శించినచో, నత్కీరుని వాదమే సమంజసమైన దనక తప్పదు.

ఆ పద్యములో ప్రతాప రుద్రీయములో 'విరుద్ధ' మని చెప్పిన కావ్యదోషము కందు. విరుద్ధము దేశ కాలాది విరుద్ధమని బహుధా చెప్పవచ్చును. ఇందులోనిది 'లోక విరుద్ధము'. ఈ దోషమునే కావ్యప్రకారములో 'ప్రసిద్ధి విరోధ' మనియు దర్పణములో 'ప్రసిద్ధి త్యాగ' మనియు చెప్పిరి. ఈ విరోధము అనుదోషము కవి సమయ సిద్ధమైనచో దోషము కాదు. అందువల్లనే నత్కీరుడు 'కవితా సమయంబున కొప్పు కాదు' అని కూడా చెప్పెను.

పద్మినీజాతి స్త్రీల శరీరమునకు పద్మగంధ ముండు నని ప్రతీతి కలదు. అది లోక సిద్ధమని తెలియని వారు కూడ కవి సమయ సిద్ధ మని యంగీకరింతురు. ఆ వాదమును శివుడు శ్రీ కాళహస్తి మహాత్మ్యములో ఎత్తలేదు. అది ఎత్తినను ఆ సహజ గంధము దేహమునకు గాని ప్రత్యేకముగా వేసరి కుండదని నత్కీరుడు ప్రతివాదము చేసి యుండును.

ధూర్జటి చెప్పిన నత్కీరుని కథలో ఎన్నో అసందర్భములు కూడ సూక్ష్మముగా చూచిన వారికి పొడగట్టును. కాని వాని నిప్పుడు ప్రస్తావింప తలంపలేదు. శివుని వాదములోని ఔచిత్యము, న్యాయమే ప్రస్తుత విషయము !

ఈ నత్కీరుని కథయే స్కాంద పురాణములో శివరహస్య ఖండములో కూడ నున్నది.[1] అందులోను శివుడే పద్యము వ్రాసి పంపినాడు. ఐతే అది అరవపద్యము వ్రాసి కాదు. సంస్కృత శ్లోకము. అదియు గౌరీ దేవిని గూర్చి చెప్పినది కాని రాజుగారి ప్రియురాలి మీద చెప్పినది కాదు. అక్కడ శివుడు భట్టు కవుల స్థితికి దిగజారి పోలేదు. ఆ శ్లోక మెంతో మనోహర మైనది. అందులో రాజుగారి ప్రియురాలగు సింధురరాజగమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు అని లేనేలేదు. నత్కీరుడు చూపిన దోషము అందులో లేదు. ఈశ్వరుని వాదము న్యాయ సమ్మతమై యున్నది. ఫాల నేత్రము చూచి భస్మమై పోవలసిన నత్కీరుడు అట్లు కాక పైపెచ్చు అధిక ప్రసంగము కావించినట్లు అందులో లేదు. స్కాంద పురాణ కథ చదివిన తరువాత ధూర్జటి కథలో నత్కీరునితో శివుడు చేసిన వాదము సమంజసముగా లేదని మరింత దృఢ పడగలదు. స్కాంద పురాణ కథ ఆ నోట ఆ నోట పడి స్థల పురాణ కథలోని కెక్కి యుండును. ధూర్జటి భక్తి భావము చేతను ప్రమాణ బుద్ధి చేతను, దూరము విమర్శింపక ఉన్న దున్నట్లు గ్రహించెనని తోచును. అందు వల్లనే అప్రయత్నముగానో ప్రయత్న పూర్వకముగానో ధూర్జటి నత్కీరునిపై అభిమానాదరములు కూడ ప్రదర్శించినాడు.

మరిందు ధూర్జటి కథలో కవులు కూర్చుండు శంఖ ఫలకము పాండ్య రాజులకు అగస్త్యుడు ఎప్పుడో పూర్వయుగములలో బహూకరించినది. అందులో నాతడు అష్టాదశాక్షర మాతృక వ్రాసి 'ఇది ద్రవిడ కవిత్వ సరణి' అని చెప్పెను.

స్కాంద పురాణ కథలో 48 మంది పండితులు రుద్రాభిషేకములు చేసి స్తుతి చేయగా, సుందరేశ్వరుడే ఒక పీఠము ననుగ్రహించినట్లున్నది. అది అకారాది క్షకారాంత మాతృ కాక్షరములతో, అనగా పంచాశద్వర్ణములతో అలంకరింపబడి చంద్ర బింబాకారముగా నున్న సరస్వతీ పీఠము. దానిపై మొదట కూర్చున్నవాడు కపిలుడు. తక్కిన వారిలో అసూయాధురంధరుడగు నత్కీరుడు కూడ నొకడు. అతడు తానే పండితోత్తముడ నని పొగడుకొనుచు బ్రాహ్మణ వేషముతో వచ్చిన సుందరేశ్వరునితో ఒకమారు వృధా వాదము చేసి ఆకాశవాణి వచనముచే పరాభూతుడయ్యెను. ఆకాశవాణి, 'నత్కీరుడు పండితోత్తము డైనను ఈ విప్రునకు తుల్యుండుకాడు' అని చెప్పినది. శ్రీ కాళహస్తి మహాత్మ్యములోని వాద కథకు మూలమైనది ఈ వంశ శేఖర భూపాలుని కుమారుని కాలములో మరియొక మారు శివునితో నాతడు చేసిన వాదమునకు సంబంధించినది. ఆ కథ ఇట్లున్నది.

వంశ శేఖర భూపాలుని తర్వాత అతని కుమారుడగు వంశ చూడామణి పాండ్య దేశమునకు రాజయ్యెను. అతడు గుణములచేతను శివభక్తి చేతను తండ్రి కంటె గూడ నధికుడు. ఆరాధనలలో నాతడు విశేషముగా చంపక పుష్పములను ఉపయోగించుట చేత అతనికి చంపక పాండ్యుడను నామము ప్రసిద్ధ మైనది. ఒకనా డతడు పార్వతీదేవిని పూజించుచుండగా, ఆమె శిరోరుహములు ఘుమఘుమ మని పరిమళింప సాగినవి. ఆ చిత్రము చూచి, ఈ పరిమళము సహజముగా నున్నదా, సాంసర్గికముగా కలిగినదా, యని వితర్కింప సాగెను. తన సందేహము తీర్చుకొనుటకు ఒక యుపాయము చేసెను. వేయి నిష్కములతో ఒక నీవి (పందెపు ముడుపు)

1. శ్రీ నోరి గురులింగ శాస్త్రి పూజ్యపాదుల ఆంధ్రీకరణము ననుసరించితిని.

విర్మించి తన యభిప్రాయము తెలిపిన వారికి ఆ నీవి నిత్తునని ప్రకటింప జేసెను. సరస్వత్యంశసంభూతులైన సంఘ కవులు వచ్చి ఎవరికి తోచిన విధముగ వారు పద్యములు చెప్పిరి. అవియేవియు రాజు నభిప్రాయమునకు సరిపోలేదు. అందులకు పండితులు ఖిన్నులైరి.

అప్పుడు మధురలో తర్క వ్యాకరణములు బాగుగా చదివిన సుందర నాథుడను బ్రహ్మచారి యుండెను. ఆతడు శివభక్తుడు. తన సహాధ్యాయు లందరకు వివాహము లైనను తనకు దారిద్ర్యముచే కాలేదని సిగ్గు పడుచుంటినని సుంద రేశ్వరుని అనేక విధముల స్తుతించెను. ఈశ్వరుడు దయా ళుడై పాండ్యరాజు అభిప్రాయమునకు అనుకూలముగా శ్లోక మొకటి వ్రాసి ఇచ్చెను. ఆ బ్రహ్మచారి ఆనందించి పత్రిక గ్రహించి చంపక పాండ్యుని యెదుట నిట్లు చదివెను :

"జానాసి పుష్ప గంధాన్
భ్రమర త్వం బ్రూహి తత్త్వతో మేఽద్య
దేవ్యాః కేశకలాపే
తుల్యో గంధేన కిం గంధః ?"

(భ్రమరమా, నీవు ఎన్నో పుష్ప గంధముల నెరుగు దువు. దేవి కేశ కలాపమందలి గంధముతో తుల్యమైన గంధ మేదో దాని తత్త్వము నా కిప్పుడు చెప్పుము.)

ఆ శ్లోకము విని నత్కీరుడు తప్ప తక్కిన పండిత్తు లందరు సంతసించి, 'పార్వతీ దేవి కేశ కలాపములోని పరిమ ళము సహజమా సాంసర్గికమా అని రాజుగారికి సందేహము కలదు. అది దీనితో తీరినది' అని వ్యాఖ్యానించిరి. నత్కీరుడు మాత్రము అసూయాపరుడై ఇట్లాక్షేపించెను : "పండితు లారా, మీ రందరు వివేకధనులు. పార్వతి శిరోరుహముల యందు సహజ పరిమళము కలదనియు అది సాంసర్గికము కాదనియు చెప్పెడి ఈ బ్రాహ్మణుని మాటలు శ్లాఘించు చున్నారు. లోకమున నెక్కడ నైనను శిరోరుహములకు సహజ పరిమళ ముండునా ?"

ఆ పరిహాస వాక్యములు విని సుందర నాథు డిట్ల నెను. "ఓ పండితులారా, నా వాక్యములు యుక్తములు కావని ఈ నత్కీరుడు వచించుచున్నాడు. మా ఇద్దరి వాదము లలోని సత్యా సత్యములు నిర్ణయించుటకు సుందరేశ్వరుడే ప్రమాణము !" ఇట్లనుచు సుందరేశ్వరు నాతడు ప్రార్థిం చెను.

వెంటనే సుందరేశ్వరుడు కవి వేషము ధరించి వచ్చి, "ఓ విబుధులారా, ఈ విప్రుని వచనములను ఆక్షేపించిన దెవరు ? శాస్త్ర యుక్తులచే నాతని పరిభవించెదను.' అనెను. నత్కీరుడది విని కోపించి "ఓ పండితాధమా, ఈ బ్రాహ్మణుని నధిక్షేపించినది నేనే. నా వాదములో దోషము చెప్పు" మనెను.

సుందరేశ్వరుడాతని వాదములో దోషము లెన్నో ప్రద ర్శించి సభలోని పండితులే పరిశీలించి న్యాయము చెప్పగల రనెను. నత్కీరుడు వినిపించుకొనక రెట్టించిన కోపముతో, "ఓరీ పండితాధమా, కేశములందు సహజ మగు పరిమళ ముండదని నే నంటిని. అందులో దోషమేమి ?" అనెను.

దానికి సుందరేశ్వరుడు, "ఓరి పండితం మన్యుడా, పద్మినీజాతి స్త్రీల కేశములందు సహజమగు పరిమళ ముం డును. ఇది లోకప్రసిద్ధమైన విషయము కదా ! ఇంత మాత్రమే నీకు తెలియదా ?" అనెను.

నత్కీరు డప్పటికిని తన పట్టు విడువక, "ఓ బ్రాహ్మణా ధమా, పద్మినీజాతి స్త్రీలకు కురులయందు ఈ కాలములో పరిమళ ముండదు" అని వాదించెను.

అది విని చంద్రశేఖరుడు, "ఓరి మూర్ఖాగ్రేసరా, లోక ప్రసిద్ధమైన పద్మినీజాతి స్త్రీల కేశముల సహజ పరిమళమునే కాదనుచున్నావు. మరియు దివ్య స్త్రీల కేశ పాశములందు సహజ పరిమళము ఒక కాలమందు ఉండు ననియు మరియొక కాలమున ఉండదనియు నీ వెట్లు చెప్ప గలవు ? నీ కది తెలియదు" అనెను.

నత్కీరుడు మొండితనము వదలక, "ఓరీ దుష్ట కులాగ్రణీ, కేశపాశము కస్తూరి కాదుల చేతను ప్రసూనాదుల చేతను సాంసర్గికముగా పరిమళించునని తెలియనేరక, అది సహజగంధ మని కామమోహితు లెన్నుదురే కాని విజ్ఞులది ఒప్పుకొనరు" అని వాదించెను.

తుదకు నత్కీరుని నిరుత్తరుని గావింప దలచి సుంద రేశ్వరుడు ఇట్లనియె : "ఓరి దుష్టా, పార్వతీదేవి కేశపాశము సర్వదా పరిమళము కలది. ఆమె సకలా వయవ సౌందర్యము నే నొక్కడనే ఎరిగిన వాడను. నేను వ్యర్థముగా పలుకు వాడను కాను."

ఆ వచనములకు సభలోని పండితులెల్లరు పరమానంద భరితులైరి. నత్కీరుడు మాత్రము, "నీ వచనములు నమ్మ దగినవి కావు" అని తిరస్కరించెను.

సుందరేశ్వరుడు కోపోద్దీపితుడై "ఓరీ మూఢా, జ్ఞానలవ దుర్విదగ్ధుని బ్రహ్మకూడ మెప్పింపలేడు. నిను చూచిన పాపము వచ్చును," అనుచు నత్కీరుని దగ్ధమ

చేయుటకు ఫాలనేత్రము తెరువ దలచియు నంతలో నంత ర్హితుడయ్యెను. శివుని భావనా మాత్రము చేతనే, నేత్రానలము ఏ కొంచెమో సోకి నత్కీరుని శరీరము తపించి పోయెను. అతడు ఆ తాపమునకు తాళలేక హేమ పద్మాకర జలము లలో ప్రవేశించి సుందరేశ్వరుని అనేక విధముల స్తుతించి ఈశ్వరానుగ్రహముచే మరల ప్రకృతి నొందెను.

సుందరనాథుడు చంపక పాండ్య భూపాలుని వలన సహస్ర నిష్కములు కల నీవిని పరిగ్రహించి దానితో సుంద రాంగి యగు కన్యను వివాహ మాడెను.

ఇట్లున్న స్కాంద కథకును ధూర్జటి చెప్పిన కథ కును ఎన్నో పోలికలును భేదములును ఉన్నవి. స్కాందమ్ము లోని నత్కీరుని వాదము యుక్తికి, శాస్త్రమునకు, అనుభవము నకు, న్యాయమునకు విరుద్ధమైనది. సుందరేశ్వరుని వాదము యుక్తి, శాస్త్రము, లోకానుభవము, న్యాయములకు తోడుగా ఆత్మానుభవముతో కూడి యున్నది. నత్కీరు డిందులో కేవ లము మూర్ఖుడుగాను అసూయాపరుడుగాను కనబడు చున్నాడు.

మరి ధూర్జటి తన ప్రబంధములో అందులకు విపరీతముగా ఏల వ్రాసెను? అతడు స్కాంద పురాణ కథ చూచి ఉండడా? మహా శివభక్తుడగు ధూర్జటి స్కాందము చూడలేదనుట సాహసము. కాక అతడు చూచిన స్కాంద పురాణ ప్రతిలో నత్కీరుని కథ లేకపోయి యుండవచ్చును. వేంకటగిరి వారు సంస్కృత కాళహస్తి మహాత్మ్య మొకటి ముద్రింపించిరట. ధూర్జటి సోదరునికి శ్రీ కృష్ణరాయ విజయకర్త యైన కుమార ధూర్జటి మనుమడు. కుమార ధూర్జటి పుత్రుడైన లింగరాజుకవి సంస్కృత కాళహస్తి మాహాత్మ్యము ననుసరించి తెలుగులో ఒక కాళహస్తి మహా త్మ్యము వ్రాసెను. అందులో నత్కీరుని కథ లేదని శ్రీ కాళ హస్తి మాహాత్మ్య ప్రకటనకర్తలు పీఠికలో తెలిపిరి. స్కాంద ములో నత్కీరునికి శ్రీ కాళహస్తితో సంబంధము లేనందున అది వదలి, అట్టి సంబంధము కల్పించిన స్థలము పురాణ కథను ధూర్జటి గ్రహించి యుండును. ఏమైనను ధూర్జటి ఏ మూలము ననుసరించి తన ప్రబంధము రచించెనో తెల్చు కొననిది ఇదమిత్థమని నిర్ధారణచేయ సాధ్యముకాదు.

సుందరేశ్వరుడు నత్కీరుని త్రొక్కివేయుచున్నట్లు మధురలో శిల్పమూర్తి కూడ కలదు. అది ఈ రెండు కథల లోను లేదు. అందువలన నత్కీరుని కథ ఎన్నెన్ని రూపములు పొందినదో కూడ పరిశోధన చేయవలసి యున్నది.

నత్కీరుడు ద్రావిడ భాషలో రచించినాడను ప్రతీతి కల శతక రూపమగు శివస్తుతి మీద ధూర్జటి కెంతో అభి మాన మున్నది. చతుర్థా శ్వాసములోని వేశ్యా పుత్రికల కథలో వారు 'కవితా చమత్కారము మీద నత్కీరుడు చెప్పిన మూరు పద్యంబులు పాఠంబు చేసి నిత్య వ్రతంబు గాచరించు చుండిరని వర్ణించినాడు. మరల వారు శ్రీ కాళహస్తి విభుని గోపురము సమీపించుచు గూడ 'ద్రవిడ కవి రచితనుతిశతక మవిరళగతి జదువుకొనుట నన్య విచార వ్యవహార దూరులగు చున్ భవభవన ద్వారమును గదిసి'రని పలికినాడు.

మరియొక విశేషము కూడ శ్రీ కాళహస్తి మాహాత్మ్య ములో కనబడుచున్నది. ద్వితీయా శ్వాసములో 'శతానందు' డైన బ్రహ్మదేవుని కామవాంఛకు అనుకూలముగా వాణి 'శత వాగ్వన జాననలుగ' రూపొందిన కథ కలదు. భూతమునకు ఆహారము కానున్న వారిలో నత్కీరుడు సరిగా నూరవవాడు. మనుష్య శతకమునే గాని ఆ భూత మాహరింపదు.

ఇప్పుడది ఉపలబ్ధమైనను కాకున్నను, ఎన్నడో ద్రావిడ భాషలో నత్కీరుడు శ్రీ కాళహస్తీశ్వరుని మీద శతకము చెప్పినాడను ప్రతీతి వినియున్నందుననే, ఆంధ్ర భాషలో ధూర్జటి తన శ్రీ కాళహస్తీశ్వర శతకము వ్రాసి నట్లు తోచుచున్నది. అది చదివిన వారికి కవిధూర్జటి జీవితములో పొందిన కష్ట సుఖములెన్నో పొడకట్టును. అతడు ప్రాపంచిక రాగద్వేషములచే నా కృష్టుడై కలత నొందుచు, ప్రయత్న పూర్వకముగా శ్రీ కాళహస్తీశ్వరు నకు తన సర్వస్వమును కట్టివేసుకొనుటకు పొందిన ఆరాటము, చేసిన తీవ్రసాధనయు శతకములో గోచ రించును. భక్తుని ఆర్తి అందులో ప్రతిబింబించుట చేతను ధూర్జటి శతకము శివభక్తులకు నేటికిని నిత్య పారాయణ యోగ్యమైన భక్తి శతకముగా ప్రచారములో నున్నది. ఆ శతక ములో శ్రీ కృష్ణదేవరాయల అవసానకాలములోని విజయ నగర పరిస్థితులు కూడా కొంత కొంత స్ఫురించుచున్నవి.

ఈ విధముగా నత్కీరుని కథలోని ఔచిత్యముతో పాటు దానికి సంబంధించిన విషయములు సహృదయులు విద్వాంసులు పరిశోధకులు వెలువరింప దగినవి ఎన్నో ఉన్నవి.

# షేక్స్పియర్ వ్యక్తిత్వము

శ్రీ ఎఫ్. సి. ఔలట్*

షేక్స్పియర్ మనీషను గూర్చి, ఆయన వ్యక్తిత్వాన్ని గూర్చి యివాళ చెప్ప బూనుకోవటం కొంతవరకు సాహసమే అవుతుంది. ఏమంటే, సదుద్దేశంతోనే ఆ సాహసం చేస్తున్నా ఆదిలోనే ఎదురయ్యే పరిస్థితి— "అతని పర్స్ ఖాళీ, అతని బంగారపు మాటలన్నీ యిదివరకే ఖర్చయిపోయాయి,"— అని ఆస్రిక్‌ను గూర్చిహోరేషియో అన్న మాటలే యిక్కడా వర్తిస్తాయి. తరతరాలుగా ఎంతో మంది రచయితలు, పెద్దా చిన్నా, వ్రాసి పెట్టుతూ వచ్చారు—మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తూ, తికమక పెట్టుతూ, అడపా దడపా కొంత కొత్త వెలుగు చూపుతూ, లేకపోతే ఏదో ఒక కొత్త సంగతిని వెదకిపట్టి దాన్ని యిదివరకే తెలిసినవాటి పొత్తుకి చేర్చుతూ, పెద్ద పుస్తక భాండాగారాలే తయారుచేసిపోయారు. ఆ షేక్స్పియర్ సిబ్బందికి చెందిన వారిలో సామాన్యుడైన ఒక అనుయాయి చెయ్యగలిగిం దేమిటి ? కేవలం చెప్పే ధోరణిలో కొంత మార్పు చూపిస్తూ చేతనైనంతవరకు పాత కథనే తన సొంత మాటల్లో (సొంతమంటూ ఏవైనా ఉంటే), అందులో తన మనస్సుకు హత్తిన భాగాన్ని, మళ్లీ చెప్పటం— అంతకుమించి అతను చేసేదేమీ ఉండదు. అలా చెప్పటంలో, ఉద్దేశించినా ఉద్దేశించకపోయినా, తనదైనది ఏదో కొంత—అది అతని 'అవ్యక్తతే' కావచ్చు—దాన్ని బయట పెట్టుకోవటం కూడా జరుగుతుంది.

వ్యక్తిగా షేక్స్పియర్ మనల్ని మంత్రముగ్ధుల్ని చేసి ఉన్నాడు. (అది మనకు తెలిసినా తెలీకపోయినా). ఆయనతోడి సాన్నిహిత్యం మన మానసిక, ఆధ్యాత్మిక జీవనం మీద ఒక పరివ్యాప్త ప్రభావంగా ఉంటూంది. అందువల్లే మనం ఆయన్ని గూర్చి ఆలోచించటం మానుకునే ప్రమాదం కూడా ఉంది. పరిచయం మితిమీరితే వస్తువుపట్ల నిర్లక్ష్యం వహించటమే కాదు— అసలు వస్తువునే గుర్తించలేక పోవటం సంభవిస్తుంది. అందుకే, అవకాశం వచ్చినప్పుడు ఎప్పుడైనా ఒకసారి, ఈ సన్నిహితుణ్ని స్మృతికి తెచ్చుకోవటం, మనమీద ఏర్పడివున్న అతని ప్రభావానికి కారణాలలో కనీసం ఒక్కటైనా జ్ఞాపకం చేసుకోవటం మంచిదని తోస్తుంది.

షేక్స్పియర్ ఎలిజబెత్తు యుగానికి ప్రతినిధి కానే కాడు. మార్లో, బెన్ జాన్సన్‌లకి మల్లే, డ్రేక్, గ్రెన్‌విల్, ర్యాలీ, ఎస్సెక్స్‌లకు మల్లే ఆయన తన యుగానికి ప్రాతినిధ్యం వహించటం లేదంటాను. ఎటొచ్చీ హాస్యదృష్టి ఆ యుగం వారిలో తక్కువపాలే నని చెప్పాలి. పైన పేర్కొన్న వారిలో బెన్ జాన్సన్ ఒక్కడే హాస్య దృష్టిని తన స్వభావంలో ఎంతో కొంత విశేష ద్రవ్యంగా వ్యక్తం చేసినవాడు. వారి సమకాలికుడే అయినా షేక్స్పియర్ హాస్యరస చక్రవర్తి.

---

* ఈ ఏప్రిల్ 23 వ తేదీకి మహాకవి విలియం షేక్స్పియర్ జన్మించి 400 సంవత్సరాలు అవుతుంది. ఆయన మరణతేదీ కూడా ఏప్రిల్ 23 (1616) అన్ని దేశాలవారు షేక్స్పియర్ జయంతి ఉత్సవాలు జరుపుతున్నారు. బ్రిటన్‌లో ఒక ఏడాదిపాటు ఈ ఉత్సవం జరపడానికి ఏర్పాటు చేశారు. ఈ సందర్భంలో శ్రీ ఔలగారిట్ . వ్యాసం ప్రచురిస్తున్నాము. శ్రీ ఔలట్ ప్రసిద్ధ షేక్స్పియర్ పండితుడు. ఇప్పుడు షేక్స్పియర్ జన్మస్థలమైన స్ట్రాఫర్ అపాన్—యావన్‌లో జరుగుతున్న ఈ ఉత్సవాలు లండన్‌లో జరపాలని, అందుకు తగిన పథకాన్ని తయారుచేయమని వీరిని బ్రిటిష్ ప్రభుత్వం కోరింది. షేక్స్పియర్ కాలంనాటి దృశ్యాలను లండన్‌లో నిర్మించి, ఉత్సవాలు చేయాలని రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వమే అనుకున్నారు. కాని యుద్ధం మూలాన విరమించుకొనవలసి వచ్చింది —సం.

ఆ యుగం దుర్గంధానికి, మోటుదనానికీ, పాశవిక ప్రవృత్తికీ పేరువడ్డ యుగం, ఇంద్రియత్వంలో మార్దవం లుప్తమైన కాలం—షేక్స్పియర్‌లో యీ విషయాల పట్ల పెరుగుతూ వచ్చిన ఏహ్య భావమే, ఆయన చివరి పరిణామానికి కీలకమైనదంటూ డాక్టర్ డోవర్ విల్సన్ అభిప్రాయ పడుతున్నారు కూడా. అసహనం, కర్కశత్వం కరడు గట్టిన ఆ యుగంలోనే అనన్య సామాన్యమైన మానవతా దృష్టి, మహా కరుణా కలిగిన వ్యక్తిగా షేక్స్పియర్ జీవించాడు.అది గుర్తించిన డాక్టర్ జాన్సన్ (అలా గుర్తించగల్గటమే ఆయన గొప్పదనం) షేక్స్పియర్‌ను 'సాధు షేక్స్పియర్' అని వర్ణిస్తూ 'ఆయన ఒక యుగానికి చెందినవాడు కాడు, అన్ని కాలాలకూ చెందినవాడు' అన్నాడు. కవిత, రాబోవు యుగాల్లో ఎంతో చైతన్యవంతంగా నవనవోన్మేషంగా భాసించవచ్చు. ఇప్పటికంటె ఎక్కువ కారుణ్యంతో ఆర్ద్రమైన సంస్కృతి బహుధా విస్తృతం కావచ్చు. తన యుగంవాళ్లందరిలోనూ షేక్స్పియర్ ఒక్కడే ఇప్పటికి అప్పటికీ, అన్ని కాలాలకూ నిలబడ గలిగేవాడు. జాన్సన్ షేక్స్పియర్‌కు వాడిన 'సాధు' అన్న విశేషణం విషయమై నేనింకోచోట చేసిన వ్యాఖ్యానాన్ని ఇక్కడ ఉట్టంకిస్తాను. కోలెరిడ్జ్ కూడా ఇలానే తన మిత్రుడు 'ఈలియా' ను 'సాధు' వనటం ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తుంది. అది 'ఈలియా' కు కోపం కలిగించిందట. 'సాధు' వనగానే జన్మతః వచ్చే సంస్కారం మర్యాదా, మన్ననా, సహనమూ, కారుణ్యమూ, ఆధ్యాత్మికౌన్నత్యమూ, సూచ్యము. సత్త్వ దారిద్ర్యానికీ ఈ గుణాలకూ ఎక్కడా సంబంధమే లేదు. సాధువనే భావాన్ని సత్త్వ దారిద్ర్యంతో ముడిపెట్టి అన్వయం కుదిర్చే ద్వంద్వార్థమున, 'ఈలియా' అనుకున్న విధంగా, వీల్పడదు. నిజానికి అతను నొచ్చుకోవటమూ అనవసరమే. ఎందుకంటే ఇంగితజ్ఞానం ఉన్నవా డెవడూ సత్త్వ సంపన్నుడైన లాంబ్ (ఈలియా) ను 'సాధు' వనటంలో విపరీతార్థ మున్నదంటూ ఆ పదం యొక్క అర్థాన్నే వ్యర్థం చెయ్యటానికి పూనుకోడు. ఆ 'సాధు' విశేషణం షేక్స్పియరుకూ అన్వయిస్తుంది.

అందుకే ఎలిజబెత్ యుగానికి ఆయన ప్రతినిధి కాడు అంటాను. అంతకంటే విశేషమైన గొప్పదనం, మంచితనం ఆయనలో ఉన్నాయి. శీలం రీత్యా మన జాతి ఉత్కృష్ట గుణాన్ని పుణికి పుచ్చుకొన్నవాడు, రచన రీత్యా మన సాహిత్య ఉత్తమ లక్షణా లన్నింటినీ పుంజీభవింపచేస్తూ ఉదాత్త పరచినవాడు, సహజ ధారాశుద్ధితో అవలీలగా కవిత వ్రాస్తూ మన చరిత్ర స్వర్ణ యుగంలో సమకాలికుల ఉత్తమ కృషితో తన కృషిని సంగమింప జేసినవాడు—షేక్స్పియర్ విశ్వజనీనత సిద్ధింపజేసుకొన్న ఇంగ్లీషువాడు.

ఇంగ్లండ్ దేశపు కవులలో అగ్రగణ్యుడైన కవికి ఆ దేశపు నడిబొడ్డే జన్మస్థలం కావటం ఎంతో రమణీయార్థ ప్రతిపాదకంగా ఉంది. మానవు లందరికీ ఆశ్చర్యం కలిగిస్తున్న సృజనాత్మక ప్రతిభ ఆయన సొత్తు. దానితోపాటు తన జాతివారి విశిష్ట గుణాలు— మేధకూ హృదయానికీ సంబంధించినవి— ఆయనలో సమ్మేళనం చెందటంతో వాటికి కూడా ఆయన ప్రతినిధి అయ్యాడు. ఇంగ్లండు దేశపు కేంద్ర స్థానంలో పుట్టి పెరిగిన ఆయన తన శీలంలో చక్కని స్థిత ప్రజ్ఞత్వం— "కేంద్రస్థమైన (ఆత్మకు సంబంధించిన) గుణాన్ని—వ్యక్తం చెయ్యటం అది కేవలం భగవదేచ్ఛ అనాలి. అందుకే మన అదృష్టం ద్విగుణీకృతం. మన కవులలో ప్రథమ గణ్యుడే, ఆంగ్లత్వం పూర్తిగా ప్రతిబింబించిన రచయిత కావటం, ఆంగ్లత్వంలో అపురూపమైన - దేదైతే ఉన్నదో దాన్ని యశో ప్రభాసిత శిఖరాలకు తీసుకువెళ్లి అక్కడినుంచీ విశ్వాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా పాలించటం. ఆయన ఈ విశాల ప్రపంచానికంతటికీ చెందినవాడు— నిజం, ముమ్మాటికీ నిజం—కాని ఆయన ఈ ద్వీపానికి, ఈ యింటికి చెందినవాడు. ఈ దీవి సారం, ఆంగ్లేయుల ఆంగ్లత్వం ఆయనలో ఉంది. ఆయన మావాడు అని మనకు మనం చెప్పుకోవటంలోనూ న్యాయం ఉంది. ఆయన మనీషతో వెలుగుతున్న మనఃసౌధంలో, జాజ్వల్యమానమైన ఆ గదుల్లో, ఇష్టమున్నవా రందరూ స్వేచ్ఛగా విహరింపవచ్చు. కాని, అందులో ఒకానొక లోపలి గది మాత్రం ఇంటివాళ్లు తప్ప మరెవ్వరూ ప్రవేశింపరానిది. అది 'కేవలం మనకోసం ఎప్పుడూ ఉండే ఒక ప్రశాంత నికుంజం. అది తియ్యని కలలతో నిండి ఆరోగ్యంతో శాంత నిశ్వసితమైన సుషుప్తి.' చివర, ఆయన జీవితమే 'సుషుప్తితో పరిపూర్తి చెందటం' (Rounded with a sleep), మాతృమూర్తి ఇంగ్లండు ఆయన్ని ఎదలో దాచుకోవటం— అంతకంటే రమణీయమైన ఔచిత్యం ఉండగలదా ? "కవి భావనాశక్తి పారమ్యంలో కూడా ఈ సమాధి స్థలం కంటే అర్హమైనదాన్నీ, ఉచితమైన దాన్నీ, ఆంగ్లత్వం సువాసించేదాన్నీ, మన కవికి జన్మ సంబంధియైన దాన్నీ ఊహింపలేను :... స్ట్రాట్‌ఫర్డ్‌లోని ఈ నిరాడంబరమైన మారుమూల ప్రదేశమే సమాధి ఉండటానికి ట్రోడ్, అక్రొపోలిస్, మారథాన్ క్షేత్రాల కంటె ఎంతో తగిఉన్నది....." అంటూ హేడన్ అనే చిత్రకారుడు షేక్స్పియర్ సమాధిని దర్శించి తన 'జర్నల్' లో వ్రాసుకున్నాడు.

# షేక్‌స్పియర్ వ్యక్తిత్వము

షేక్‌స్పియర్ వ్యక్తిత్వాన్ని గూర్చి ఎవరి మట్టుకు వారికి మనస్సులో ఒక ఊహాచిత్రం ఉంటుం దనుకున్నాను. మనకు తెలిసింది తక్కువే కావచ్చు. కాని, ఆయన సమకాలికుల్లో కీర్తికాయులైన చాలమందిని గూర్చి తెలిసినదానికంటె ఎక్కువే తెలుసు. ఆయన జీవితాన్ని గూర్చి తెలిసిన సంగతుల ద్వారా, మన ఎదుట ఉన్న ఆయన రచన ద్వారా (అది ఎంత వస్తు ప్రధానమైన రచన అయినా) మనకు ఒక పూర్తి చిత్తరువు కాకపోయినా దాని బదులు కనీసం స్పష్టమూ, విశ్వసింప దగినదీ అయిన ఒక గట్టి అభిప్రాయం లభిస్తోంది. ఆయన సౌమ్యత, సంస్కారం, సాధుస్వభావం—దురుసుతనానికీ, అల్లరికీ అలవాటుపడ్డ యుగంలో—స్పష్టంగా ఆయన్ని ప్రత్యేకించి చూపటంవల్ల కాబోలు వ్యక్తిగతంగా ఆయన్ని ఎరిగున్నవా ళ్లందరూ వాటినే శ్లాఘించారు. బెన్ జాన్సన్ అభిమాన పురస్సరంగా వీడ్కోలు చెబుతూ వ్రాసిన పంక్తుల్లోనూ ఈ గుణాలనే విపులీకరించాడు. చాకచక్యమూ, వ్యవహారాలమీద ఆసక్తి వంటి గుణాంతో పైవాటికి వైరుధ్యమేమీ లేదు. లేకపోవటం ఈ కవి అసాధారణతలో అదీ ఒక భాగమే. వాల్టర్ బేజ్ హట్ డిస్రేలీని గూర్చి చెబుతూ, ఆయన (మంత్రిగా) ఆ ఆర్థిక శాఖను తీసుకున్నప్పుడు ఎంతో ఉత్సాహం చూపించాడనీ, కారణము తను 'రెడ్—టేప్' వాళ్ళ చేసే పనిని, అది తప్ప మరేమీ చేతకాని వాళ్ళకంటె, మెరుగ్గా చెయ్యగలనని చూపేందుకు సరదా పడడమేననీ అంటాడు. షేక్‌స్పియర్ విషయంలోనూ అలాగే అన్వయం. "ఇంగ్లీషువాళ్ల భక్తి శ్రద్ధలు ఎలాంటివంటే, వాళ్ళు తమ మహాకవిలో ఉత్కృష్టమైనదిగా ఎంచుకున్నదాన్ని చాల జాగ్రత్తగా స్మరిస్తూవచ్చారు—అది ఆయన ఆస్తిపాస్తులు సంపాదించిన విషయం." బేజహట్—తనూ బాంకర్, విక్టోరియన్ కావటంవల్ల కాబోలు—ఆ దృక్పథం తీసెయ్యటానికి వీల్లేనిదిగానే భావించాడు. నిజమే కావచ్చు. ఒక నటుణ్ని గూర్చి ఈ కథ గూడా ఆయనే చెప్పాడు: ఆ నటుడు ధన సాహాయ్యం కోసం మిసెస్ ఆలీన్ అనే ఆవిడ దగ్గరకు, ఆమె భర్తను దర్శించటానికి వీలుపడనందున, ఆమెనే అర్థిస్తూ వెళ్లాడట. వెళ్లి గ్లోబ్ థియేటరుకు చెందిన హెమింగ్స్, షేక్‌స్పియర్‌లను తనను గూర్చి 'రెఫరెన్స్' ఇవ్వగల వారిగా చెప్పాడట. ఆవిడ షేక్‌స్పియర్‌ను వాకబు చేయగా ఆయన ఇలా అన్నాడట : "అవును, ఆ మనిషి తెలీకేం ? బాగా తెలుసు. వాడొక దొంగ వెధవ, బడుద్ధాయి. "రెఫరెన్స్' యివ్వటానికి అర్హుడైన మోతుబరి అనదగిన మాటలే అవి—అంటాడు బేజ్‌హట్. ఆ నటుడి సంగతి తర్వాత ఏమైందో మనకు తెలీదు. ఆ 'అనదగిన మాటల' సంగతే వాడు విని ఉంటే, బహుశా వాడు 'బేకన్‌వాది' గా మారిఉంటాడు.

రెనైజాన్స్ ఉద్యమంవల్ల ప్రభావితుడైన మన కవి, భావనాత్మక ప్రతిభకు (Romantic genlus) వ్యవహార జ్ఞానం కూడా తోడవటంవల్ల, మంచి లౌక్యుడుగా, బేంకర్‌గా రాణించి ఉండేవాడు. ఏమైనా మహారాణి పాదాల క్రింద తన ముఖమల్ అంగవస్త్రాన్ని (Velvet cloak) పరచేటంత అతివాది రొమాంటిసిస్ట్ మాత్రం ఎన్నడూ కాడని తోస్తుంది. అందుకు ఒక కథ కూడా ఉంది : రొమాంటిక్ సన్నివేశంలో షేక్‌స్పియర్ ఎలా ప్రవర్తిస్తాడో చూడాలని మహారాణి ఒక చిన్న పరీక్ష పెట్టిందట. రిచ్‌మండ్‌లో మహారాణి సమక్షంలో ఒక నాటకం ప్రదర్శిస్తూ, షేక్‌స్పియర్ చక్రవర్తి పాత్ర అభినయిస్తూ ఉండగా మహారాణి అటు వెళ్తూ తన చేతి గ్లవ్‌ని జారవిడిచింది. షేక్‌స్పియర్ చూడనట్లే ఉన్నాడు. ఎలిజబెత్ మహారాణి తిరిగి వస్తూ ఇంకో చేతి గ్లవ్ కూడా జారవిడిచింది. వెంటనే మహాకవి ఈ క్రింది పంక్తుల్ని తను చెబుతున్న మాటల్లో కలిపాడట :

> "మేము ఈ రాయబారపు విషయాల్లో మనస్సు
> లగ్నం చేసివున్నప్పటికీ
> మా సోదరి గ్లవ్ అందివ్వటానికి అవనతగాత్రుల
> మౌతున్నాము." 1

ఎలిజబెత్ షేక్‌స్పియర్ విలువ గ్రహించి, ఆయన పట్ల ప్రత్యేకాభిమానం చూపిం దనటంలో ఏ సందేహమూ లేదు. ఆయన కూడా స్తుతి పరాయణత్వం ఏమాత్రమూ సోకని సహజమైన భక్తి భావం చూపిస్తూ ఆత్మ గౌరవం నిలుపుకున్నాడు.

ఆయనలో చాందసత్వపు ఛాయలూ, నైతిక అతివాదిత్వమూ లేవనటానికి ఆయన సౌహార్దమూ స్వచ్ఛందమైన అభిప్రాయాలే తార్కాణం. జీవితాన్ని గూర్చిన తృష్ణ, పరిణతి చెందిన వివేకం, భావంలో, భావ ప్రకటనలో చక్కని మెలకువా—ఇవి తోటివారిలో తనపై విశ్వాసాన్ని ఆయన ఎలా పెంపొందించుకో గలిగాడో వివరించే గుణాలు. తనతో పనిచేసేవారిలోని ఉత్కృష్టతను వెలికి తీసుకురాగలిగిన ప్రతిభ ఆయన సొమ్ము. ప్రొఫెసర్ ర్యాలీ అన్నట్లు అందులో ప్రతి మనిషి ఆయన సాహచర్యమే కారణంగా కొంత వ్యక్తి

---

1. "And though now bent on this high embassy.
   yet stoop we to take up our cousin's glove."

త్వాన్ని మరింత ప్రకటించుకో గలిగేవాడు. ఆయన తను సృష్టించిన ఫాల్ స్టాఫ్ వలెనే, తను చమత్కారంగా ఉండటమే కాదు, ఇతరుల్లో చమత్కారం కలిగేందుకు కారణం కూడా అయ్యేవాడు. ఆ నవ్వు విశాలమైనది—మెరెడిత్ మాటల్లో చెప్పాలంటే 'పదివేల ఆవులు పచ్చిక మేస్తున్న దృశ్యంలా' విశాలమైనది.

"జీవితాన్ని గూర్చి విషాదంతో తల లూపుతూ
పరువం చెడిన ఈతరంవారి వైపు చూచి
ఆయన ఎలా నవ్వుతున్నాడో........
ఆ గురుదేవుడే యిప్పుడు బ్రతికివుండి,మానవుణ్ణి చిత్రిస్తే
...... ఈ వాతావరణాన్ని హృదయాల్నీ క్షాళనంచేసే
నవ్వుల మేఘ గర్జనలు వెలువడేవి కదా !" 2

ఆయన 'విద్యుత్తు వంటి అనుబంధంతో అవతలివాళ్ల ఆత్మల్లో ప్రాణశక్తి ప్రచలితం చేసేవాడు ' అనే మాటల్ని సులభంగా విశ్వసించవచ్చు, ఏమంటే మృతిజెంది మూడు వందల ఏండ్ల పైచిలుకు కాలం గడిచినా యిప్పటికీ అలానే చేస్తున్నాడు కద ! ఈర్ష్యాసూయలంటే ఏమిటో ఎరుగని వ్యక్తి—అవి మానవుని అహం తాలూకు విషఫలాలు ఆయన దృష్టిలో—తేయన ఎంతటి ప్రేమాస్పదుడో, మరి ఆ ప్రతీతి యిప్పటికీ నిలిచిఉంది, ఫారోల మీద గుప్పించబడిన సుగంధ ద్రవ్యాల తాలూకు పరిమళంలాగే.

లండన్ వీధుల్లో బళ్ల రద్దీవల్ల జరిగే ప్రమాదాలను గూర్చి వ్రాస్తూ 'పంచ్' పత్రిక హాస్య రచయిత వాల్టర్ ఇమాన్యుల్ జనాన్ని రెండు వర్గాలుగా విభజింపవచ్చు అన్నాడు—ది క్విక్-ది డెడ్. (క్విక్ అంటే వేగం కలిగి ఉండడం అనీ, ప్రాణం కలిగి ఉండటం అనీ శ్లేష. వీధుల్లో వేగం చూపగలిగినవాళ్లు క్విక్—సజీవులూ;లేనివాళ్లంతా డెడ్—చచ్చినవాళ్లూ అని చమత్కారం) ఎలిజబెత్ కాలంనాటి లండన్‌కీ యిదే విభజన వర్తిస్తుంది.—అప్పటి ప్రమాద కారణం మాత్రం ఇంకో విధంగా ఉండేది. ఆ రోజుల్లో ప్రతి మనిషి కత్తి కటారూ దగ్గ రుంచుకొని తిరిగేవాడు. కారణం ఉన్నా లేకపోయినా తటాలున కత్తి దూయటమే పని. షేక్స్పియర్ జాగరూకుడు కావటంవల్ల తనూ కత్తి ధరించే తిరిగేవాడు. అప్పట్లో మహారాణి న్యాయస్థానానికి వచ్చిన ఒక మహజరు రికార్డు ఇప్పటికీ ఉన్నది—అది 'పేరూ ప్రతిష్ఠా లేని ఒకానొక జులాయి మనిషి', షేక్స్పియర్ మరి ముగ్గురూ తన్ను హత్య చేస్తారో, అంగవికలుణ్ణి చేస్తారో అన్న భయంతో వారినుంచీ రక్షణ కోరుతూ పెట్టుకున్న మహజరు. ఆ జులాయి మనిషి వాళ్లు వేస్తామని బెదరించిన శిక్షకు తగినవాడే అయివుంటా డనటంలో సందేహం లేదు. రడ్యార్డ్ కిప్లింగ్ (ఎలిజబెత్ కాలపు గుణాలు అతనిలో చాలవరకు ఉండేవి) ఒకసారి నాతో షేక్స్పియర్ నాటకాల్లో కత్తుల కలాపం ఎంత ఎక్కువగా ఉందో ముచ్చటిస్తూ—కయ్యానికి కాలుదువ్వే బెన్ జాన్సన్ 'మెర్ మెయిడ్' పానశాలలో తాగి నిషాలో ఉన్నప్పుడు షేక్స్పియర్‌ను తటాలున పొడిచి చంపే ప్రమాదం ఎన్నిసార్లు వచ్చిందో ఏమో అనిపిస్తుంది, అన్నాడు. ఊహింపదగ్గ విషయమే—కానీ ఏ పరిస్థితి అయినా షేక్స్పియర్ మెలకువనూ, ప్రతిభనూ దాటిపోగలిగేదనే నమ్మకం నాకు లేదు. ప్రసిద్ధమైన ఒక లేఖలో, బోమంట్, జాన్సన్‌కు గ్రామసీమ నుంచి వ్రాస్తూ అక్కడ తనకు లభ్యమౌతున్న పల్చని సారాయంతో పోల్చి 'మెర్ మెయిడ్' లో దొరికే 'నిండు' సారాయాన్ని యిలా అంటాడు :

కాని నా కనిపిస్తుంది : అది
మనకు ప్రత్యేకంగా భూలోకానికి పంపబడిన పానీయం
భగవదేచ్ఛవల్ల, మనల్ని పోట్లాటల్నుంచీ రక్షిస్తోంది.3

కాబట్టి కిప్లింగ్ ఊహించినది ఇంచుమించు యదార్థమే అనాలి. కత్తుల విషయం అలా ఉంచితే, బోమంట్ లేఖలో వ్యక్తం చేసినట్లు, 'మెర్ మెయిడ్' లో ఎన్ని స్మరణీయమైన కలాపాలు' జరిగాయో ! ఎన్ని వీరోచితాలూ, విలాసపూరితాలూ అయిన మాటల రఘుళిపింపులూ పోట్లూ, 'చల్లని శితాగ్ని కీలలు'—షేక్స్పియర్‌కూ బెన్‌కూ ఎన్ని చమత్కారాల మల్లయుద్ధాలు, నిండుదనంతో మందగామియైన నౌక (గాలియన్) ఒకటీ, వడిగా తేలిపోయే దోనె (Sailing craft) మరొకటీ. గాలీ, ఆటూ పోటూ, అనుకూలించినప్పుడే బ్రాడ్ సైడ్ నుంచి ప్రాచీన వైదుష్యపు ఫిరంగులు పేల్చటానికి గాలియన్ ప్రయత్నించేది. అవకాశం దొరికినప్పుడల్లా బెన్ షేక్స్పియర్‌ను 'లాటిన్ సున్నా, గ్రీక్ అంతకంటె

2. How smiles he at a generation ranked
In gloomy noddings over life !....
O lived the Master now to paint us Man,
............,.. to srart
Thunders of laughter, clearing air and heart !

3. And yet I think
It is a potion sent us down to drink
By special providence; Keeps us from fights.

నున్నా' (Small Latin and less Greek) అంటూ ఎత్తిపొడిచేవాడు, షేక్‌స్పియర్ 'పోనీ సరదా పడనిమ్మని నవ్వుతూ ఊరుకునేవాడనే మనం భావించవచ్చు. ఏమంటే ఇద్దరిమధ్యా ఉన్న ప్రేమబంధం అటువంటిది. అంతేకాదు, బెన్‌కూ కూడా ఒక్కొక్క పర్యాయం మంచి దెబ్బే తగిలేది— ఆ దెబ్బకొట్టిన నేర్పును చూచి అతని పాండిత్యం తృప్తి చెందిన కుక్కలా గుర్రు పెట్టేది. ఈ కథ వినండి : బెన్ బిడ్డల్లో ఒకరికి షేక్‌స్పియర్ 'గాడ్—ఫాదర్' గా ఉండటం తటస్థించింది. ఆ శిశువుకు నామకరణం చేసే సందర్భంలో షేక్‌స్పియర్ ఏమిటో పరధ్యానంగా ఉండటం గమనించి బెన్ "ఏమిటా విచారం ?" అని అన్నాడట. "ఏం లేదు బెన్! చాలసేపట్నుంచీ ఆలోచిస్తున్నాను నా గాడ్—చైల్డ్‌కి ఏం బహుమతి యిస్తే చక్కగా ఉంటుందా అని—అది ఇప్పటికి తేలింది." "ఏమిటదీ ?" అన్నాడు బెన్. "నిజంగానే బెన్, నేను వాడికి ఒక డజను మంచి లాటిన్' స్పూన్స్ యిస్తాను. నువ్వు వాటిని 'ట్రాన్స్‌లేట్' చేద్దువుగాని." (లాటన్ అనేది కంచు వంటి ఒక మిశ్ర లోహం, ఆ లోహాల్లో స్పూన్స్ చెయ్యటానికి ఉపయోగించేవారట. 'లాటిన్' మీదా 'ట్రాన్స్‌లేట్' మీదా శ్లేష.)

కొన్నాళ్ల క్రితం, ప్రతిభంటే ఏమిటో ఎరుగని ప్రబుద్ధుడొకడు ఏదో సమీక్ష వ్రాస్తూ అప్రస్తుత ప్రసంగంగా షేక్‌స్పియర్‌లో ప్రతిభ లేదంటూ వాపోయాడు— అంటే యితరులు వ్రాసిన కథల్ని తన నాటకాల్లో ఇతివృత్తాలుగా తీసుకునే ఆచారం ఈ కవికి ఉండటాన్ని గూర్చి ఆక్షేపించాడు. (ఈ ఆక్షేపణ మొదటి నుంచీ యిలాంటి ప్రబుద్ధులు చేస్తున్నదే, క్రొత్తదేమీ కాదు). ఈ రకం ఆక్షేపణకు తగిన సమాధానం ఎప్పుడూ ఒకటే—కథల్లో కొత్తదనం చూపవలసి నంతటి ప్రతిభా దారిద్ర్యం షేక్‌స్పియర్‌కు ఎన్నడూ పట్టలేదు. చార్లెస్ విబ్లీ అన్నట్లు ఆయన గొప్పదనం అటువంటి పరిస్థితికి అతీతమైంది.

కొత్తదనం చూపటం చాల సులభమే—కవిత్వానికి కావలసింది అదొక్కటే అయితే! కీట్స్ చిత్రించిన 'హవ్స్' అనే జోస్యుడు కాలిజోడు ఒకటి తీసివేసి ఒకటి ఉంచుకుని వెనక్కి తిరిగి మేడమెట్లు దిగాడట కొత్తదనం చూపెట్టడానికి, అలాంటి కొత్తదనమే కొంతమంది కవులూ ఇతరులూ నేడు ఎవరికి తోచిన ధోరణిలో వాళ్ళు వ్యక్తం చేస్తున్నారు. కొత్తదనం అనేది సృజనశక్తి లోపించిన చిన్న తరహా వాళ్లకు లక్ష్యంగా ఉంటుంది. కాని షేక్‌స్పియర్ విషయంలో కాదు, ఆయన తరహాయే వేరు. ప్రకృతివలె ఉదారుడు, ద్రాక్షాసవరసగ్రహణ పారీణుడు, సాహితీ దివ్య ప్రాసాద సార్వభౌముడు, అపురూపమూ శ్రేష్ఠమూ అయిన మదిరను తలపువ్వులుగా పంచిపెట్ట గలవాడు, ఆ దైవ రహస్యం భూమిమీద ఆయనకు తప్ప మరెవ్వరికీ తెలియదు. అటువంటి రసికుడు మదిర నించే పీపాలు, సీసాలు కూడా తనే తయారు చేసుకోలేదేం అంటే— అసలా విషయం ఆయనకు తోచే ఉండదు అంటాను. ఎందుకు తోచాలి ? పీపాలూ, సీసాలూ కావలసినన్ని సమృద్ధిగా సిద్ధంగా లభిస్తూంటే ఆయన తనకు నచ్చిన వాటిని తీసుకుని వాటికి చిల్లులూ, రంధ్రాలూ ఉన్నట్లయితే అతుకులువేసి బాగుచేసి ఉపయోగించుకున్నాడు. నిజానికి ఒక్కొక్కసారి ఆమాత్రం శ్రమైనా తీసుకోవటానికి బద్ధకించాడు. అలాంటప్పుడు ఆయన ఉదాత్త మధువు అక్కడక్కడా ఒలికిపోయింది కూడా! "చనిపోయినవారి ఆత్మలకి నవ్వటం చేతనవుతుందా ?" అని ప్రశ్నిస్తాడు చార్లెస్ లాంబ్ ఒకానొక వ్యాసంలో. షేక్‌స్పియర్ ఆత్మ తరచు నవ్వుతూ ఉంటుందని పిస్తుంది. ఆయన బంగారంలాంటి పదాన్యతను (మదిర) అనుభవిస్తూనే 'అరువు' పాత్రల్లో పోసి యిచ్చా డేమిటా అంటూ తలలు గోక్కునే వాళ్లను చూచి ఆయన ఆ లోకం నుంచీ నవ్వుతూ ఉంటాడు.

'సర్వతోముఖ ప్రజ్ఞాశాలి' (The myriad-minded man) అన్నాడు కోలెరిడ్జ్ — (సరియైన పదాన్ని ఎన్నుకోవటంలో కోలెరిడ్జ్‌ను మించినవారు లేరు.) సద్యః స్ఫూర్తి, సర్వం ఆకళించుకునే ప్రవృత్తి కలిగి అన్ని వస్తువుల నుంచీ, అన్ని వైపులనుంచీ, భౌతికంగా, ఆధ్యాత్మికంగా, తనలో తనపై ధారాపాతమయ్యే ఊహలూ, భావాలూ, అతీంద్రియ జ్ఞానమూ—వీటిని తనకే అగోచరమైన పరిణామాల ద్వారా, తన చుట్టూ ఉన్న సామాన్య బుద్ధులకు అర్థం అయ్యేలా చేశాడు. అంతేకాదు, ఊహతోపాటు పరుగులు తీసే చేతో (హెమింజ్ వర్ణించినట్లు), వ్రాసిన పంక్తిని కొట్టివేయటానికి ఆగటమంటూ లేకుండా (జాన్సన్ గొణుక్కున్నట్టు) యిక్కడ యిప్పుడు ఆ అనుభూతి మనకు అందేలా చేశాడు. అనుభూతిని అందివ్వటంలో దానికి ఆయన తెచ్చిన మార్పు ఏ రసాయనిక శాస్త్రమూ ఎన్నడూ భౌతిక పదార్థాలమీద తీసుకురాలేని మార్పు. ఆయన వేసిన మహత్తర భారంతో భాష విరిగిపోతుందేమో అనిపించినప్పుడు ఆయన దాన్ని తన ధోరణిలో కావలసినట్లు మలుచుకుంటూ, దానికి అంతకుముందెన్నడూ లేని మహాత్మ్యాన్ని చేకూర్చాడు. రసాయనిక, భౌతిక శాస్త్రజ్ఞులు ద్రవ్యాలను విడదీయవచ్చు, కలపవచ్చు, మార్చవచ్చు, విభజింపవచ్చు — అణువుని చీల్చవచ్చు కూడా — వాళ్ళు చివరదాకా దేనిలో పనిచేస్తున్నారో దాన్ని అనుసరిస్తూ దాని తత్త్వానికి లోబడినవారే కాని, దాన్ని అధిగమించిన వారు కానేకారు.

అయితే మనం జాగ్రత్తపడాలి. లోకంలో సంస్కార హీనులు, సుందరమైనవీ సుశ్లోకమైనవీ ద్వేషించే వాళ్ళున్నారు. షేక్స్‌పియరు తన ఉపకరణంగా వాడి, మహా సౌందర్యవంతమూ శక్తివంతమూ చేసిన యీ ఇంగ్లీషు భాషకు వాళ్ళు అప్పుడప్పుడు ఎగ్గు తలపెట్టుతూ ఉంటారు. ఆ విధ్వంసకులు మళ్ళీ తలెత్తారు : ఈ కాలంలో నాణములూ అన్ని రకాల విలువలూ, ప్రమాణాలూ పతనం చెందినట్లే భాషకూడా పతనం కావాలన్న కాంక్ష చూపిస్తున్నారు. వాళ్ళ స్టీల్ ఫర్నిచర్, పొడుం చెయ్యబడ్డ కోడిగ్రుడ్డు, నికెల్ నాణాలు మొదలైన వాటితో సమంగా భాషనుగూర్చి కూడా చర్చిస్తున్నారు. ఉపయోగిత (Utility) వాళ్ళారాధించే దైవం. ఆ దైవాన్ని తృప్తిపరచేంతవరకు లలితమూ సుందరమూ అయిన వస్తువుల్ని జీవితం నుంచి బహిష్కరించాలని వాళ్ళ అభిమతం. సరిగా ఒక శతాబ్ది కితం డీక్వెన్సీ వీళ్ళ పూర్వీకులే కొందరికి బుద్ధి చెప్పాడు. వాళ్ళలో ఒకడి పేరు పింకర్‌టన్ — ఆయన వాణ్ణి పింకర్‌టన్ రాక్షసుడు అని వ్యవహరిస్తాడు — వాడు మన భాషను ఇటాలియన్ వలె అజంతం చేస్తే బాగుంటుందన్నాడు. ఉదాహరణకు అడిసన్ వ్రాసిన వాక్యం: "ఐ శాట్ ఆన్ ది టావ్ అఫ్ ఎ రాక్" యిలా సంస్కరింపబడుతుంది. "ఐ శాటో ఆన్ ది టాపినో అఫ్ ఎ రాకో". డీక్వెన్సీ దీన్నిగూర్చి యిలా వ్యాఖ్యానించాడు. "లక్కిలి సిమె దిస్ ప్రపోజాలియో అఫ్ ది అబ్సర్డిసిమొ పింకర్‌టోనియో వజ్ నాట్ అడాప్టెడొ బై ఎనిబడీని వాటెవరానో" (అదృష్టవశాత్తు పింకర్‌టన్ పిచ్చి ప్రతిపాదన ఎవరూ అనుసరించలేదు' అనే వాక్యాన్నే అజంతం చేస్తూ వెక్కిరించాడు డీక్వెన్సీ.) నవ్యాంగ్ల భాషాకోవిదుడైన ఆయన యీనాటి రాక్షసుల్ని ఏమనేవాడో ఊహించుకోవచ్చు. సంపన్నమైన భాషను త్రుంచి, తరగి, చెక్కలూ ముక్కలూ చెయ్యటమనే మరీ నికృష్టపు నేరానికి సిద్ధమౌతున్నారు. వీళ్ళు. అసలు వీళ్ళతో ఆయన మాటే మాట్లాడేవాడు కాడేమో!

షేక్స్‌పియర్‌కూ ఆయన సమకాలికుల్లో ప్రతిభావంతులైనవారికీ 'మనీష' రీత్యా ఉన్న పెద్ద విభేదం ఒక క్షణం విస్మరించి, వాళ్ళను పోల్చి చూశామనుకోండి — అయినప్పటికీ, అసలు మూలతత్వంలోనే షేక్స్‌పియర్ భిన్నమైన వ్యక్తి అనే సంగతి విస్పష్టంగానే ఉంటుంది. ప్రగల్భుడూ గర్వి అయిన జాన్సన్ తను సృష్టించిన ఏ పాత్ర నోటనైనా యీ క్రింది మాటలు పలికించి ఉండేవాడా?

శాంతి సమయంలో వ్యక్తికి వినయపూర్ణమైన
మౌనమూ నమ్రతా
రాణించినట్లు మరేదీ రాణించదు :[4]

అలాగే యీ మాటలు :

అప్పుడు మర్యాద సర్వమూ స్వర్గం నుంచీ
దొంగిలించి తెచ్చి
నమ్రతనే ఉడుపులుగా ధరించటంతో
మనుష్యుల హృదయాల్లో నుంచి విశ్వాసాన్ని
ఫలంగా పొందగలిగాను[5]

హాస్య దృష్టిలుప్తమైన మార్లో ఫాల్‌స్టాఫ్ వంటి పాత్ర సృష్టికి ఆలంబనమైన హాస్య రసోత్సేక మనఃస్థితిని ఎన్నడైనా అందుకోగలడా? అహంకారము, పుస్తక పాండిత్యము, లాటిన్ భాషాభిమానమూ కలిగిన బేకన్ ఫాల్‌స్టాఫ్ వంటి పాత్రకు ప్రాణం పోయగలడా? అమరత్వమూ, సర్వజనీనతా కలిగిన ఆ విషయాలసుని సృష్టి, సజీవమైన కొట్టవచ్చేటట్లున్న వాడి మాటలూ, చమత్కారంతో హాస్యంతో నిండి తొణికిసలాడుతూ ఆంగ్లంత్వంతో ప్రచలితమయ్యే ఆ భాషాబేకన్‌కు సాధ్యమేనా? అలానే భీభత్సానికి పేరుగాంచిన వెబ్‌స్టర్, కిడ్, టర్నర్ ముగ్ధ మోహనంగా ఉన్న యీ క్రింది భాగాల్ని వ్రాయగలరా ?

జూలియట్ : వెళ్ళిపోతారా? తెల్లవారటానికి యింకా ఎంతో
వేళ మిగిలింది :
అది నైటింగేల్, లార్క్ కాదు — ఉలికిపాటున
నున్న మీ చెవిలో
దూరిన శబ్దం దానిదే; అదుగో ఆ దానిమ్మ చెట్టు
లో నుంచీ
రాత్రిళ్ళు పాడుతో ఉంటుంధి : నమ్ము ప్రియా,
నిజంగానేఅది నైటింగేల్.

రోమియో : తెల్లవారుతోందని చాటింపువేస్తోంది, అది నైటిం
గేల్ కాదు,
లార్క్ — అలా చూడు ప్రియా, తూర్పున
విడిపోతున్న మేఘాల్ని
అసూయతో బంధిస్తున్న 'లేస్'లా వెలుగు చారలు :
రాతిరి దివ్వెలు కున్కిపోగా, పగలు ప్రమోదంతో

4. In peace there's nothing so becomes a man
As modest stillness and humility:

5. And then I stole all courtesy from heaven,
And dressed myself in such humility
That I did pluck allegiance from men's hearts-

హిమావృత పర్వత శిఖరాల మీద మిత్రి చూస్తోంది.
వెళ్లి జీవించనా, ఉండి మరణించనా! 6

విల్లీ, గ్రీన్, పీల్, డెకర్, హేవుడ్‌వంటి వారిలో వేలకొద్దీ పంక్తుల్ని వెదకినా ఎక్కడ లభిస్తాయి క్రింది పంక్తుల గాంభీర్యంతో సాటి వచ్చేవి :

రేపు, మళ్లీ రేపు, మళ్లీ రేపు,
ప్రాకుతూ ఉంటుంది యిలానే మందగమనంతో రోజు తర్వాత రోజు,
చరిత్రలో లిఖితమయ్యే కాలం యొక్క చివరి పదం దాకా :
గతించిన నిన్నటి దినాలు బుద్ధిహీనులను ధూళి
ధూసరితమైన మృత్యు పథాన్ని చేర్చిన కరదీపికలు. 7

ఆయన 'సానెట్స్'ను చూస్తే బోమంట్ ఫ్లెచర్‌లు పద కవిత్వంలో ఎంతటి చతురులైనప్పటికీ క్రింది పంక్తుల్లోని గాన మాధురికి సాటివచ్చే గానం వాళ్ల తంత్రుల పై ఒలికించ గలిగారా? గాన మాధుర్యమే కాదు ఇందులో మరొక విశిష్ట సౌందర్యం కూడా మనల్ని వెంటాడుతున్నది :

రెండు మంచి మనస్సుల మధ్య పెళ్లికి ఆటంకా లున్నవంటే అంగీకరించను.
మార్పు కనిపించినప్పుడు మారిపోయే ప్రేమ ప్రేమకాదు —
తీసివేసే కారణంతోపాటు తీసేందుకు లొంగే ప్రేమ ప్రేమకాదు —
కానేరదు! అది ఒక సుస్థిరమైన లక్ష్యం,
ఝంఝా మారుతాల్ని అవలోకిస్తుంది కాని అదరి చెదిరిపోదు
మార్గం తెలీక తిరిగే ప్రతీ నావకూ అది ధ్రువ తార —
ఆ తార ఎత్తు కొలిచినా ఆ తార విలువ మనకు తెలీదు —
ప్రేమ కాలానికి దాస్యం చెయ్యదు, గులాబీ పెదవులూ కపోలాలూ
కాలం కొడవలి ఆధ్వర్యానికి లోబడవచ్చు;
ప్రేమ మాత్రం గంటలతో వారాలతో మార్పు చెందదు,
కల్పాంతపు చివరదాకా సాగుతుంది.
ఇదే అబద్ధమైతే, నామీదే దాన్ని నిరూపిస్తే,
నేను కవిత వ్రాయనట్లే, మానవుడు ప్రేమించనట్లే. 8

---

6. Jul — Wilt thoube gone? it is not yet near day ;
It was the nightingale, and not the lark.
That pierc'd the fearful hollow of thine ear:
Nightly she sings in yon pomegranate tree:
Believe me, love it was the nightingale.
Romeo · It was the lark, the herald of the morn,
No nightingale look, love. what envious streaks
Do lace the severing clouds in yonder east.
Night's candles are burn out, and jocund day
Stands tiptoe on the misty mountain-tops
I must be gone and live, or stay and die.

7. Tomorrow, and tomorrow, and tomorrow,
Creeps in this petty pace from day to day,
To the last syllable of recorded time;
And all our yesterdays have lighted fools
The way to dusty death.

8. Let me not to the marriage of true minds
Admit impediments, Love is not love
which alters when it alteration finds,
Or bends with the remover to remove;
O, no! it is on ever fixed mark,
That looks on tempests and is never shaken,
It is the star to every wandering bark,
Whose worth's unknown although his height be taken.
Love's not Time's fool, though rosy lips and cheeks
Within his bending sickle's compass come;
Love alters not with his brief hours and weeks,
But bears it out even to the edge of doom.
It this be error, and upon me proved,
I never writ, nor no man ever loved.

షేక్స్పియర్‌ను గురించి అన్ని విషయాల కంటె గట్టిగా నిర్ధారించి చెప్పగలిగిన సంగతి ఒక టున్నది. మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన విశ్వాసానికీ నిజాయితీకీ ఆయన ఎంతో ప్రాముఖ్యత యిస్తాడు. మానవుని ప్రధాన ధర్మంగా, కావ్యంలో ముఖ్యోద్దేశంగా, తన రచన లన్నింటినీ గుచ్చెత్తే స్వర్ణ సూత్రంగా—మనోవాక్కాయ కర్మల్లో నిజాయితీకి ఆయన స్థానం యిచ్చాడు. నా అభిప్రాయంలో షేక్స్పియర్ ఎలిజబెత్ రాణి పట్ల చూపవలసినంత భక్తి శ్రద్ధలు చూపకపోవటం, 'గ్లోరియానా' అంటూ ఆమెను గూర్చి అప్పట్లో జరుగుతున్న ఆరాధనలో పాల్గొనక పోవటం, ఆమె తనపట్ల గౌరవాదరాలు చూపిస్తున్నా (ఎన్నదగిన ఆమె గొప్ప గుణాల్లో అదొకటి) తను మాత్రం ముభావంగా ఉండటం చూస్తే అందుకు కారణం ఆమెలో ఆయన గర్హించిన గుణం—తనకు అనుకూలించినప్పుడు స్నేహబంధాన్ని (వ్యక్తిగతం కానీ రాచకీయం కానీ) పుటుక్కున త్రెంచివెయ్యటానికి ఆమె సిద్ధపడటం.

మాటలకు అర్థం ఉంటే, ఆయన్ని ఎరిగున్నవాళ్ల దగ్గర్నుంచీ మనదాకా వచ్చిన మాటల తాత్పర్యం—స్నేహంలో ఆయన్ని మించినవాడు లేడు అని. అందరికంటె ఎస్సెక్స్ ఆయనకు చాలా యిష్టుడు. 1901 లో ఎస్సెక్స్ మృతి ఆయన్ని బాగా కలచివేసింది. అంతటితో ఆయన కలం ఆగిపోయింది. 1903 లో మహారాణి చనిపోయిన తర్వాత గాని—ఆ సందర్భంలో ఆయన ఏమీ వ్రాయకపోవటాన్ని గూర్చి అప్పట్లో అనుకున్నారు కూడా—ఆయన మళ్లీ కలం పట్టలేదు. అప్పుడు మౌనవ్రతానికి స్వస్తిచెబుతూ వ్రాసిన నాటకం పేరు: 'ఆల్స్ వెల్ దట్ ఎండ్స్‌వెల్'.

షేక్స్పియర్ ఎస్సెక్స్‌ను ప్రేమించాడు. హెన్రీ—V నాటకం కోరస్‌లో వ్రాసిన పంక్తులు ఎస్సెక్స్ ఐర్లండునుంచి తిరిగి రావటాన్ని నిరీక్షిస్తూ, ఆ ఉద్దేశంతో వ్రాసినవే:

> ఈ ప్రశాంత నగరంనుంచీ ఎంతమంది స్వాగతంచెబుతూ
> ఎదురేగుతారో!

ఈ ప్రత్యాశ యదార్థంలో విషాదకరంగా అంతమైంది. కారణం తెలుసుకోవాలంటే హేమ్లెట్‌ను చూస్తే చాలు. హేమ్లెట్‌లో తన స్నేహితుణ్ణే గుణదోషాల్తో యథాతథంగా చిత్రించాడు షేక్స్పియర్. డోవర్ విల్సన్ చూపించినట్లు ఎస్సెక్స్ స్వభావం పూర్తిగా అందులో ఉంది—అతని మర్యాదా, మన్ననా, అల్పులమీద దయా, నాటకాలమీద ప్రీతి, ఆధ్యాత్మికతలో అభినివేశం, అతని శీపీ, దైవభక్తీ, ధైర్య సాహసాలూ, చమత్కారమూ, ఉన్మాదానికి చేరువలో ఉండే విషాద చిత్తవృత్తీ, ఉద్ధృత మనస్కతా, మోటు సరసం, ఆడవాళ్ల పట్ల నిర్దాక్షిణ్యం, క్రియారంగంలో ఏకమార్గానుసరణ శీలత్వం బొత్తిగా లేకపోవటం—అంతా అందులో ఉన్నది. అత్యంత సున్నితమైన యీ వర్ణ చిత్రంపై విశ్వాసపూర్ణమైన స్నేహం తాలూకు అభిమానాన్ని గుప్పిస్తూ కూడా షేక్స్పియర్ అతని ఏ ఒక్క లోపానీ కప్పిపుచ్చలేదు.

షేక్స్పియర్ వ్యక్తిత్వం యొక్క మూల రహస్యం పరిపూర్ణమైన చిత్తశుద్ధి. ఆ ఒక్క గుణమూ చాలు సమకాలీన రచయితల్లో ఆయన్ని ప్రత్యేకించి చూపటానికి. మహారాణి పట్ల కూడా, తనలో లేని శ్రద్ధాభావాన్ని ఆయన పైకి చూపలేకపోయాడు. ఉదారుడు, నమ్మకస్థుడు, నిజాయితీపరుడు—ఆయనకు సులభంగా కోపం రాదు. వస్తే మాత్రం ఎంతో తీవ్రంగా వస్తుంది, అది ఆత్మ సంబంధి కాబట్టి ఆయన స్థిత ప్రజ్ఞత్వాన్ని గూర్చి ఇదివరకే ముచ్చటించాను. మనోవైకల్యం వచ్చినప్పుడు మాత్రం తుపానులాగ కాదు కేంద్రం (ఆత్మ) లో అలజడి ఏమీ లేకుండా, భూకంపం వలెనే (కేంద్రంలో తీవ్రతమంగా ఉంటూ) వస్తుంది. ఆయన ఆవేశాలు కృత్రిమంగా తెచ్చి పెట్టుకునేవీ, బదురు తీర్చుకునేవీ, రంగస్థలంమీద' నటన వంటివి కావు. సాక్షాత్తూ హృదయంలో నుంచీ ఆవిర్భవించేవీ, ఒక్కొక్కసారి హృదయాన్ని బద్దలు చేసేవీ కూడా. అందుచేతే గొప్పవైన ఆయన నాల్గు విషాదాంత నాటకాలూ నిశితమైన ఆత్మ సంశోధనా ఆత్మాన్వేషణా చేసేవిగా ఉన్నాయి. అవి మన ఆత్మను స్పృశించటానికి కారణం సూటిగా ఆయన ఆత్మ నుంచీ వచ్చినవి కావటమే. ప్రజ్వలించే ఆధ్యాత్మిక కోపం నుంచీ అవి ఉద్భవించాయనీ, ప్రేరణ పొందాయనీ నాకు తోస్తుంది. వాటి మౌలిక శక్తీ, ధారణా, ఆత్మ సంబంధియైన ఏదో ఒక ఆవేశానికి చెందినవే నని నా నమ్మకం. తగిన ఆధారాలే ఉంటే (ఇక అవి లభిస్తాయనే ఆశ లేదు) ఆ ఆవేశ తరంగం ఎలా క్రమంగా ఉద్భూతమై, 'లియర్' నాటకంలో ఉత్తుంగమై, 'టైమన్' నాటకంలో విరిగి పడిందో, దాని తాలూకు ప్రతిధ్వనులు యిప్పటికీ మనం వినగలిగేవాళ్లం.

అందుకు హేతువు ఒకానొక అనుభవం చేసిన లోతైన గాయం, వ్యథ కలిగించిన ఒక కృతఘ్నతా నైచ్యమే కావచ్చు. లేక అది కేవలం వ్యక్తిగతమైన అనుభవమే కాదేమో. లోకం ఉంటున్న తీరు, జీవితం వేసుకున్న వికృతపు బాహ్య వేషం యీ మనస్విలో ఒక్కుమ్మడిగా కలిగించిన తీవ్ర విముఖత్వవే కారణం కావచ్చునేమో! ఎలిజబెత్ నాటి లండన్ నగరపు మొలకుదనం, లుప్త సంస్కారము, కుళ్లూ, అపరిశుభ్రతా,

# షేక్స్పియర్ వ్యక్తిత్వము

నీచమైన కుతంత్రాలూ కుత్సితాలూ, ఎటు చూచినా ఎదు రయ్యే లోభగుణం, కొన్ని దుష్కృత్యాలు—యిప్పటికంటె అప్పుడు ఎక్కువ వ్యాప్తిలో ఉండక పోవచ్చు గాని ఆనాటి మురుగు కాలవల్లాగే పై మూత లేకపోవటంతో మరీ దారు ణంగా, తప్పించుకోటానికి వీల్లేనివిగా ఉంటూ అడుగడుగునా సున్నితమూ, సుకుమారమూ అయిన ఆయన మనోదృష్టికి ఎదురు తగులుతూ ఉండి ఉంటాయి. ఉదాహరణకు ఈ క్రింది భాషణం—ఏథెన్స్ నగరంలోని దొంగల నుద్దేశించినది—అలా అన్వయం చేసుకోవటం సమంజసమనే అనుకుంటాను. షేక్స్పియర్ వర్ణించే ఏథెన్స్, వెనిస్, రోమ్ మొదలైన నగ రాలు అన్నీ ఆయనకు పరిచితమైన లండన్ ప్రతిబింబాలే.

మోసకారి దొంగల్లారా!

ఇదుగో ధనం, వెళ్లండి, ద్రాక్షా రుధిరాన్ని పానం చెయ్యండి,
జ్వరతాపంతో మీ రక్తం ఉడికి పొంగేదాకా తాగండి—
అలానైనా ఉరికంబం నుంచీ తప్పుకుంటారు;
వైద్యుణ్ణి నమ్మకండి
వాడి మందులన్నీ విషాలే, మీరు చేసే దొంగతనాలకంటె
వాడు చేసే హత్యలే ఎక్కువ, వాడు ధనంతోపాటు ప్రాణాల్నీ సంగ్రహిస్తాడు.
దుర్మార్గం చేస్తామంటూ చెప్పుకుంటున్నారు కాబట్టి
అందులో మీ వృత్తి పనితనం చూపెట్టండి. దొంగ తనం సంగతి ఉదహరిస్తాను.
సూర్యుడొక దొంగ, గొప్ప ఆకర్షణతో
సముద్రాన్ని దోచుకుంటున్నాడు; చంద్రు డొక పచ్చిదొంగ
పాండురమైన తన అగ్నిని సూర్యుణ్ణించీ దొంగి లిస్తున్నాడు.
సముద్రుడూ దొంగే, అర్ద్ర ఉద్విగ్నత చూపి అతడు చంద్రుణ్ణి
ఉప్పు కన్నీళ్లుగా కరిగించేస్తున్నాడు; ధరిత్రి కూడా దొంగే,
సర్వ ప్రాణుల మూత్ర పురీషావశేషం నుంచీ దొంగిలించిన
సారంతో బ్రతుకుతూ, పిల్లల్ని కంటోంది—
ఒక్కొక్కరూ ఒక దొంగ—న్యాయశాస్త్ర నిబంధ నలూ, వాటి తాలూకు
శిక్షా విధానమూ, అధికారంలో తిరుగులేని
దొంగతనం. మీలో మీకు కూడా ఏ అభిమానమూ ఉండనక్కరలేదు—
వెళ్లండి, ఒకళ్ల నొకళ్ళు దోచుకోండి. ఇదుగో ఇంకా ధనం :
పీకలు తెగవెయ్యండి, మీకు కనిపించే వాళ్లంతా దొంగలే.
ఏథెన్స్ వెళ్లండి, దుకాణాలు బద్దలు కొట్టండి, మీరు దోచేదంతా
దొంగసొత్తే; నేను ధనం యిస్తున్నానని తక్కువగా
దోచుకునేరు సుమా, అన్నివిధాలా ధనపిశాచి మిమ్మల్ని ఆవేశించుగాక;

తథాస్తు!

మనోవికలత్వం వ్యక్తమయ్యే నాటకంలో మరీ తీవ్రత్వం లేని ఒక భాషణ మిది.

ఆ మనఃస్థితి మారింది. పుంజుకున్న సత్వంతో, మళ్లీ సౌందర్య దర్శనం చేస్తూ ప్రజ్వలించే ప్రతిభతో—ఏ నీడల నుంచి బహిర్గమించాడో వాటి ద్వారానే, అవి తన వెనుక ఉండ టంతో ఉత్తిష్ఠమైన ప్రతిభతో కొత్త లోకాలను అందు కొన్నా డాయన—సింబెలీన్, వింటర్స్ టేల్, టెంపెస్ట్ నాట కాల్లో మంత్రమోహనములైన గవాక్షాలు తెరిచి ఒక కొత్త యింద్రజాలంతో మనల్ని ముగ్ధుల్ని చేస్తాడు. నిస్పృహగాని, కోపం గాని, అసహ్యంగాని యిక్కడ లవలేశమూ లేదు. ఒక పరి తృప్తి, పునర్లబ్ధమైన ఆనందం, తేజోవంతమైన ప్రశాంతి ఉన్నాయి. అలా కాంతిచ్ఛటలలో జీవితకాలపు కృషి ముగిసింది. ఆ సెలవు తీసుకోవటం, ప్రాస్పెరో నోట ఎంత గొప్పగా పలికాడో—అందులో ఆయన కార్యరంగం నుంచి సెలవు తీస్కోవడ మొక్కటే ధ్వనించటంలేదు. అనతికాలంలో రాబో తున్న తన మృత్యువును గూర్చిన అంతశ్శ్రుతి కూడా, విన గలిగినవాళ్లకు, వినిపిస్తుంది. ప్రశాంత సుస్వరంతో ఆయన పలికిన భరతవాక్యం—సన్నిహితులైన ప్రేక్షకులకు నాటక శాలలో వినిపించేందుకు మొదటిసారిగా పలికినదే అయినా, అసంఖ్యాక ప్రేక్షక జనానికీ, యుగ యుగాలకూ, ఈనాటి మనకూ ఉద్దేశింప బడినది. వినండి:

ఏం నాయనా, కాస్త దిగ్భ్రమ చెందినట్లూ
భయపడినట్లూ కన్పిస్తున్నావే. మనస్సుకి ఉల్లాసం తెచ్చుకోవయ్యా!
ఇక మన వినోదాలు పూర్తయ్యాయి. వీళ్లు, మన నటులు,
నే నప్పుడే నీతో చెప్పినట్లు, అందరూ అశరీరులే, యిప్పుడు
గాలిలో కలిసిపోయారు అయిపు లేకుండా;

ఆధారం లేకుండా నిర్మితమైన యీ దృశ్యంలాగే
మేఘ మకుటాలతోటి గోపురాలూ, వైభవోపేతా
లైన ప్రాసాదాలూ
గంభీర ముద్రతోటి దేవాలయాలూ—యీ మహా
గోళం గోళమే—
అవును, దానితోపాటు దానికి చెందిన సర్వమూ
నశిస్తాయి.
ఇందాకటి నిరాధారమైన రూపక దృశ్యంలాగే చెరగి
పోతూ
ఒక్క పిసరైనా మిగులవు. మనం కూడా కలలకు
మల్లేనే, మన కొద్దిపాటి జీవితమూ నిద్రతో
పరివృతమై, దానితోనే సమాప్తి చెందుతుంది.[9]

కాలం గడుస్తోంది. తీసుకున్న విషయం అంచులైనా మనం స్పృశించలేదు. ఇంతవరకూ ఏవో విడి ఊహల్ని ఒకటో రెండో చెప్పుకోవటం మాత్రమే జరిగింది. ఆత్మ సంతృప్తి కోసం యిలా సంజాయిషి చెప్పుకొందాం. మాటల్ని గుణ కారం చేయటంవల్ల లభ్యమయ్యేది యీ కొద్దిపాటి మాత్రమే. అసలు వస్తువు ఆయన నాటకాలు. షేక్స్పియరును గూర్చి ఆయన ముఖతః తెలుసుకోవటమే మార్గం యిప్పుడూ ఎప్పుడూ కూడా.

నా పుస్తకాలే నా వాగ్ధార, పంకరించే నా హృదయానికి
అవే మూగ వ్యాఖ్యాతలు!

ఎటొచ్చీ స్వస్తి వాక్యం పలికేలోగా, కొన్ని చెప్పితీర వలసిన మాటలున్నాయి. అవి షేక్స్పియర్ విరోధులు — అంటే బేకన్ వాదులూ తత్సంబంధీకులూ అయినవాళ్లను గూర్చి. ఎన్నిసార్లు అణచివేసినాసరే వాళ్లు 'అంటేయస్' లాగ మళ్లీ ఉంటూ ఉంటారు. (అంటేయస్ తల్లి భూమి కావటంవల్ల వాడు భూమిమీద పడగానే మళ్లీ మళ్లీ జీవం పోసుకుంటూంటే హెర్క్యులిస్ చివరకు వాణ్ణి పైకెత్తి పట్టుకుని గాలిలో పీక నులిమి చంపాడు.) ఏం చెయ్యను! యిప్పుడు బలసమన్వితుడైన హెర్క్యులిస్ కూడా లేడు! ఈ మధ్య కాలంలో అంటు రోగం వంటి వీరి ద్రోహాన్నిగూర్చి వ్యధచెందకుండా నేనుండ లేను. ఏమంటే వీళ్ల పద్ధతుల్ని గూర్చి నాకు కొంత తెలుసు. ప్రస్తుతం లండన్‌లో పుస్తకాల దుకాణాల్లో మీకు వీళ్ల విద్రోహపు వ్రాతలు ఎన్నైనా కనిపిస్తాయి. అవి తలా తోక లేని కల్పనలకు రూపం దిద్దుతూ, చదువరుల్లో స్వభావతః ఆ విశ్వాసం వైపు మొగ్గేవారుంటే వారిని సున్నితంగా ఆకర్షిస్తూ ఉంటాయి. వీళ్ళ నాశనంకాను! ఆనాటకాలు అసలు ఎరు వ్రాశారో వీళ్ల కక్కరలేదు, షేక్స్పియర్ కాకపోతే చాలు! మీరనవచ్చు, వాళ్ల అవిశ్వాసం తాలూకు ప్రతిపాదనలూ వాటి అసంభావ్యతా అసలు మనం పట్టించుకోదగిందే కాదని; ఆ అర్హత వాటికి లేనిమాట వాస్తవమే. కాని ఇంగ్లండ్ పుత్రుల్లో ఉత్తమోత్తముణ్ణి యిలా సూటిగానూ, వ్యంగ్యంగానూ, దూషిస్తూ అవమానిస్తూ ఉంటే ఆగ్రహించక తప్పదంటాను. ఈ సమస్యను ఏవిధంగా చూచినా, సాహిత్య విమర్శతో నిజమైన సంబంధంలేదు. ఇది కేవలం కృత్రిమం, అందువల్లే నైతిక సమస్య అంటాను. ఆ సంగతి మనం నిర్లక్ష్యం చేసే ప్రమాదంలో ఉన్నాం. మనకు ఆయన నాటకాలున్నాయి. చాలు! ఎవరు వ్రాస్తేనేం? ఆ సంగతి ముఖ్యమా?'' అనే వాళ్ళూ ఉన్నారు. షేక్స్పియర్ మీద విశ్వాసం ఉన్నావారే అలా అంటారు. అందుకు సమాధానం— తప్పకుండా ముఖ్యమే! ఈ విద్రోహాన్ని క్షమించేటట్లు కనిపించినా, క్షమించేందుకు సులువైన మార్గాన్ని అవలంబించినా మనం అర్హతలేని వారసులవుతాము. ఒకస్విఫ్ట్! లేక ఒక జాంజాన్సన్ యిప్పుడుఉంటే ఎంత బాగుండుననిపిస్తుంది. ఈ దొంగ వెధవల్ని కొరడా దెబ్బలు కొట్టి ఉందురు, లేకపోతే సెర్వాంటెస్, 'షివ్రలీ'ని (పురుష ప్రవర్తనను గూర్చిన మధ్యయుగపు ఆదర్శం) గూర్చి కట్టు కథలల్లుతున్న వాళ్లని ఒక్క దెబ్బలో సరిపెట్టినట్లు సరిపెట్టి ఉందురు.

షేక్స్పియర్ నాటకాలు ఒక అపురూపమైన వ్యక్తిత్వంతో ముద్రాంకితమై ఉన్నాయి. సంపన్నమూ చైతన్యవంతమూ, ప్రసిద్ధమూ, ప్రత్యేకమూ అయిన ఆ వ్యక్తిత్వాన్ని యితర

9. You do look, my son, in a mov'd sort
As if you were dismay'd. Be cheerful sir,
Our revels now are ended. These our actors.
As I foretold you, were all spirits, and
Are melted into air, into thin air;
And like the baseless fabric of this vision,
The cloud-capt towers, the gorgeous palaces,
The solemn temples, the great globe itself.
Yea, all which it inherit, shall dissolve,
And like this insubstantial pageant faded,
Leave not a rack behind. we are such steff
As dreams are made on; and our little life.
Is rounded with a sleep.

# షేక్స్పియర్ వ్యక్తిత్వము

మనుష్యుల రచనల్లో కనిపించే మరొక వ్యక్తిత్వంగా భ్రమించటానికి అవకాశం లేదు. అలా మనల్ని భ్రమింపజెయ్యటానికి కంకణం గట్టుకున్న వారున్నారు అంటే ఆశ్చర్యమే! అంతేకాదు, వాళ్ళు షేక్స్పియర్ మాట్లాడిన భాషనే మాతృభాషగా కలవారవటం మరింత ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది. డాంటే 'డివైన్ కామెడీ' వ్రాశాడన్న విషయాన్ని ఏ ఇటలీ దేశస్థుడైనా కాదంటున్నాడా? సెర్వాంటస్‌నుంచి 'డాన్‌క్విగ్జోట్'ను తస్కరించటానికి ఏ స్పెయిన్ దేశస్థుడైనా ప్రయతిస్తున్నాడా? మోలియర్ వ్రాసిన నాటకాలు ఆయనవి కావనీ, మాంటేన్ వ్యాసాలు ఆయన వ్రాయలేదనీ ఏ ఫ్రెంచ్‌వాడైనా సందేహిస్తున్నాడా? లాటిన్‌లు (దక్షిణదేశాలవారు) బుద్ధిమంతులు. మాంటేన్ రచనల్ని (వాటినికూడా) మన 'పాపాలభైరవుడు' ఫ్రాన్సిస్ బేకన్‌కు అంటగట్టిన దుస్సాహసం ఫ్రాన్సు దేశస్థుడు మాత్రం చెయ్యలేదు.! అయితే ఆంగ్లో — సాగ్జన్ జాతికేం వచ్చింది.? మన సంస్కృతి మూలంలోనే ఏదో లోపం ఉన్నట్లా? మన జర్మను వారసత్వవృక్షం వ్రేళ్ళల్లో ఏమిటో వక్రించి ముడివడ్డది కాబోలు!

నెపోలియన్ తరచు అనేవాడట — దాన్ని మెచ్చుకున్నారు కూడా — 'అసంభవం' అనే మాట తన నిఘంటువులో కనిపించదు అని. అదే అతని నాశనానికి కారణమైంది అంటాను. అసంభవమైన దాన్ని గుర్తించలేకపోవటమే చివరకు అతణ్ణి సెంట్‌హెలీనాలో దింపింది. ఉదాహరణకు ఆలోచనకు అందని విషయాన్ని తూచి చూడటంకాని, అధ్యాత్మికమైన విలువల్ని ఖాతా పుస్తకంలో ఎక్కించటంకాని అసంభవం. మానవుని వివేచనకు అతీతమైన విషయాన్ని హేతుబద్ధం చెయ్యటం సాధ్యంకాదు. దైవాన్ని, మానవునిలో దైవాంశసంభూతమైన దాన్నీ—దాన్నే 'మనీష' అంటాము — హేతుబద్ధం చెయ్యటానికి వీలుపడదు. మొజార్ట్ తన ఏడవ ఏట' సొనాటాస్' కూర్చటం, కిట్‌స్మార్ట్ 'సాంగ్ టు డేవిడ్' కావ్యాన్ని పిచ్చాసుపత్రిలో వ్రాయటం, చదువురాని కమ్మరి ఒకడు బెడ్‌ఫర్డ్ జైల్లో మనభాషలో అత్యుత్తమ ప్రహేళికను మనోజ్ఞమైన గద్యంలో విరచించటం, ఐర్‌స్పైర్ రైతు అమరగీతాన్ని నలువైపులా వెదజల్లటం— ఈ విచిత్రాల రహస్యం మనకు తెలీదు. అది ఎప్పటికీ 'విజ్ఞానం' కంటే బృహత్తరమైన 'స్వప్నం'లో అంశంగానే ఉంటుంది. అలాంటప్పుడు వీళ్లెంత బుద్ధిహీనులో అంతకంటే ఎంతనికృష్టులో, ఆలోచించండి. షేక్స్పియర్ విషయంలో లేనిపోని సమస్యల్ని తమ అల్పబుద్ధులతో తయారుచేస్తూ ఒక మహత్తర విషయాన్ని లోకువపరచాలని చూస్తున్నారు.

సందేహాల్ని లేవదీయటమే పనిగా పెట్టుకున్న
అవిశ్వాస పరులు
ఏవో సమస్యల్ని తామే సృష్టిస్తారు, తామేవిడ..
గొట్టుతారు.

అలాంటి వాళ్ళ మనస్తత్వాన్ని వివరించటం సులువే, ఆ వివరణ కొంచెం ఆందోళన కలిగించేదిగా ఉన్నా.

పారిశ్రామిక విప్లవం విస్తరించటంతో, యంత్రయుగం ఆరంభంకావటంతో, మనుష్యుల మనస్సులు రాను రాను జీవితాన్ని గూర్చి భౌతిక వాదసంజనితమైన అభిప్రాయాలకు లొంగిపోతూ వచ్చాయి. బాహ్య పరిస్థితుల్లో వస్తున్న మార్పు, యాదాలాపంగా వాళ్ళ ఆలోచనా విధానాన్నీ, ఆలోచనా క్రమాన్నీ కూడా ప్రభావితం చేసింది. యాంత్రికమైపోయి, వ్యవస్థలో బందీకృతమై పోయిన జీవన విధానం, దాని తాలూకు భౌతిక యాథార్థ్యం మెల్ల మెల్లగా వాళ్ళలో అతీత సత్యాన్ని గ్రహించే సున్నితమైన సూక్ష్మమైన భావనాశక్తిని మొద్దుబారిపోయేలా చేసింది. అందువల్ల విశ్వాసం యొక్క పునాదులే దెబ్బతినిపోయి, క్రమంగా యంత్రయుగం అవిశ్వాస యుగంగా రూపొందింది. సాల్టర్ అన్నట్లు, మరో అర్థంలో, 'ఇనుము' మానవుని 'ఆత్మలో' చోటుచేసుకున్నది. 19—వ శతాబ్దపు సాహిత్యంలో అధిక భాగానికి ముఖ్యలక్షణం 'సందేహం'. ఆ శతాబ్ది ఆరంభంలో బ్లేక్ అన్నాడుకూడా :

సూర్యచంద్రులే సందేహిస్తే
వెంటనే వాళ్ళు ప్రకాశించటం మానేస్తారు.

యోగిని మించిన 'యథార్థవాది 'లేడు!

బేకన్ వాదం అనే ఈ అవిశ్వాసం అట్లాంటిక్ సముద్రానికి ఆవలివైపున పుట్టటంలోనే ఒక విశేషం ఉన్నట్లు తోస్తుంది. ఆదేశం మనదేశానికంటే త్వరితంగానూ ఎక్కువగానూ పారిశ్రామికం కావటమే కాదు, ఒక వంద సంవత్సరాలుగా అక్కడ తెలివి మంతులు పాత మతాన్ని కాదని, అన్ని రకాలైన కొత్త మతాల్ని కనిపెట్టుతూ వినియోగించుకుంటూ ఉన్నారు కూడా. డీలియా బేకన్‌చేసిన 'తుంటరితనం' —లెస్టరు ప్రభువు గుర్రపు పాల అబ్బాయి' (ఆవిడ షేక్స్పియర్‌ను దయతో పిలిచే పేరు) సమాధిచుట్టూ ఏదో పిచ్చిగా మనక లాంతరు పట్టుకుని వెదకటం కాదు, ఆమె గొణుగుడు వల్ల అవిశ్వాసపు అసిపంజరాల సందుల్లో దెయ్యపు కేకలు ప్రతిధ్వనించేలా చెయ్యటం, అంతటితో ఉన్మాదం(శూన్యంలోతెరుగని శూన్యాన్ని)'' ఎలుగెత్తి పిలుస్తోంది.

పోనీ యీ విషయం ఏమంత ముఖ్యమైంది కాదని కొట్టి పారవేస్తామే అనుకోండి, తర్వాత? తర్వాత ఏ వౌతుంది? ఈ నెగటివిజమ్ (Nagativism) నుంచీ క్రమంగా నిహిలిజం (Nihilism) లోకి వెడతాము : బేకన్ వాదం వంటి అవిశ్వాసం నుంచీ ఆటంబాంబుకి. బాగా ఆలోచించండి. పోతే ఒక్క మాట : ఈ విధంగా భావాల్ని సంఘటిత పరచటంలో, అంటే 'నెగెటివ్'ని 'నిహిలిస్టిక్'తో ముడిపెట్టడంలో నాఉద్దేశ్యం — బాగా తిష్ఠ వేసిన యీ బుద్ధిజాడ్యం ముదిరే వైనమూ దాని ప్రత్యేక లక్షణాలూ ఎలా ఉంటాయో సూచించటమే. (న్యూమన్ అన్నట్లు 'మేధయొక్క యీ సంశయ ప్రవృత్తి సర్వమూ హరిస్తూ సర్వనాశనం చేస్తున్నది')

బేకన్ వాదం తాలూకు అవిశ్వాసం యీ యుగపు అస్పష్ట లక్షణాల్లో ఒకటి. అధ్యాత్మికమైన వాటిని తోసి రాజనటం మనకు శ్రేయస్సు కాదు. మనం ఏ హీనస్థితికి దిగజారి ఉన్నామో యింకా పూర్తిగా గుర్తింపలేకపోవచ్చు. కానీ విజ్ఞాన శాస్త్రోన్ముఖమైన దానినే సరిగా తెలీని పరిస్థితిలో మానవుని మనస్సు — అది జాగరితం చేస్తున్న శక్తుల్ని గూర్చి, లీలగా తప్ప, దానికే సరిగా తెలీని పరిస్థితిలో — మన నిస్పృహకు దోహదం చేస్తూ నిరాశను యినుమడింపజేయటం లోనే నిమగ్నమై ఉంది.

ఇంగ్లండ్ పోవచ్చు, బేబిలాన్ రోమ్‌లు వెళ్ళిన దారిలో ప్రస్థానం చెయ్యవచ్చు, కాని తన సాహిత్యంద్వారా యీ దేశం అనశ్వరమే — ఆ సాహిత్యానికి పట్టాభిషిక్తుడు షేక్స్‌పియర్. "అతణ్ణి ఒక్కణ్ణి పెద్ద హోదాలుగల వ్యక్తుల సమూహంలో సమానంగా వెలగట్టటానికూడా అంగీకరించము. మనం సాధించిన దాంట్లో మహాత్తమమైన కృషి ఆయన. ఏ వస్తువు నైనా యివ్వటానికి సిద్ధమే. ఇతర దేశాలముందు గౌరవాన్నీ ఈ ఇంగ్లీషు గృహానికి అలంకారాన్నీ యిచ్చే ఒక్క షేక్స్ పియర్‌ను తప్ప! "కార్లైల్ అన్న యీ మాటలు సుపరిచితాలే అయినా అవి ప్రస్తుతం కర్తవ్యాన్ని మనకు గోచరింప చేయాలి. ఇంగ్లండ్ కీర్తికి భంగం కలిగించే ఈ కుట్రకు, మౌనం వహిస్తూ మనం సహాయభూతులు కాకూడదు, అదే కర్తవ్యం. ఈ ద్రోహులని, వీళ్ల అబద్ధాల్ని ఖండించాలి. సూచనగా, సూటిగా, డొంక తిరుగుడుగా ఎన్నో రకాల పుట్టిస్తున్నారు వీళ్లు అబద్ధాల్ని. ('ఆల్స్‌వెల్' నాటకంలో లాఫూ అనే మాట మీకు గుర్తుండ వచ్చు "మూడువంతులు అబద్ధాలూ ఒక వంతు నిజం ఉపయోగిస్తూ వెయ్యి గాలి కబుర్లు ప్రచారం చేసేవాణ్ణి ఒక్కసారి విని మూడు సార్లు తన్నాలి.") వీళ్ల ఆరోపణలూ, దూషణలూ, 'సాక్ష్యం కావాలి యింకా సాక్ష్యం కావాలి' అంటూ వీళ్లు అరిచే అరుపులూ (కళ్లు లేని 'మోల్' సూర్యకాంతిని, గూర్చి సాక్ష్యం కావాలన్నదట) వీళ్ల అంతులేని పగటి వేషాలూ; సున్నలట, 'క్రాసు'లట, రహస్య చక్రాలట, నిగూఢార్థాలట. వీళ్ల తారుమార్లు హస్త లాఘవాలూ — ఇవన్నీ ప్రక్కకు నెట్టి మనం మళ్లీ ఒక ముఖ్యప్రశ్న వేద్దాం; అసలు ప్రశ్న; మన ముందున్న సాటిలేని యీ రచనలు దగాలో మోసంలో పుట్టటం సాధ్యమా? తెరవెనకాల నీడల్లో నక్కిన దగాకోర్లు ఎవరైనా యిటువంటి రచనలకి — కర్తృత్వం వహించటం సాధ్యమేనా? గబ్బిలాలూ గుడ్లగూబలూ తమ చీకటి నెలవుల్లో ఉంటూ భాస్కరునితో సామ్యం పొందగలవా?

రాజులు ఈ గ్రంథం కీర్తిని చూచి అసూయజెంది
దీని ఎత్తు ధనమే కాదు, రాజ దండాల్నీ, కిరీటాల్నీ
వేసి సరితూస్తూ
ఆ విధంగా దీని మూల్యం తగ్గించేందుకు విఫల
ప్రయత్నం చేస్తారు—
అంత సంపదా ఈ ఒక్క సంపుటి ఆంతర్యంలో
అవలీలగా యిమిడి పోయే ఉంది.
సామ్రాజ్యాలు కొంతకాలం పెరగవచ్చు తరుగ
వచ్చు — వాటి తాలూకు
ఆరాధ్య దైవాలు ముక్కలు చెక్కలై కాస్పేపు
నేలను నింపవచ్చు.
రాజ్యాలకు జరాభారం ఉంది, కాని యీయన
కాలాతీతుడైన రాజు
కాలాన్ని జయించి దాని మకుటాన్ని సమభాగం
పంచుకున్నవాడు. 10

"చూడదగిన వ్యక్తులు" అనే వ్యాసం వ్రాస్తూ హేజ్‌లిట్ అందులో చిట్టచివర చార్లెస్‌లాంబ్ షేక్స్‌పియర్‌ను గూర్చి వ్యక్తం చేసిన భావాల్ని పొందుపరిచాడు : ఆ భావాల్లోని కవ్వించే ఆకర్షణ ప్రస్తుతం జ్ఞాపకం వస్తోంది నాకు. జార్జ్ విండ్ హామ్ ప్రచురించిన షేక్స్పియర్ కవితాసంపుటిలో ఒక ఉల్లేఖనం చాలా ఏళ్ళక్రితం చూచాను. అది చదివినప్పుడు నేను ఉద్విగ్నుణ్ణ య్యాను (లాంబ్ చదివి వుంటే ఆయనకెలా ఉండేదో!). ఆ ఉల్లేఖనంలోనివిషయం ఒక ఉత్తరాన్ని గూర్చి-కౌంటెస్ అఫ్ పెంబ్రోక్ తన కొడుక్కి (మూడవ కౌంట్) ఉత్తరం వ్రాస్తూ మహారాజు జేమ్సు 1ను సాలిస్‌బరీనుంచి విల్టన్‌లో జరిగే 'ఏజ్ యూ లైక్ యిట్' ప్రదర్శనకు వెంటబెట్టుకుని తీసుకురావలసిందిగా కోరింది. అందులో, ఆమె "షేక్స్‌పియర్ స్వయానా మనతో ఉన్నాడు" అని వ్రాసింది. రాజు విచ్చేశాడు, డిసెంబరు 2, 1603 తేదీ జరిగిన నాటక ప్రదర్శనానికి అక్కడ ఉన్నాడు. ఇందులో రాజు విచ్చేయటంకంటే మన భావనాశక్తిని ఆకట్టే విషయం, ఆయింకో వ్యక్తి అక్కడ ఉండటం. ఈ మధ్య మళ్లీ విండ్‌హామ్ ఉల్లేఖనం చదువుతూ ఆ LXXXI సానెట్ చూశాను :

నా మృదు కవితే నీకు స్మృతి చిహ్నం
ఇప్పటికి సృష్టిలోలేని కన్నులు భవిష్యత్తులో దీన్ని
చదువుతాయి.
ఈ లోకపు ప్రాణులందరూ గతించిపోయి ఉంటారు కాని
నీ అస్తిత్వాన్ని అప్పటి నాల్కలు వల్లిస్తాయి.
జీవుల నిశ్వాసంలో, మనుష్యుల మనస్సుల్లో
నువ్వెప్పుడూ ఉంటావు—నాకలంలో ఆమహత్త్వంఉంది.

మొదట ఎప్పుడో చదివినప్పుడు కలిగిన ఉద్వేగమే నాలో మళ్లీ కలిగింది. ఆ మాటల్ని చదువుతూ ఉంటే — "షేక్స్‌పియర్ స్వయానా మనతో ఉన్నాడు."

—శ్రీ ఔలట్‌గారి ఈ ఉత్తమ వ్యాసం లండన్‌లోని ఫ్రాన్సిస్ థామ్సన్ సొసైటీ కార్యదర్శి శ్రీ జి. కృష్ణమూర్తి గారు "భారతి" కి పంపారు. శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు అనువదించారు. వారికి మా వందనాలు —భా. సం.

10. ఒక స్నేహితురాలి షేక్స్‌పియర్ గ్రంథంపై ఆమె కోరగా నేను వ్రాసిన పంక్తులు — ఎఫ్.సి.ఒ.

రచయితలకు

# ఒక్క వినతి

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

మంచువలె నాచుట్టును, వ్యా
పించు వంచన చించుటకు, ఉద
యించు సూర్యుని లేతకరముల
మించు రచనలు నాకు కావలె—

స్పర్థ ఈర్ష్యా ద్వేషముల కా
స్పదము నా హృద్వనములో, ఆ
కలుపు మొక్కల ఛేదనకు నీ
కలము కావలె కుఠారాగ్రము—

మంచితనమను పంటలను పం
డించగా నీ కలము హాలమయి
దున్న వలె నా మనోక్షేత్రపు
దుక్కులను నవదృక్పథమ్ముల

పాతగాథలు, పాడుబాధలు
పలికి నన్నిటు వేచె దెందుకు?
క్రొత్త ప్రమిదను కోర్కెమై నా
కొరకుగా వెలిగింప వెందుకు?

కోరియొక క్రొంగ్రొత్త బాటను
ఏరు కొంటివి గదర! అన్నా!
బాటలో ఆ పాత పాటన
పాడెదవు-ఫలితంబు సున్నా!

## భారతి

కాళరాతిరి నిశీథములో
క్రాంతిరేకలు నాకు కావలె,
శాంతి కడుపున దాగియున్నయు
షస్సులెన్నో నాకు కావలె—

మంచి నాలో పెంచు గాథలు
మానవత పోషించు గాథలు
మానవుని ఒక దేవదేవుగ
మలచు పాటలు నాకు కావలె—

నా మనసు దుర్బలము జేసిడి
నాప రచనలు వేలు దేనికి ?
చక్కగా నను నడుపగల రచ
నొక్కటే ఒకటైన చాలును—



కోమటియనే పేరువచ్చిన కారణాల కథలు చాలా ఉన్నాయి. థర్‌స్టన్ పేర్కొన్న వాటిలో (1) 'కుమతి'', (2) ఆవువంటి సాధు స్వభావంగల అనిపించే 'గోమతి' (3) 'గోమతి' నదీతీరస్థులు. (4) 'కో— మతి' నుండీ వచ్చెనట.

పూర్వం జంతువులపై దినుసులు మోయించుకుంటూ దేశద్రిమ్మర్లుగానున్న వర్తకులనే సార్థవాహులు, గంత వర్తకులు ఎగ్గైరా పేర్ల గుర్తించారు. శాసనాల్లో పేరింగె (కన్నడ) పెరికె (తెలుగు) వర్తకులే పెరికెవారు. అయితే అలా పెరికాటం జేసిన కులాలు, జాతులు చాలా ఉన్నాయి. పెరికాటం జేసిన వర్తకుల్నే ఐతిహాసిక శతాబ్దాల్లో 'గోమి' అన్నారు — తద్భవమై య్యుండునా కోమటి? మన 'కో' గీర్వాణంలో 'గో' అవుతుంది.

## 2

కోమటివారి "కన్యకా పురాణం" కులకథ :—

వీరు శివునాజ్ఞచే దివినుండి భువికి వచ్చారు. విశ్వకర్మ వీరి యావేశాలుగా 18 పట్టణములు నిర్మించెను. వాటి రాజధాని పెనుగొండ. వారి కులపతి కుసుమశ్రేష్ఠి. పార్వతి యవతారమైన కన్య, కన్యక, వాసవి, కన్యకాపరమేశ్వరి కుసుమశ్రేష్ఠి కుసుమాంబల పుత్రిక. ఈ పద్దెనిమిది పట్టణాలకు సరిహద్దులు ఒక వైపున గంగ (?) మరొకవైపున గొస్తనీ నది (తణుకు తాలూకాలో నున్నది)

విజయాంక పుత్రుడూ, రాజరాజ నరేంద్రుని తండ్రియైన విష్ణువర్ధనుడు పెనుగొండ వచ్చినప్పుడు 7 ఏండ్ల వయస్సున్న వాసవీ కన్యను పెండ్లాడగోరెను. పెనుగొండ 'వైశ్యరాజు'లకు మేనరికం ముఖ్యం. ఈ వియ్యం అధర్మం, అశాస్త్రీయం అని పెనుగొండ వైశ్యులు అగ్నిజొచ్చి ఆత్మాహుతి జేసుకున్నారు. వారు 102 గోత్రాలవారు. వారి సంతతి గౌరవింపబడి గవర కోమటివారైనారు. తదితరులు కులహీనులైనారు.

వాసవీకన్య అగ్నికాహుతియగుటకు ముందు నిజరూపు (పార్వతి) జూపి, వారి కులాచార ధర్మానుచరణకు కట్టడిజేసెను. వారి స్త్రీలను కురూపులుగా నుండజేసెను. వాసవీ కన్యను లాంఛనప్రాయంగా నగరీశ్వరునకిచ్చి పెండ్లిజేసినారు.

పెండ్లికి తరలి వచ్చిన విష్ణువర్ధనుడు ఆమె శాప కారణమున పెనుగొండజేరగానే ఏనుగపైనుండి పడిపోగా తల వేయి ముక్కలై జచ్చెను.

## 3.

వాసవీకన్య చితాభస్మంతోపాటు స్వర్ణ ప్రతిమ లభించినట్లు, నగరేశ్వరాలయముననే ప్రతిష్ఠించి, పూజించి, కాల



వాసవీ కన్యకా పరమేశ్వరి *

క్రమాన స్వర్ణప్రతిమ స్థానమున శిలావిగ్రహముంచిరని చెప్పెదరు.

కులస్థులు జెప్పు కథనే థర్‌స్టన్ పేర్కొనెను. కాని బిషప్ వైట్‌హెడ్ సేకరించిన కథమాత్రము విభిన్నముగానున్నదట. ఆయన సేకరించిన కథలో పెనుగొండ (వైశ్యరాజు) వారు యుద్ధ కుశలురు. వారి కన్యను వధువుగాబడయగోరిన మ్లేచ్ఛుల (?) శివుని కృపచే తరిమికొట్టినారు. కాని కులస్థులు కొందరు కన్యను శుద్ధికాగోరగా నామె నిజరూపున కాన్పింపి, అగ్నిజొచ్చి (శుద్ధి) శివునిజేరెను.

## 4

కులకథలో అగ్నిగుండాలు నాగసముద్ర తటాక ప్రాంతం ఇదే అనుకునే తావులో కాన్పించేవి పొలాలు. నాడు విష్ణువర్ధనుడు విడిసిన ఉద్యానవనమే నేటి వనంపల్లియనెదరు.

---

* ఈ వాసవీ కన్య ఛాయాచిత్రం ప్రత్యేకానుమతిని పొందినది. ఆలయ ధర్మకర్తలు, పెనుగొండ వారి యనుమతి లేకుండా మరేవిధంగానైనా పునర్ముద్రించిన, వారు తీసుకునే చర్యకు బాధ్యులయ్యెదరు.

పెనుగొండ ఇప్పుడూ వర్తక (అపరాలు, పసుపు వగైరా) కేంద్రమే. పురాతనం అనిపించేదైయున్నా ఆలయ నిర్మాణం మాత్రం పురాతనం అనిపించేదిగా కాన్పించదు. అయితే ఆలయంలో ఆరాధ్యమూర్తులూ, ఆలయ పరిసరాల్లో లభించిన విగ్రహాలు మాత్రం ఖచ్చితంగా ఆలయ నిర్మాణ కాలానికన్న పూర్వపువే. ఆలయంలో నున్న వింధ్యవాసినీ (మహిషాసుర మర్దని), బైట దొరకిన వింధ్య వాసినీ విగ్రహాలు రెండూ ఒకే పోలికవై యున్నవి.

ఆలయాల్లోనే గాదు, రూప చిత్రాల్లో కూడా దేవి దేవునికి ఎడమవైపు ఉండుట సర్వ సాధారణం. కాని, పెనుగొండలో నగరీశ్వరు (శివ, లింగమూర్తి) నకు కుడివైపున కన్యకాపరమేశ్వరి, ఎడమవైపు వింధ్యవాసినీ ఉన్నారు. వేర్వేరుగా నుండుటలో అమ్మవార్ల నిద్దరినీ విభిన్న కాలంలో నగరీశ్వరాలయంలో జేర్చారా అనే సందేహం కల్గడం సహజం.

వాసవీ కన్య చిత్రము జూచిన ఆ దేవి 7 ఏండ్ల బాలిక గాక పూర్ణ యవ్వనిగా నున్నది. పెనుగొండ వైశ్యులు



శివ - భైరవ

ఈ దేవీ మూర్తికి మాంగల్యధారణ జేయించినా ఆ శిల్పంలో కన్య యనే సూచన యున్నది. విజ్ఞులు గుర్తించగలరు.

ఆలయ పరిసరాల్లో లభించినవి రెండు పురుష విగ్రహాలు శైవమే యనిపించును.

ఆసీనుడై యున్న దేవుని చేతిలో నున్న గుండ్రని యాకారపు ఐతిహ్యం పరిశోధనీయం. జైనశిల్పం అనే భ్రాంతి కల్గించవచ్చు కాని గజాననుడు కాడు. మధ్య శతాబ్దాల్లో జైనం శైవం జేరి పోయిన చరిత్ర ఉన్నది.

సాయుధుడై నిలచియున్న పురుషమూర్తి వివరాలు పూనా నుండి తెప్పించాను. ప్రసిద్ధ పురావస్తు శాస్త్రజ్ఞుడూ, దక్కన్ కాలేజ్ ఆఫ్ పోస్ట్ గ్రాడ్యుయేట్స్ ఆచార్యుడూ అయిన డాక్టర్ సంకలియా (Sankalia) ఆ విగ్రహం అగ్ని భైరవ, శివునిదిగా గుర్తించెను. రుద్ర—శివ—భైరవ కథల్లో అగ్ని ప్రమేయం అపారం—కాల పురుషుడనే కథ ఉంది.

## 5

నగరేశ్వరాలయ ప్రాకారంలో అతకబడియున్న శాసనాలు—వివరాలు ప్రభుత్వ శాసన పరిశోధక శాఖవారిచ్చారు.

(1) శ్రావణ రక్తాక్షిలో లోక కల్యాణార్థం—'సన్ముదరాజ శ్రీ కొమ్మూరి బసవరాజు, దేశపాన్ద్య సరకారు యెజూరు' ది తెలుగు శాసనం పురాతనం కాదు.

(2) మరో శాసన శకలాలు—'కూన భూప, వైశ్యులు, పెనుగొండ నగరీశ్వర' దేవుడూ పేర్కొనబడిరి. కూనభూప కోన (సీము) హైహయురాజుల్లో ఒకడు అయ్యుండునా ?) కోన రాజుల శాసనాలు పెనుగొండ దగ్గర్లో నున్న ఆచంట (నర్సాపురం తాలూకా) లోనూ ఉన్నాయి.

(3) కన్యకాపరమేశ్వరి ఆలయం గోడలో అతికియున్న తెలుగు శాసనం—తూర్పు చాళుక్యుల్లో ఒకానొక 'సర్వ లోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజు' నాటిది. 'మూలస్థాన మహాదేవుని' కి అఖండ దీపదానం చేసినవాడు (పేరు పోయినది) 'మాచన దండనాయకు' ని తమ్ముడు.

(4) నగరీశ్వరాలయం మరో శాసనంలో—కోటిలింగం చేసిన ఆలయ పునరుద్ధరణ వైనం. పేర్కొన్న గ్రామాలు 'మమ్మడి' (మామూడూరు ?), వినగపూడి (వెగ్గిపూడి), వారణాసి (?), కంకులేరు (వెలగలేరు ?), మతంపూడి. ఈ శాసనంలో విశదమయ్యే చారిత్రకాంశం—ఒకానొక 'గజపతిరాజు' పెనుగొండ పట్టణమును ధ్వంసంచేసి పరశురాము ప్రీతి చేసెను.

## 6

కుల కథలో విష్ణువర్ధనుడూ, శాసనంలో గజపతి (కళింగరాజు) ఒకడై యుండునా? ఆ గజపతిరాజు పెట్టిన

ఇప్పు సందర్భమే కుల కథలో అగ్నిగుండాల కథ అయ్యుండునా? ఆచంట స్థల పురాణంలో మార్తాండేశ్వర (లింగమూర్తి) కారణాన అగ్నిప్రమాదాలు సంభవించేవనీ, ఆ మూర్తి కెదురుగా మహిషాసుర మర్దని నిల్పగా ఉగ్రత తగ్గెననీ ఉంది. రెండుచోట్లా విగ్రహాలు పూర్వపువీ, ఆలయాలు కాల క్రమాన ఏర్పడ్డవి.

శాసనంలో ముమ్మడి గ్రామనామం —రాజ కుటుంబంలో మూడవవాడు, కుమార అనే అర్థం. వర్తక సంఘం సంబంధంలో ముమ్మడి సంఘాధ్యక్షుని సహాయకుడు, డిప్యూటీ, అసిస్టాంట్.

వర్తకులు రాజులుగా, రాజ ప్రతినిధులుగా నున్న చరిత్ర ఉంది. కాగా చీనా యాత్రికుని వ్రాతల్లో నాటి రాజుల్లో ఒకడు వైశ్యుడు, క్షత్రియుడు కూడా అని ఉంది. దక్షిణ భారతాన ఆయుధోపజీవు లనేకులు క్షత్రియు లైనారు. పరిపాలకులు వర్తకాన్ని పోషించుటే గాక స్వయంగా వర్తకం జేసిన వైనమూ ఉన్నది.

పెనుగొండవారి కుల కథలో రాజు సంగతి నిజమైతే రాజరాజనరేంద్రుని తండ్రి యన్నందున ఆ విష్ణువర్ధనుడు ముమ్మడి భీమ, రాజమార్తాండ, సర్వ లోకాశ్రయ, విష్ణువర్ధన, విమలాదిత్యుడే గావాలి. విమలాదిత్యుని తండ్రి దానార్ణవుడే విజయాంకుడు కావాలి.

బిషప్ సేకరించిన కోమటివారి కుల కథలో మ్లేచ్ఛులు ఎవరో తెలీదు. హిందూేతరులు, విదేశీయులు, మహమ్మదీయులు, అటవికజనాన్నీ పూర్వం మ్లేచ్ఛు లన్నారు.

దానార్ణవుని తర్వాత 30 ఏళ్లకు కొడుకు శక్తివర్మ రాజు కాగల్గాడు. కారణం దానార్ణవుని కాలంలో వేంగి రాజ్యంలో—చాళుక్యరాజ కుటుంబాల్లో అంతః కలహాలు. కర్ణాటక సైన్యాల సహాయాన బాదపుని విజయం, కళింగ గంగా రామాన్వయ రాజులు వేంగీ రాజకీయాల్లో పాల్గొనడం, రాష్ట్రకూటాదుల కిరాత సైన్యాలు—

శక్తివర్మ తర్వాత తమ్ముడు విమలాదిత్యుడు క్రీ. శ. 1015 లో పట్టాభిషిక్తు డైనాడు. ఈ రాజు కాలాన్నే బావ మరిది చోళ సైన్యాలతో దండెత్తివచ్చెనట.

విమలాదిత్యుడు చివరి కాలాన మతాంతరుడై విశాఖపట్నం జిల్లా విజయనగరం దగ్గరి రామతీర్థానికి పోయినట్లు శాసనాధారా లున్నాయి. కాని ఆ రాజు పెనుగొండలో గాని రాజమహేంద్రవరంలో గాని మరణించలేదు.

విమలాదిత్యుడుగాని మరో విష్ణువర్ధన బిరుదాంకితుడైన చాళుక్యరాజు ఎవరైనా పెనుగొండ వర్తక సంఘాధ్యక్షుని ఏడేండ్ల బాలికను పెండ్లాడగోరుట సంభవమా ?

పెనుగొండకు సుమారు 8 మైళ్లలో నున్న ఆసంట (ఆచంట) క్రీ. శ. 5 వ శతాబ్దానికే ప్రసిద్ధం—ఆసంటేశ్వర మహాత్మ్యం, స్థలపురాణాల్లో దక్షారామం పేర్కొనబడెనే గాని చేరువనున్న పెనుగొండ ప్రసక్తి లేదు.

చాళుక్యులనాడు అనేకులు బ్రాహ్మణ క్షత్రియులైనారే గాని కాకతీయ—రెడ్డిరాజుల నాటి వలె—కాల క్రమాన మార్పుల్లో వచ్చిన పేర్లు, అసంఖ్యాక కులాలు క్రీ. శ. 12 శతాబ్దం పూర్వం లేవు.

'కన్యకాపురాణ' రచనా కాలం క్రీ.శ. 17 — 18 శతాబ్దాల మధ్య అనీ, కాదు క్రీ. శ. 16వ శతాబ్దానిదనీ నమ్మే వారున్నారు. ఇన్ని రకాల కులముల తయారుకూడా క్రీ.శ. 16—18 శతాబ్దాల మధ్యనే అంటారు కొందరు. ఈ శతాబ్దాల్లో గతకాలపు వృత్తి వర్తక సంఘాలు నేటి కుల సంఘాలుగా మారనారంభించాయంటారు.

నగరేశ్వరాలయ శాసనంలో పేర్కొనబడిన గజపతి రాజునే కథలో కన్యను పెండ్లాడ గోరిన రాజు అనలేము. కాని కళింగ కోమటివారికీ గోదావరి కోమటివారికీ పడదు. కళింగ కోమటి వారు మాంసాహారులు, కాని ఇతరత్రా వీరిని పోలినవారే.

రాజు — కన్యక కథకన్న ముఖ్యం కోమటివారి కుల కట్టడి మార్చిన కథగా కన్పిస్తుంది. రెండు వర్తక సంఘాల మధ్య ద్వేషం ఈ కుల కథకు కారణమైయ్యుండునా?

పోతే వర్తక సంఘ చరిత్ర తెలియనివారీ కులకథా రచయితలైయ్యుందురా?

ఒకానొకరాజు పెనుగొండ వర్తక సంఘాన్ని నాశనం జేయడమో, వారి భాగ్యం అపహరించడమో కులకథకారణమై యుండునా?

గౌరి, గౌరు—పార్వతీదేవి అని సాధారణాభిప్రాయం. కాని గౌరి, లక్ష్మి, వసు శబ్దాలు — కాంతి, అగ్ని, తేజస్సు, స్వర్గం, సస్యం, భాగ్యం, అనే అర్థాలూ ఉన్నాయి.

ఇంకా — అమ్మవారికి అనేక రూపాలు, గుణాలు కల్పించుకున్నారు మానవులు. వాళ్ళ మొదటి దేవత అమ్మవారు. బాల, కుమారి, గౌరి, వయస్సు సూచించే పేర్లు. జగన్మాత పవిత్ర అనుకోడంలో, కన్య (శీల) గా పరిగణించుకోడంలో ఆమె (శీలం) నిప్పువంటిది, అగ్ని స్వరూపిణి —ఇదంతా వివరణ ఒక వ్యాసం అవుతుంది.

కోమటివారు, కులకథ నిజమైతే, చాళుక్యరాజుకు పిల్ల నీయడంలో అయిష్టతకు కారణం మేనరికం ఆచారమే అని పిస్తుంది. కాని చాణుక్యులు కులచరిత్ర తెలిసినవారై యుండరు. బ్రహ్మ దోసిలినుండి చాణుక్యవీరుడుద్భవించెననే కథ విమలా దిత్యుని నాటినుండే ప్రచారానికి వచ్చెననీ, చాళుక్యులు సంకీర్ణ జాతి అనీ పరిశోధకాభిప్రాయం.

బ్రాహ్మణులకు దప్ప ఇతరులకు గోత్రాలులేవని పరిశోధ కాభిప్రాయం. గోత్రం సామూహిక, వర్గ సాంకేతిక నామం. అయితేసాంకేతిక నామాలు, చిహ్నాలు, (Tokens) అనేక దేశాల్లో లనేక జాతుల్లో ఉన్నాయి. ఆటవికం అనుకోనక్కర్లేదు. కదంబరాజులకు కడిమిచెట్టు కులవృక్షం — దేవత — అంటే వారి పవిత్ర సాంకేతిక చిహ్నం —

కోమటివారి గోత్రాలు వృక్ష మృగనామ సంబంధాలతో ఉన్నాయి. అవి 120 వరకూ ఉన్నా 102 కు సరిపెట్టారనెను థర్‌స్టన్. ఇతర కులాలువారు కోమటివారి గోత్రాలు 101 అంటారు. పూర్వం వర్తక సంఘాలలో ఉన్న నేటి పెరికెవారికీ 101 గోత్రాలు. వారిలో పెండ్లికూతురు, మెడకు కట్టే 'శతమానం'' 101 పోగుల బొందు. తెలికివారి వధువు కూ 101 పోగుల బొందు 'శతమానం'

సుప్రసిద్ధ శాసన పరిశోధకుడు హుల్ష్ ప్రకటించిన పేకి (తూర్పు గోదావరి) శాసనంలో కోమటివారి ప్రసక్తి తెలికి కుటుంబానికి కొన్ని అధికారాలు సౌకర్యాలూ కల్పించి నట్లున్నదట.

కోమటివారి 'ఆర్యవైశ్య'— వ్యవహారికంగా వణిజ వాచ కము. అయినా దీని అర్థంలో ఆర్యులనాటి వైశ్యులని ధ్వనిస్తుంది. క్రీ.శ. 9వ శతాబ్దం—రాష్ట్రకూటులనాటికే 'ఆర్య' వర్తకునికి మరోపేరుగా ఉంది. గౌరవ సూచకం. కాని ఆ ఆర్యలో సూచింప బడింది కోమటివారే అని కొందరి అభిప్రాయం.

వృత్తి — వర్తక సంఘాలనుండి ఏర్పడిన కులాల్లో అర్జ, ఆర్జ, అయ్య, అజ్జ గౌరవ వాచకాలు ఆర్యశబ్దభవంగా ఉన్నాయి. కాని ఆర్యులనబడిన వారి సంబంధం గాదు.

పెనుగొండ వైశ్యులకు పట్నాలు, రాజ్యంచేసినట్లు చెప్పుకునే కారణం కథగా ఉందిగాని చరిత్రగా లేదు.

## 7

పూర్వం వర్తక సంఘాల కేంద్రం ధార్వాడజిల్లాయందలి అయిహొళి, ఇయహొలు, ఆర్యావళి, అయ్యావళి, హయ మనిపురం, అయ్యపోలు అనబడిన బౌద్ధుల ఇసిలాం దేశంలో వివిధ ప్రాంతాల సంఘాధ్యక్షులే కేంద్ర సమాఖ్య సభ్యులు. ఆ సభ్యులకే ప్రాంతీయాధికారంలో సెట్టి, శ్రేష్ఠి, దేశాయి, దేశాయిసెట్టి, పట్నసెట్టి, పట్నస్వామి, పురసెట్టి, కులరాజు, వైశ్యరాజు, సేనాపతి, ధనపాంసెట్టి, పెద్దిసెట్టి మొదలైన పేర్లు. నిగమసభ పౌర పరిపాలన చేసింది. న్యాయ, మత, ధర్మ, శాఖ విషయాల్లో అధికారులు. ప్రభుత్వ కోశాధి పతులు. కాలక్రమాన ఈ పదవులే భూస్వామ్యం, రక్షణ పన్నులు వసూళ్ల సందర్భంగా పటేల్, పట్వారీ, మున్సబు కరణాలు, కులకర్ణి, కులశ్రేష్ఠిగా దిగజారి చివరికి కులపెద్ద, కులపతి అయినారు. రెడ్డి, చౌదరి, నాయుడూ అలాంటివే. ఆర్యావళీ సభ్యులంతా ఆర్యులే.

నగరం, నకరం వర్తకసంఘాన్ని సూచించేదైనా వాడు కలో 101 లేక 102 గోత్రాలుకల కోమటి వారినే సూచించే దని కొంద రభిప్రాయం. ఆంధ్ర చక్రవర్తులనాటి హిరణక నకరలో ఈ కుల సూచన లేదు.

అయిహొలు వర్తక సమాఖ్య సందర్భంగా ఏర్పడిన దేశాయి శబ్దం కోమటి వారిలో కాన్పించదు. కాని, ఇతర రాష్ట్రాల్లో వర్తకం చేసిన అనేక కులాల్లో మన రాష్ట్రంలో బలిజ, పెరికె మొదలగువారిలో నున్నది. దేశాయికి 18 వృత్తుల వారిపై (అష్టాదశవర్ణం, పద్దెనిమిది పణములు) అధికార ముండేది. ఆ 18 పణముల సంగతి మర్చిపోయి పెను గొండ వైశ్యులకు విశ్వకర్మ 18 పట్నాలు నిర్మించి యిచ్చి నట్లు, వాటికి రాజధాని పెనుగొండ అనే కథ వచ్చినట్లుంది. వారి కుల కథలో కుసుమ శ్రేష్టి వారి పెద్దిసెట్టి—కులపతి, కులశ్రేష్టి—ఆయన కార్యస్థానం పెనుగొండ, సహాయకుడు ముమ్మడి అనాలి. పెనుగొండవారు మర్చిపోయినా శ్రీకాకుళం జిల్లా కళింగకోమటివా రింకా వైశ్యరాజు, కులరాజు, సేనాపతి అధికారసూచక నామాలు వాడుచున్నారు.

దేశాయి అధికార పదవి చిహ్నం పేరే బసవశంకర బిరుదు. అదే వజ్రభైషుగ. ఈ చిహ్నం కేవలం బలిజ కులస్తుల దను కొనేవా రున్నారు. కాని, గోలకొండ గొల్లకొండయ్య కథలో నవాబిచ్చినదీ బసవశంకర బిరుదమే. ఈ చిహ్నం అయిహొళ్ల సమాఖ్యదనే అభిప్రాయం ఉంది. ఆ సమాఖ్యకు చెందిన ప్రాంతీయ సంఘాలకూ అదే చిహ్నం ఉండడం అసంభవ గాదు.

బసవశంకర బిరుదు ఆకారం పెద్ద గరిటె, దానికి కట్టిన గంట. దేశాయి సభల్లో దీనికి పెద్ద ప్రాముఖ్యం ఉండేది. పెనుగొండలో దొరకిన గరిటె జేగంట దేవాలయానిది కాదు—పెనుగొండ కార్యస్థానంగా గల పట్నస్వామి అధికార

చిహ్నం. ఆ గరిటె కుడకపై ఆయా 18 వృత్తుల సాంకేతిక చిహ్నాలుండును.

## 8

రాయి, కొండ లేకపోయినా పెనుగొండ అనే పేరెలా వచ్చింది ? అనంతపురంజిల్లా పెనుకొండ (ఘనగపుర) నుండి వలస వచ్చారా ? అంటే పెద్ద కొండ అనే అర్థం యిచ్చే పేర్లు ఇతర రాష్ట్రాల్లోనూ ఉన్నాయి. పెనుగొండ నగరీశ్వర దేవుని మరో పేరు (శాసనంలో) మూలస్థాన మహాదేవుడు. నెల్లూరులో కూడా మూలస్థానేశ్వరు డున్నాడు కాబట్టి అక్కడి నుండి వచ్చారనలేము. శివుని పేర్లలో స్థాణు (లింగ) ఒకటి స్థాణూనాంపతి.'

కోమటివారు (గోమటేశ్వర) పూర్వం జైనులనే అభిప్రాయం ఉంది. పూర్వం కృషి వాణిజ్యాల్లో నున్నవా రనేకులు జైనులు, బౌద్ధులు—తర్వాత శైవు లైనారు. శైవులైన పెనుగొండ వైశ్యులను విమలాదిత్యుడు గాని, జైనులైన పెనుగొండ వైశ్యులను మరే రాజు గాని బాధించెనేమో తెలీదు.—ఆ పని చోళులు చేశారేమో !

కోటిలింగం శాసనంలో మళెంపూడి వివరాలు తెలియవు. ఒకానొక మతంకు చెందినదైతే ఆ మతం బౌద్ధులదై య్యుండునా ? అయ్యున్న శైవుల దనెందు కనుకోరాదు ?

ఆంధ్ర చక్రవర్తులనాటి బౌద్ధ క్షేత్రాల శిథిలాలు పశ్చిమ గోదావరి జిల్లాలో కామవరపుకోట దగ్గర గుంటుపల్లి గుహల్లో, తాడేపల్లిగూడెం దగ్గరి అరుగోలను దిబ్బల్లో కాన్పిస్తున్నాయి. సాలంకాయనరాజులనాడు కూడా పశ్చిమ గోదావరి (వేగి) జిల్లాలో బౌద్ధం పోషింపబడింది..

సాతవాహనుల నాటి ఆచార్య నాగార్జునుని ఇంటి పేరు వడలి. పెనుగొండ యావలి గ్రామం పేరు వడలి. ఆ చోటనే గోదావరీ తీరంలో నున్నది సిద్ధాంతం. సిద్ధాంత, సిద్ధార్థక నామా లున్నవన్న బౌద్ధ సంబంధంగానే పరిశోధకులు గుర్తించారు. శ్రీకాకుళం జిల్లాలో కూడా అంతే.

గిరి, పర్వత, శైల శబ్దాలు శైవంలో ఉన్నాయి. కాని బౌద్ధుల్లోనే ఎక్కువగా ఉండడం, అది పూర్వపు మతం గావడం—పుబ్బశైల, అపరశైల, మహాశైల వగైరా—చరిత్ర ఉంది.

బౌద్ధులు ఐహోలులనే ఇసిలా అన్నారు. బౌద్ధ సంబంధంగా మహాశైలమే పెనుశిలా,ఘనశైల,పెనుగొండగా మారెనా?

ధార్వాడ జిల్లా ఐశిలాకు పశ్చిమ గోదావరిజిల్లా పెనుశిలాకు మేనమామ పోలికలు లేకపోవచ్చును. కాని పెనుగొండ వర్తక సంఘం ఐహోలు సమాఖ్యలో అనుబంధ సంఘం అయ్యుండా లంటే మాత్రం కాదనలేము. పెనుగొండలో బసవ శంకర బిరుదం దొరకడం, పెనుగొండ కులపతి కార్యస్థానం కావడం—అంతే అనిపిస్తోంది.



# నన్నయ భారతము రాజరాజు

శ్రీ వె దక్షిణామూర్తి

అక్టోబరు 1963 భారతిలో ప్రకటితమైన శ్రీ వై. సీతారామస్వామి (స్వామికాదు శర్మ) గారి లేఖపై, మార్చి 1964 భారతిలో శ్రీ పాటిబండ మాధవశర్మగారు, ఏప్రిల్ 1964 భారతిలో శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు చర్చను ప్రారంభించుచు వ్యాసములు ప్రకటించియున్నారు.

శ్రీ పాటిబండ మాధవశర్మగారు, కృతి కర్తృత్వమును శంకింపరాదనియు, నన్నయ వంటి మహాకవికి ద్రోహము తల పెట్టరాదనియు వ్రాసియున్నారు. వసంత తిలక వృత్తమును పరిష్కర్తలు దిద్దివైచినారనియు వారు నుడివియున్నారు. హ్రస్వజకారయుక్తమైన పాఠమే సరియైనదని వా రభిప్రాయ పడినారు. అట్లభిప్రాయపడుటకు పింగళుని నుండి వచ్చుచున్న సంస్కృత ఛందోరీతియే కారణమని వారు వివరించి యున్నారు.

నన్నయ భాగమందే, ప్రసక్తమైన వసంత తిలకము గాక మరి రెండు వసంత తిలకము లున్నవి.

వసంత తిలకము :—

ఈ బాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నున్
నా బంధు లందఱు మనంబున నేమనా రె
ట్లీ బాలు సూర్యునిభు నిట్టుల డించి పోవం
గా బుద్ధి పుట్టునని కన్య మనంబులోనన్.

ఆది. పం. 29 పద్యము.

ఈ పద్యము యొక్క ద్వితీయ చరణాంతమునందుండు బక్షరము గురువే కదా ! ఈ పాదమునకే పాఠాంతరము లీయ బడినవి. "రే, యీ బాలు సూర్యనిభు, నే, విటువెట్టి, నెట్టుల, డించి ...... నెట్టులు—పుట్టదని ...."

పాఠాంతరములందు గూడ ద్వితీయ చరణము గుర్వక్షర ముతో నంతమగుచున్నది.

వసంతతిలకము :—

శ్రీరమ్య రాజకులశేఖర రాజరాజా
భూరి ప్రతాప పరిభూత విరోధి వర్గా
హారామృతాబ్జహార హాస తుషార కుంద
తారా యశః ప్రసర పాండుకృత త్రిలోకా !

అర. తృ. 399 పద్యము.

దీనియందలి ద్వితీయ చరణాంతాక్షరము గురువుగనే యున్నది. శ్రీ శర్మగారి ప్రకారము వసంత తిలక వృత్తములన్నియు నన్నయ, సంస్కృత ఛందోరీతి ననుసరించి హ్రస్వాంత ద్వితీయ చరణముగా వ్రాసెననియు, పరిష్కర్తలు గుర్వంతముగా దిద్దిరనియు దెలిసికొనవలసి యున్నది. దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు శ్రీ శర్మగారి యభిప్రాయముతో నేకీభవింపక 'నాకీ వసంత తిలక ఛందస్సులో ఛందోలోప మున్నట్లు తోచలేదు" అని చెప్పియున్నారు.

అక్టోబరు 63 భారతిలోని లేఖకుడు "రాజా నారాయణాఖ్య" యను సంబోధనమును బట్టి నన్నయ కృతాంధ్ర భారతమునకు కృతిపతి నారాయణాఖ్యు డగుచున్నాడు. అప్పుడు రాజరాజు గతి యేమి కావలెను.?' అని సందేహమును వెల్లడించి చర్చింపవలసినదిగాఁ గోరినాడు. చర్చింపవలసినది కృతిపతి ఎవరని కాని కృతికర్త యెవ్వరని కాదు. శ్రీ పాటిబండ మాధవశర్మగారు కృతిపతి విషయమును చర్చింపక, కృతికర్తకు ద్రోహము తలపెట్టినట్లు భావించి నన్నయయే కృతి కర్త యని వ్రాసి వృథాశ్రమకు లోనైనారు. నన్నయ కృతి కర్త కాదని లేఖకుడు చెప్పలేదు కదా !

(2) శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు 'నన్నిద్వయ' మను శీర్షికతో చర్చ కుపక్రమించి, భారత మాంధ్రీకరించు టకు, నన్ని నారాయణభట్టు, నన్నియభట్టుకు తోడుపడినా డని, వా రిరువురు జంటకవులని 'రాజా, నారాయణాఖ్య—కరుణారసపూర్ణ' అనగా నారాయణాఖ్య కవియందు పూర్ణ కరుణారసదృష్టి కలవాడు–ఓ రాజా ! అని తోడు కవి కర్తృత్వ చిహ్నము వసంత తిలక వృత్తములో చిగురించుచున్న దన్నారు.

"తెనుగు కవులలో తోడు కవులను వాద్యముగా పేర్కొన్న కవులు తొలి ఛందోకర్త రేచనయు, తొలి పురాణ కర్త నన్నయభట్టును మాత్రమే ధ్రువతారలై వెలుగొందు చున్నారు" అని తీర్పు నిచ్చియున్నారు.

శ్రీ రెడ్డిగారుకూడ కృతిపతినిగాక కృతికర్తను గూర్చియే వ్రాసినారు. అనగా వారు 'నాకు తోచిన యూహను ప్రకటించడమైనది' అని వ్రాసికొన్నట్లు, తోచి నది వ్రాసినారే కాని జిజ్ఞాసకు తగిన చర్చలేదు.

ప్రసక్త వసంతతిలక మందలి రాజా, నారాయణాఖ్యా అనునదెట్లు చారిత్రికముగా సమన్వయమగుచున్నదో తెలిసి కొనవలయునను జిజ్ఞాస కలిగినట్లు కూడా చెప్పియున్నారు.

రాజరాజనరేంద్రుని పాలన కాలము సుమారు నలువది రెండేండ్లు. అతని పట్టాభిషేకము 1022 ఆగష్టు 16వ తేది. అప్పటినుండి క్రీ.శ. 1062 వరకు వేంగిని పాలించినాడు. పట్టాభిషేకమునకుఁ బూర్వమే యాతడు క్రీ.శ. 1019 లో రాజైనాడు. అతడు ప్రభువుగా నుండినప్పటికి, భారత మునందాతనికి ప్రీతి, భక్తి తాత్పర్యములున్నప్పటికి, నన్నయ అతని యాస్థానమునందున్నప్పటికి, నన్నయ తన కృతిని (ఆంధ్ర మహాభారతమును) రాజరాజునకుఁ గృతినీయలేదు. నన్నయ నాటికి కృతినిచ్చు ఆచారము లేకుండెననుకొనవలయును. తెలుగుదేశము మాత్రము నన్నయ కృతాంధ్ర మహాభారతము నకు రాజరాజ కృతికి భర్తయని నమ్మియున్నది. పండిత లోక ముగూడ చాలవరకీవిధముగానే యూహించుచున్నది. కొందరు అనగా దివాకర్ల వేంకటావధానిగారు, నిడుదవోలు వేంకటరావు గారు మొదలగువారు మాత్రము రాజరాజు కృతి భర్త కాడ నియు,నన్నయకు భారతాంధ్రీకరణమునకుఁ బ్రోత్సాహ మిచ్చినవాడు మాత్రమేయనియు చెప్పియున్నారు.

రాజరాజు కృతిభర్త కాడనుటకు భారత మందలి యవతారిక పద్యములే సాక్ష్యము లగుచున్నవి.

నన్నిచోడ తిక్కనలచే కృతినిచ్చు పద్ధతి ఆంధ్ర మునందు ప్రారంభమై, ప్రబంధయుగమున, తరువాతను,

కృతినిచ్చు క్రమము చక్కగా నేర్పడినది. తొలి పద్యమే కృతి పతికి నిష్ట దైవము దీవెనలొసగుగాక! యని ప్రారంభమగును. తదితర దేవతల యాశీస్సులైన తరువాత, కృతిపతి, కవిని తనపేర కావ్యము వ్రాయుమని సదక్షిణ కర్పూర తాంబూల జాంబూనదాంబరాగ్రహారముల నిచ్చి, కోరుకొనుట, కవి తదభ్యుదయపరంపరాభివృద్ధిగా కావ్య నిర్మాణమునకుఁ బూని, కృతి భర్తృవంశ వర్ణనము, షష్ఠ్యంతములు వ్రాయుట మొదలగునవి యుండును. అట్టివి నన్నయ భారతమందు కనబడవు— కనుకనే నన్నయ రాజరాజునకు కృతినివ్వ లేదని చెప్పవలసి యున్నది.

రాజరాజు ప్రోత్సాహకుడైన నాతని స్మరించుట న్యాయమే. కాని ద్వితీయాశ్వాసాంతము నందలి వసంత తిలక వృత్తములోని రాజా! నారాయణాఖ్య పదమును బట్టి రాజరాజేగాక నారాయణుడు కూడ ప్రోత్సాహమిచ్చినట్లు ఊహింప వీలగుచున్నది.

హ్రస్వఇకార యుక్తముగానుండవలెనని శ్రీపాటి బండ మాధవశర్మగారన్నారు. అదియే సాధు పాఠమైనచో రాజ నారాయణాఖ్య' యగును. అది బిరుదమనియు నూహింప నగును. కాని నా మనవి ఏమన బిరుదాంతమునందు ఆఖ్య శబ్దమును ప్రయోగించినది నన్నయ వ్రాతలలో నిక్కడ దప్ప మరెక్కడను గనబడదు. మిగిలిన బిరుదములు 'ఆఖ్య' యుక్తముగా లేకుండ, ఇచ్చట మాత్రమే ఆఖ్యయుక్తముగా నుండుట వలన నారాయణాఖ్య యనునది బిరుదము కాదనియు, అది నామవాచకమనియు, తన్నామధారకుడు నన్నయ్యకుఁ బ్రోత్సాహమిచ్చిన వాడనియు దలంచుటలోదప్పు లేదనుకొందును.

ఈ తలంపును స్థిరీకరించుటకు నన్నయ నాటి చరిత్ర తోడ్పడగలదు.

[ రాజరాజనరేంద్రుడు క్రీ.శ. 1035లో నంద మపూడి యగ్రహారమును నన్నినారాయణభట్టునకు దాన మిచ్చెను. ఈ విషయము నందమపూడి శాసనము తెల్పుచున్నది. ఆ శాసన కావ్యకర్త నన్నియభట్టు. అందు పేర్కొన్న నన్ని నారాయణభట్టు అష్ట భాషా విశారదుడు. సంస్కృతాంధ్ర కర్ణాటకపైశాచికాది భాషలయందు పాండిత్యము కలవాడు. అట్టి నారాయణభట్టు తనకు సహాయధ్యాయుడు, ఇష్టుడు. కావుననే తనకు భారత రచనయందు తోడయి నిర్వహించినాడు. అంతియే కాని అతడు నన్నయకు జంట కవి కాడని తోచుచున్నది.

నన్నయకు సుమారు నూరు సంవత్సరముల వెనుక పంప మహాకవి కన్నడమున భారతమును రచించెను. ఆతడు తన కావ్యమునకు 'విక్రమార్జున విజయ' మని పేరిడెను. ఆతడు తన కావ్యమును తన పోషకుడగు చాళుక్య రాజు అరికేసరి కంకితమిచ్చెను.

కన్నడ భాషావేత్తయగు నారాయణభట్టు వలన నన్నయ కన్నడ భారతమును వినియుండును. అందువలననే నన్నయ భారతమునందు పంపని పోలిక లెన్నియో కలవు. ఇన్ని పోలికలుండి కూడా పంప తన కావ్యమును అరికేసరికి కృతి నిచ్చినట్లే నన్నయ తన కృతినెందుకీయ లేదు, అను ప్రశ్న ఉదయించును. దానికి సమాధాన మీ విధముగాఁ జెప్పవచ్చును.

నన్నయకు పోషకుడు, ప్రోత్సాహకుడు రాజరాజు మాత్రమే కాడు, నారాయణాఖ్యుడు గూడ. ఒక్క కావ్యము నిద్దరికిఁ కృతి నిచ్చుటకు వలను పడక, కృతినిచ్చు ఆచార మతనికి తెలిసి యున్నను, ఉద్దతుల మధ్య చల్లగా తప్పుకొన్నాడు. కావుననే ఆంధ్రమందాది కావ్యమైన భారత మంకిత మీయఁబడ లేదు.

ఇట్లూహించినప్పుడు లేఖకులు తలచినట్లు, నారాయణాఖ్యుడు కృతి పతి కాక ప్రోత్సాహ కర్త మాత్రమగుచున్నాడు.

ఇంతవరకు చర్చచేసిన, శ్రీ శర్మగారుగాని, శ్రీ రెడ్డిగారుగాని కృతిపతి విషయమై ప్రస్తావింపక కృతికర్తను గూర్చి యనపేక్షితముగా వ్రాసియున్నారు. లేఖకుల సంశయము తీరునో తీరదో కాని నాకు తెలిసినంతవరకు, రాజా, నారాయణాఖ్య పదములు రెండును సంబోధనలే. నన్నయకు, నారాయణాఖ్యుడు, రాజరాజు — ఇరువురు ప్రోత్సాహకులే యగుదురని తలంచుచున్నాను.

(ఈ విషయమై ఇక చర్చ సాగించ దలచలేదు. —సం)

# క్రోధి

# రెట్టని జ్యోస్యం

**శ్రీ ఎక్కిరాల వేదవ్యాస**

"రెట్టమతంగా వాదించకురా" అనే నానుడి తెలుగు నాట వాడుక పదమై పోయింది. ఏదైనా మాటకి తిరుగులేని, ఘంటాపథంగా చెప్పే వాదానికి "రెట్టమతం" మారుపేరైంది. ఈ రెట్టడు మహా జ్యోతిశ్శాస్త్రవేత్త. సంవత్సరాది, గ్రహ గతులూ, శకునాలు, గ్రహణాదుల ఫలితాలూ, దేశంమీద ఎలా ఉంటాయో చెప్పిన శాస్త్రకర్త ఈతడు:—

సీ. వరుస గర్గాచార్యవర్యుని మతమున
మతిశాలి, హరిభట్టు మతమునందు
ధర గీర్తిఘనుడైన ధన్వుని మతమందు
ప్రతిభ చెన్నొందు శ్రీపతి మతమున
మేటియైన వరాహ మిహిరార్య మతమున
సన్మేఘ మాలికా శాస్త్రమునను
నుచితి కీర్త్యాఖ్యచే నొనరు నారాయణ
భట్టుమతమునం బ్రాజ్ఞులైన

తే. జనుల యుక్తిని జ్యోతిష సారమునను
శకున చయమున గల యర్థచయము తెలిసి
కృతి యొనర్చిన రెట్టని మతము......

తె. ఎంత లోకోపకార మెంత నిక్క-
మెంత ప్రత్యక్ష మిదియని యెప్పుడార్యు
లెల్ల శిరసావహింపుదు రీమతంబు......

అని విద్వదాదరణీయమైన పద్ధతిలో రచించిన మేటి రెట్టడు. అతని 'మతము'నుబట్టి రాబోతున్న (నిజ చైత్ర) సంవత్సరం ఫలాలను గమనించటము జ్యోతిర్వ్యాసంగము మాత్రమేగాక సారస్వత సమీక్ష—అందులోనూ సాహిత్య రత్న పరీక్షగా కూడా తప్పక వెలుగొందగలదు. ఇందులో రెట్టని దిట్టతనముతోబాటు ముద్దులు గూర్చు కవిత సరసుల నాకర్షించునదై యున్నది.

రెట్టని మతం ఈ క్రొత్త క్రోధి భవిష్యత్తునీ, మన దేశ అదృష్టాన్నీ ఎలా వ్యక్తం చేస్తుందో చూతాము.

| | | | |
|---|---|---|---|
| | | స్వతంత్ర భారత లగ్నం సూర్యగ్రహణం (10-6-64) | చంద్రగ్రహణం 12-12-24 25-6-64 సూర్యగ్రహణం 9-7-64 వర్షలగ్నం |
| శని కుజ | క్రోధి సంవత్సర విరయనరాశి స్థితి | | |
| | | | యమ(ప్లూటో) వరుణ (యురేనస్) |
| | సూర్యగ్రహణం (4-12-64) | ఇంద్ర (నెప్ట్యూన్) | |

విశేషములు:—

(1) వర్ష లగ్నాత్తు వ్యయభావంలో స్వతంత్ర భారతలగ్నం.

(2) స్వతంత్ర భారత జాతకప్పు రాజ్యస్థానంలో శని, కుజ సంయోగానికి వరుణ, యమ విరోధ దృష్టి.

(3) స్వతంత్ర భారత జాతక లగ్నంలోనూ, సప్తమం (విదేశీ వ్యవహారాలు) లోనూ రెండు సూర్య గ్రహణాలు.

(4) వర్ష లగ్నం నైర్హా పండితుని లగ్నాత్తు వ్యయ భావంలో పడుట ఆవర్ష లగ్నం మిధునమై మూడు గ్రహణాలు అందులో జరగటం.

(5) గ్రహణాలు అన్నీ భారత లగ్నాత్తు—లగ్న, ద్వితీయ (గృహ, ధన మారక) సప్తమ (విదేశాంగ) అష్టమ (మృత్యు) భావాల్లో పడటం.

(6) పై స్వతంత్ర భారత లగ్నం వృషభమే మన ఆంధ్ర రాష్ట్రపు నూతన ప్రభుత్వపు జన్మ లగ్నం (గ్రహణాలు) అవటం.

(7) 9 జూలై నాటి గ్రహణం స్వతంత్ర భారత జన్మతార పునర్వసుమీద.

8) (పునర్వసు ద్విదేవతాక నక్షత్రం. రెండు దేవత లధి పతులు. ఆ తారలో ఇండియా పాకిస్థాన్ కవలల పుట్టుక.)

(9) శని కుజ సంయోగం ప్రధాని జాతకపు అష్ట మ(మృత్యు భావ) రాశిమీద.

ఈ సంవత్సరం అధిక మాసంతో ప్రారంభించటం, అందులోనూ ముందు అధిక చైత్రం 14—3—1964 న మొదలు పెట్టటంవల్ల నిజచైత్రం ఏప్రిలు 13 న అవటంతో నిజ సంవత్సరాది 13—4—64 అయింది. ఉగాది పండుగలు రెండు మాసాల్లోనూ వస్తాయి. ఈ సంవత్సరం భారత చరిత్రలోకల్లా చాలా ప్రముఖమైన సంఘటనలు కలిగేదై మన చరిత్రలోనే మైలురాయివంటి దనటానికి ఇంకొన్ని విశేషాలు గమనింతాము.

(1) 12—3—64 న అధిక చైత్రాదితో గురు మేష ప్రవేశం (బృహస్పతి సంవత్సర ప్రారంభం) శని కుజ రాశి సంయోగం.

(2) 13—4—64 నిజ చైత్రాదితో సూర్య మేష ప్రవేశంతో సౌరచాంద్ర సంవత్సరారంభములు కలిసి జరిగే విశేషం.

(3) సూర్యుని విషు వత్ప్రవేశకాలము 21—3—64 నకు సాయన(శక) సంవత్సరారంభం తిథి అష్టమిలో; రవిమేష చంద్ర కర్కాటక(సాయన) స్థితి. రవి కుజ రాశి సంయోగం.

(4) క్రోధి సంవత్సరములోపలే 5 గ్రహణములు, ముఖ్యంగా ధనుర్మిథున రాసులలో (సాయన కటక, మకరములలో) జరగటం.

(5) టిబెట్టు యోగులు అనుసరిస్తున్న హిమాలయ పర్వతాల్లోని అతి ప్రాచీన గ్రంధాల గణితాన్నిబట్టి 1964—65 ప్రపంచానికి చాల ప్రమాద సూచకమైన "ఉడ్డ్రాగన్" (Wood-Dragon) సంవత్సరాంరంభం.

(6) ఛాల్డియా ఈజిపు దేశాల్లో సంవత్సర ఫలాలు మన రాజాది నవ నాయకులవల్లగాక రాశి దశలతోనే చెప్పేవారు. 432 సంవత్సరాల మహాదశలో ఒక్కొక్క అంతర్దశ 36 సంవత్సరాలు. అందులోనూ మూడు విదశలు—ఒక్కొక్కటి 12 సంవత్సరాలుండేది. ఈ పన్నెండేళ్ల విదశ గురువు 12 రాసులూ తిరిగి మళ్లీ యధాస్థానానికి చేరేకాలంతో సరాసరి సరిపోతుంది. దీనికితోడు ప్రతి దేశాన్ని పరిపాలించే రాశిని బట్టి, అందులోని పై దశల ఫలితాన్నిబట్టి ప్రపంచ భవిష్యత్తు చాలా ఆశ్చర్యకరంగా చెప్పేవారు.

కీరో (Cheiro) అనే ప్రఖ్యాత జ్యోతిష్కుడు ఈ పద్ధతినే ముఖ్యంగా వాడుతూ 1927 లో ప్రపంచ భవిష్యత్తు (Cheros world Predictions) అనే గ్రంథం ప్రకటించారు. దీనిలో భారత స్వాతంత్ర్యం, ఇండియా పాకిస్థాన్ల విభజన: రెండు ప్రపంచ యుద్ధాలు (అంటే రెండో మూడో ప్రపంచ సంగ్రామాలు) రష్యా ప్రపంచ ప్రాముఖ్యం అన్నీ అత్యాశ్చర్యకరంగా సూచించినట్టే జరుగుతుండటం జ్యోతిశాస్త్ర చరిత్రలో విశేషం. దీని ప్రకారం 1945 మొదలు 36 సంవత్సరాలు కుంభరాశిలో చంద్రుని అంతర్దశ. కుంభరాశి ప్రపంచంలో రష్యాని సూచించే రాశి అని బాగా తెలిసిన విషయమే. ఈ దశాదితో రెండో ప్రపంచ యుద్ధం కాగానే రష్యా, ఇంగ్లండు, అమెరికాల్ని తలదన్నే పురోగతి పొందటం మనం చూస్తున్న చారిత్రక సత్యము. ఆ కుంభ రాశిలోనూ చంద్రునిది, దశ అయిఉండటం, రష్యా ప్రపంచంలోకల్లా ముందుగా చంద్రగోళానికి రాకెట్టుని పంపించి కృత్రిమ చంద్రునిలాటి "స్పుట్నిక్" పంపించటం ఈ దశా సూచనకి సార్థకనామం. పైగా ఈ దశాధిపతి చంద్రునికి స్వక్షేత్రం కర్కాటకం. కర్కాటకం అనాదిగా వస్తున్న సంప్రదాయ రీత్యా చైనా రాసి. చైనా స్వాతంత్ర్య (కమ్యూనిస్టు) విప్లవం (1949) ఈదశ మొదట్లోనే అవటం ఇంకో ఉదాహరణ. ఈ పద్ధతినిబట్టి 1966 సంవత్సరందాకా చైనా ప్రపంచ వ్యాప్తికోసం ప్రయత్నాలు చేస్తుంది. చైనా జగజ్జేత అవ్వాలని ప్రయత్నం చెయ్యటంతో అన్ని దేశాలకి చైనా

వల్ల ప్రమాదం మొదటిసారిగా బట్టబయలుగావటం క్రోధి నామ సంవత్సర లక్షణం.

ప్రస్తుతపు కొత్త సంవత్సరానికి రాజు శని గనుక శని మహాశయుడి పాలనకింద ప్రపంచానికి తీరని కష్టకాల ప్రారంభం అవుతోందని చెప్పక తప్పదు. రానున్న 3 సంవత్సరాలలోనూ విశేష శుభ సూచనలు లేనందున ముఖ్యంగా తేలే విషయం 1962 సంవత్సరంలో చైనా దురాక్రమణ కొట్లాటలు, ప్రధాని నెహ్రూ అనారోగ్యం, మాజీ రాష్ట్రపతి రాజేంద్రబాబూ అనేక సైనికాధికారులు తదితర ప్రముఖుల దుర్మరణాలతో ప్రారంభమైన దుర్దశతో 1968 వరకూ చెప్పుకోతగ్గ మంచేమీ కనపడదు. అందులోనూ ఈ సంవత్సరం శనిరాజై

మ. శని వర్షాధి పతిత్వ మొందినను రాజశ్రేణికిన్ గల్గుభూ
జన సందోహము మీద గోపము మనస్తాపంబు పాపంబులున్
ఘన రోగంబులు బుట్టు గాలి విసరున్ వర్షంబు లేకుండు..
య్యన గొల్చున్ ధరతగ్గునంచునని రెట్టాఖ్యుండు ప్రఖ్యాతిగన్.

ధనిష్ఠ శత భిషములందు చరిస్తున్నందువల్ల గొప్ప తోక చుక్క పుట్టి ప్రపంచ విఖ్యాతుడు అయిన ఒక మహా వ్యక్తిని పొట్టను పెట్టుకోవటమేగాక:—

శతతీ రనుశ నైశ్చరుండు చరించిన
గార్తిక మాదిగా గల్గు వాన పాంచాల దేశాధి పతుల వధూటులు
వహ్నిలోబడు దురవారితముగ
నా దేశమునుండి యటు గాంచి పర్యంత
మును మారి చేజచ్చు జన చయంబు
గౌతమి నర్మద గంగయు నాదిగా దక్షిణదేశంబు దాకఁబంట

తే. గల్గు దక్కిన సీమల గల్గువాన
గొంచెముగ బంట పాటోలు గుంజరములు
ఘోటకమ్ములు వెలయును గువలయమున
ననియె రెట్టడు సకల విద్యావిదుండు.

మరిఇంకా చెప్పాలంటే:—

చ. ఒనర ధనిష్ఠ తారశని యుండిన వానలుగల్గుగౌతమీ
దినకర కన్యకానికట దేశము పైరు ఫలించు వగ్గునై
తనరును ధాన్యమంత బెడిదంబుగ బుట్టును ధూమకేతువెం
దునుదవసంబు తగ్గు జెడుద్రోనలెనెన్ ఃవిరెట్టడింపునన్,



# సాహిత్య చరిత్రలు విమర్శలు

## శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఈనాడాంధ్ర వాఙ్మయ చరిత్రలలోనేమి, విమర్శన లందేమి వింత వింత రచనలు కానవచ్చుచున్నవి. సాహిత్య చరిత్రలు, విమర్శనలు సప్రమాణికంగా ఉండడానికేకాక, భాషా వాఙ్మయ విశిష్టత ప్రత్యభివ్యక్తం కావడానికి నిశ్చయాత్మకమైన పరిజ్ఞానం, అత్యంతావశ్యకము. ఇట్టి పరిజ్ఞానం కలగడానికి మనకు గ్రంథాలే ఆధారమని అందరికి తెలిసిన విషయమే. అయితే నేడు మన దృష్టి గ్రంథాలపై లేదు—అది వ్యక్తులపై నాధారపడి యున్నది—ఈకారణంచేత రచనలలో నామవిపర్యాసాలు, వస్తు విపర్యాసాలు—విపరీతాభిప్రాయాలు విరివిగా కనిపించుచున్నవి. అట్టి రచనలనే గతానుగతికంగా మరికొందరు అనుసరించడము కూడా జరుగుచున్నది. దీనికి తోడు సృజనాత్మకమైన రచన చేయదగినవారు కేవలము కవులుగా పేరు పొందినవారు భాషా సాహితీ విమర్శనలకు పూనుకొన్నారు—ఒక మహాకవి సాహిత్య విమర్శనకు పూనుకుంటే, మరియొక మహాకవి ప్రాచీన గ్రంథ పరిష్కరణానికే సిద్ధపడినప్పుడు, మనకు విపరీత జ్ఞానమేగాని, విశిష్ట జ్ఞానమెట్లు లభిస్తుందో పాఠకులే ఊహింతురుగాక.

ఇరవై, ముప్పయియేండ్లనుండి దేశంలో ప్రచారంలో ఉన్న కొన్ని పత్రికలనుండి, గ్రంథాలనుండి పై అంశాలు వ్యక్తపరచడానికి ఉదాహరణ లిస్తున్నాను.

1. "నన్నయాంధ్ర కృత భారతము నీతడు (తిక్కన) చూచి యుండక పోవచ్చును."

"నన్నయ మూడు కృతులు రచించినాడని విని యాతని యందలి గౌరవముచేత తరువాతి భాగము రచించెను."

"తిక్కనాదులు మూడు కృతులన్నప్పుడు వారు విని యున్నదానిని మాత్రము వ్రాసిరి."

(భారతి సం. 4 సంచిక 10—1927 అక్టోబరు.)

"కేతన దశకుమార చరిత్రమున నన్నయను స్మరింపనైనలేడు." (ఆంధ్ర భారత కవితా విమర్శనలు పుట 10)

"మంత్రి భాస్కరుని కొమారుడగు తిక్కభూపాలుడు వైష్ణవ మతావలంబకుఁడు" (పుట 110)

పై వాక్యములవలన నన్నయ రచిత భారత భాగమును తిక్కన చూడనే లేదను వాదము ప్రతిపాదితమైనది. అంతే కాదు. తిక్కన సమకాలికుడగు కేతన కూడ నన్నయ భారతమును నెరుగడట.

కేతన దశకుమార చరిత్రమున నన్నయభట్టును స్మరింపకపోయినను, ఆతని యాంధ్ర భాషా భూషణమున "నన్నయభట్టాది కవి జనంబుల కరుణన్" అని 5 వ పద్యమున నన్నయను స్మరించియున్నాడు. అంతేకాదు. ఆ గ్రంథమునందే, సమాసములను గూర్చి చెప్పునప్పుడు

వాఁడి మయూఖము లనగా
వేఁడి పయోధారలనగ వింజామర నా
మూఁడస్త్రంబులనంగా
బోఁడిమి కర కంఠ నామముం బోలితగున్.

అనీ నన్నయవాడిన వాడి మయూఖములు (ఆది 3—112)-కరకంఠుడు (అర—1—327)—అను ప్రయోగములను కూడ నిచ్చియున్నాడు. తిక్కనకు సమకాలికుడై యాతనికి దశకుమార చరిత్ర కృతి నిచ్చిన కేతన నన్నయ భారతముచూచి, యందలి ప్రయోగముల నిచ్చినప్పుడు—తిక్కన దానిని చూడలేదనుట ఎంత యప్రామాణికమో చూడుడు.

ఇక తిక్కన తాతయగు మంత్రి భాస్కరునికి తిక్కభూపాలు డనుమాట విచారింతము. మంత్రి భాస్కరునికితిక్కన విరాట పర్వావతారిక నిచ్చిన వంశక్రమమును బట్టి చూడగా—

కేతన, మల్లన, సిద్దన, కొమ్మన, అను నలువురు పుత్రులే కాని 'తిక్క భూపాలుడను' కొడుకు లేనే లేడు. ఇంతకు 'తిక్క భూపాలు డేమి?' మంత్రి భాస్కరుని కొమారుడేమి? ఇది మనుమసిద్ధి తండ్రియైన తిక్క భూపాలునే మంత్రి భాస్కరుని కుమారునిగా భావించుట వలన వచ్చిన పొరపాటు. ఇప్పటి కింకను నీ భారత కవితా విమర్శనము పఠనీయ గ్రంథ ముగా నున్నది!

2. 'పంచమి'[1].లో కట్టమంచి రామలింగారెడ్డిగారు (పుట6) పాల్కురికి సోమనాథునికి పద్య కావ్యములు అర్వాచీనకాలమున బద్య కావ్యము లయినట్లుగనే ఈ రంగనాథ రామాయణము ద్విపదమైనను, ఇంచుమించు శతాబ్ది గడచిన పిమ్మటనే యనుకరణ యోగ్యమయ్యెనని తలంచుట సత్యమునకు దూరముగాదు.

పాల్కురికి సోమనాథుని కావ్యములు పద్యములైనవి ద్విపద కావ్యములుగాని, పద్య కావ్యములు గావు.

3. "కవిత్రయము" అను గ్రంథమున డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య : (పుట 10)

"ఇట్టి స్థితి గతులలో నన్నయ యారంభించిన మహా భారతమును పూరింప సాహసించు మహాకవి లేకపోయెను. ఈ యుగమునందే వేములవాడ భీమకవి సాహసించి భారతమును పూరింప నమకట్టియు విఫలుడై యుండవచ్చును. వేములవాడ భీమకవి విరాట పర్వమునుండి కొన్ని పద్యములు లక్షణ గ్రంథములందు దాహరింప బడినవి." కాని వేములవాడ భీమకవి వ్రాసినదని కవుల చరిత్రలు, లక్షణ గ్రంథములు—చెప్పినది భీమన—ఛందస్సు—కవిజనాశ్రయము [2] అను పేరు గలది గాని భారతముగాదు. నన్నయ తరువాత భారతము రచింప తలపెట్టినవాడు—అథర్వణుడుగాని, వేములవాడ భీమనకాదు. అథర్వణుని పద్యములనే లక్షణ గ్రంథకర్తలుదాహరించిరి.

4. ప్రాచీన గ్రంథములను గూర్చియేగాక, ఇట్టి నామ విపర్యాసములు (పేర్లలో తడబాటులు) నవీన గ్రంథములను గూర్చి యుండుట—యన్నింటి కన్న వింత.

కీర్తిశేషులు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు రచించినది 'ఆంధ్ర భాషా చరిత్ర" అను గ్రంథ మాంధ్ర విద్వల్లోకమున కంతకును సుపరిచితమైనది. అందు, నేడు ప్రచారమునను్న 'ద్రావిడ భాషా వాదము' ఖండితమగుటచే దాని వ్యాప్తి కొంత ఇనుమడించినది. అయితే—అందరును ఆంధ్ర భాషా చరిత్ర' అనగా కవి సమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారేమనుచున్నారో చూడుడు—

"డాక్టరు చిలుకూరి నారాయణరావుగారిని తెలుగుదేశ మెరుగుదురు. వారి ఆంధ్ర వాఙ్మయ చరిత్రమును 'ఆంధ్ర విశ్వ విద్యాలయము వారచ్చు వేసిరి. . . . .. ఆకారణముచేత వారి వాఙ్మయ చరిత్రకు—రాదగిన ప్రతిష్ఠ రాలేదు. . . . . . శ్రీ నారాయణరావుగారి వాఙ్మయ చరిత్రముయొక్క అనేక గుణములలో నిది యొక్కడు"

(నాటికాకర్త నారాయణరావు—భారతి సెప్టెంబరు 1938)
(పుట 267)

ఇట్లు విశ్వనాథవారు మూడు పర్యాయములు ఆంధ్ర భాషా చరిత్రను, వాఙ్మయ చరిత్రగా పేర్కొనుటయేగాక, 1940 లో నవ్య సాహిత్య పరిషత్తు సప్తమ వార్షికోత్సవమునకు వా రధ్యక్షత వహించినప్పు డేరీతిగా నీ గ్రంథమును గూర్చి చెప్పిరో వినుడు.

"డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు భాషాశాస్త్రమునందు రామమూర్తి పంతులుగారి శిష్యులై 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర' అనే మహా గ్రంథాన్ని నిర్మించేరు"

(భారతి విక్రమ—చైత్రము పుట 497.)

కాని విశ్వనాథవారు చెప్పినట్లు, చిలుకూరి నారాయణ రావుగారు వ్రాసినదీ, ఆంధ్ర విశ్వ విద్యాలయము వారచ్చు వేసినదీ ఆంధ్ర భాషా చరిత్రముగాని—వాఙ్మయ చరిత్రము గాదు—ఇందుకు నిదర్శనముగా నింగ్లీషున తెలుగునగల యా గ్రంథ ముఖ పత్రముం నిచ్చుచున్నాను.

Andhra University series No 18.
History of Telugu Language
(in two volumes)
By
C. Narayana Rao, M. A. L. T. phd.
Vol 1
1937.

ఆంధ్ర విశ్వ కళాపరిషద్గ్రంథమాల 18 వ ప్రచురణము

శ్రీః
ఆంధ్ర భాషా చరిత్రము
కర్త
చిలుకూరి నారాయరావు ఎమ్. ఏ. ఎల్. టి. పిహెచ్‌డీ
సంస్కృతాంధ్ర కర్ణాటకాధ్యాపకుడు.
1 వ భాగము రాయలసీమ కళాశాల, అనంతపురము

---

1. ఇది ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచే ప్రకటితము.

2. కవిజనాశ్రయము, భీమన పేరను వెలసినదిగాని యాతని రచన కాదనియు, నది—మల్లియ రేచన కృతమని, నేను పరిష్కరించి ప్రకటించిన కవిజనాశ్రయమున తెలిపితిని. చూ. వావిళ్ల ముద్రణము.

ఇంత స్పష్టముగా నుండుటయేగాక, విమర్శకులు—రచయితలు, భాషానేత్తలు, విద్యార్థులు, అందరునూ "ఆంధ్ర భాషా చరిత్ర" అను చుండగా విశ్వనాథవారు మాత్రము పట్టు పట్టినట్లు దానిని "వాఙ్మయ చరిత్ర" మనుట దురూహ్యముగ నున్నది—ఈనాడు భాషా వాఙ్మయ చరిత్రల ప్రత్యేక నిర్దిష్ట పరిజ్ఞానము, సాహిత్య ప్రపంచమున విశదమైయున్నది. నేడు కవి సమ్రాట్టుల ననుసరించి, భాషా చరిత్రలను వాఙ్మయ చరిత్రలుగను, వాఙ్మయ చరిత్రలను—భాషాచరిత్రలుగాను భాషా సాహితీ చరిత్రకారులు, విమర్శకులు వ్రాసెదరా?

ఇదియొకటియేకాదు. ఇంకొకదానిని చూడుడు:

## నిర్వచనోత్తర రామాయణము

'సంపత్కుమార' రచితమైన తెలుగు ఛందో- వికాసమునకు విశ్వనాథ వారొక విపులమైన ప్రస్తావన వ్రాసియున్నారు—అందులో పై గ్రంథమును గూర్చి ఇట్లు గలదు.

"ఆంధ్ర భాష ప్రధానముగా చంపూ పద్ధతినే స్వీకరించినది. తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణమును మొదట వ్రాసెను. దానిని నిర్వచనమని చెప్పవలసి వచ్చినది. ఉత్తర రామాయణమని పేరుపెట్టలేదు. ఆ పేరుపెట్టినది పాపరాజు." (పుట 13)

పై వ్రాతనుబట్టి తిక్కనయే తన గ్రంథమునకు "నిర్వచనోత్తర రామాయణము" అని పేరు పెట్టినట్లు స్పష్టమగుచున్నదిగదా! కాని తిక్కన, తన గ్రంథమున కట్టి పేరుపెట్టెనో, లేదో వీరు పరిశీలించినట్లు లేదు— గ్రంథము పేరు నిర్ధారించి తెలుపునది గ్రంథాశ్వాసాంత గద్యము తిక్కన గ్రంథమున యాశ్వాసాంత గద్య చూడుడు.

"ఇది శ్రీమదుభయకవి మిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విధేయ తిక్కన నామధేయ ప్రణీతంబైన యుత్తర రామాయణంబను మహా కావ్యంబునందు బ్రథమాశ్వాసము" ఇట్లే పది యాశ్వాసములలోను గలదు. దీనిని బట్టి తిక్కన గద్యలో నిర్వచన పద ముపయోగింపలే దనుట స్పష్టము. ఇంకను నవతారికలో:

క. ఎత్తెరిఁగైనను ధీరోదాత్త స్వపోత్తముఁడు రామచరిత పతిత
ద్వృత్తము సుభావ్యముగుట నుత్తర రామాయణోక్తి
యుక్తుఁడనైతిన్

అని యుత్తర రామాయణ నామమునే పేర్కొనెను.

ఇట్లు ముద్రిత గ్రంథమునసేగాక, తాళపత్ర ప్రతుం యందు ఉత్తర రామాయణమనియేలె యున్నది. గ్రంథాను క్రమణికలో గూడ—ఉత్తర శబ్దము క్రిందనే యున్నదిగాని నిర్వచన శబ్దము క్రిందలేదు—అప్పకవీయాది లక్షణ గ్రంథములలో నిర్వచనోత్తర రామాయణమని ముద్రితమున నున్నది. తాళపత్ర ప్రతులలో ఉత్తర రామాయణమనియే యున్నది.

ఇక పాపరాజు గ్రంథము చంపూ పద్ధతి రచితమైనది. అతడు సరిగా తన గ్రంథమున కుత్తర రామాయణమనియే వ్యవహరించినాడు. నిర్వచనోత్తర రామాయణమని తిక్కన చెప్పక పోయినను, దాని కా పేరంటగట్టినవారు ముద్రాపకులు—పాపరాజు గ్రంథము ప్రచారములోనికి రాగానే తిక్కన గ్రంథమునకు నా పేరే యుండుటంబట్టి వానిని పృథక్కరించుటకు నచ్చు వేసిన వారు చేసిన పని ఇది—ముద్రిత గ్రంథము నాధారముగా గతాను గతికముగా ఆ పేరు వాడుకలోనికి వచ్చినదిగాని, తిక్కనగా రెప్పుడును దాని కాపేరు పెట్టలేదు. ఆ పేరు పెట్టినది ప్రకటన కర్తలే.

ఇక వస్తు విపర్యాసములకు విశ్వనాథవారి అల్లసాని 'అల్లిక జిగిబిగి' అను గ్రంథమునుండి యుదాహరణ లిచ్చుచున్నాను.

"తాను (శ్రీ కృష్ణదేవరాయలు) వైష్ణవ ప్రభువు. పెద్దన కూడ వైష్ణవుడే. పుట 99—"పెద్దన విశిష్టాద్వైతి".

పుట 101—"కాని పెద్దన గారు తన విశిష్టాద్వైతము నీ పద్యముతో స్థాపించినాడు."

పుట 103—"పెద్దన్నగారు తమ మతమును (విశిష్టాద్వైతమును) మను చరిత్రమునందు చివరకు వెలయించినారు."

పై వాక్యములలో పెద్దన విశిష్టాద్వైతి యని స్పష్టముగా నుట్టంకింపబడి యున్నది.

ఈ భావనయే పెద్దన కృష్ణరాయలవంటి వైష్ణవుడే అను మాటకు నాధారమైనది. కాని కృష్ణరాయలు పెద్దన వంటి వైష్ణవుడు కాడు. ఆతడు విశిష్టాద్వైతి. తన యాముక్త మాల్యదను తిరుపతి వేంకటేశ్వరునికి కృతి నిచ్చుచు, వెంకటేశ్వర శబ్దములోని 'ఈశ్వర' శబ్దము శివపరమని, తన గ్రంథమునం దెల్లెడల "వెంకటపతి వెంకటభర్త" అని ఈశ్వర పద రాహిత్యముగ వాడిన కృష్ణరాయలవారును మనుచరిత్రావతారికలో శివ-స్తుతి యొనరించిన పెద్దన నెట్లొక్క రీతి వైష్ణవు లగుదురో దురూహ్యము. ఇక విశిష్టాద్వైత మతాను సారులకు కవుల కావ్యావ

3. చూ. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము గ్రంథ సూచి. ప్రబంధములు 1 వ సం పుటము.

తారికలలో శ్రీమహావిష్ణువు, అనంతుడు—గరుత్మంతుడు, విష్వక్సేనుడు, విష్ణు పంచాయుధములు, ఆళ్వారులు మొదలగు స్తుతులుండును. ఆముక్తమాల్య దావతారిక యే ఇందుకు నిదర్శనము—అట్టిచో అద్వైత స్మార్త సంప్రదాయానుసారముగ నవతారిక రచించిన పెద్దన విశిష్టాద్వైతియని యెట్లు నిరూపింపనగును. అతని మత మదియేయని ఎట్లు నిర్ధారితము?

పుట 4. "ఈ శిల్పమన్న మాటయే 'అల్లిక జిగిబిగి'లో నున్నది. ఈ మాట ప్రసిద్ధ చాటువు లోనిది.

"అల్లసాని వాని యల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగ విభుని పదగుంఫనంబును"

అని ఇందు మూడు పాదములే యుదాహృతములైనవి. నాల్గవ పాదములేదు. అది "కాకమాని రాయ నీకె తగుర" అనునది. దాని వలన ఈ పద్య చరిత్ర తెలియ నగును.

కాని ఈ పద్యము విశ్వనాథ వారన్నట్లు చాటువుగాదు. కాకమాని మూర్తి కవి రచించిన పాంచాలీ పరిణయమున నవతారికలో నున్నది.

గీ. అల్లసాని వాని యల్లిక బిగిసొంపు
ముక్కు తిమ్మనార్యు ముద్దు బలుకు
బాండురంగ విభుని పద్యంబు హరువును
గాకమాని రాయ నీకె కలదు (1—13)

విశ్వనాథవారిచ్చిన పద్యమునకు, పాంచాలీ పరిణయ పద్యమునకు, పాఠభేదమున్నది—అవియు సామాన్యమైనవి కావు—అందు మొదటిపాదము విశ్వనాథవారి గ్రంథనామము—"అల్లసానివాని అల్లిక జిగిబిగి" అను దానికే భంగము గలిగించు నది.

అల్లిక జిగిబిగి—అని విశ్వనాథవారి పాఠము.

అల్లిక బిగిసొంపు—అని పాంచాలీ పరిణయ పాఠము. అయితే పాంచాలీ పరిణయ పాఠమే సరియైనదని ఎట్లు చెప్పగలరందురా?

పాంచాలీ పరిణయమును వీరేశలింగముపంతులుగారు క్రీ. శ. 1894 లో అచ్చు వేయించిరి. ఆ వెనుక 1937 లో సంజువాణి అధిపతులు నందిరాజు చలపతిరావుగా రచ్చువేసిరి. ని రెండింటియందు పై పాఠమే కలదు. ఇక తాళపత్ర గ్రంథ పాఠమును అల్లిక బిగిసొంపు—అనియే వీనినిబట్టి మొదటి పాఠమున పాఠము:

"అల్లసాని వాని యల్లిక బిగిసొంపు" అనునదే కాని

అల్లసాని వాని యల్లిక జిగిబిగి—అనికాదు. రెండవది కీ సరియైన పాఠమనుకొని విశ్వనాథ వారి పాదముపై నొక గ్రంథము రచించిరి. గ్రంథ నామములోనే విపర్యాసమున్నప్పుడిక గ్రంథ వస్తు విపర్యాసము లెన్నియుండునో చదువరులూహించుకొనగలరు.

ఇక నిది 'చాటువు'. పాంచాలీ పరిణయకర్త తన కావ్యమున దాని ననుసంధించుకొనరాదా? అని కొంద రడుగవచ్చును. కాని చాటువుల కర్తృత్వము మనకు కొన్ని పట్టుల తెలియరాదు—ఈ చాటు పద్య పరిస్థితి మాత్ర మట్టిదిగాదు. కవి స్వయముగా, అవతారికలో అందును శ్రీరంగనాథుడు కలలో గాన్పించి పలికిన పలుకులలో నిది యున్నది. స్పష్టప్రతిపత్తికై పాంచాలీ పరిణయావతారికలో నాతడు వ్రాసిన భాగమును నిందు పొందుపరచుచున్నాను.

మూర్తికవి శ్రీ రంగేశుని, బ్రహ్మ శివులను, వినాయకుని ప్రార్థించి, సంస్కృతాంధ్ర కవి స్తుతి గావించి యా వెనుక నిట్లు వ్రాసియున్నాడు.

"అని ఇష్ట దేవతా వినుతియు, శిష్టకవి నమస్కృతియు దుష్టకవి నిరాకృతి యుం గావించి పాంచాలీ పరిణయ ప్రబంధ నిబంధనమునకు సమకట్టియున్న సమయంబున 9
స్వప్న సాక్షాత్కారము.

చ. తలగడగా నమర్చుకొని దక్షిణపాణిని జాను వంటగా
నలవడఁ జాపుకొన్న పెరహస్తముచే నితడింత నాడెవన్
బలువిడిఁబాడ నేర్చెనని పాదము లొత్తు రమాక్షమల్ వినన్
దలకడఁబాట మెచ్చుచును నారదుఁడెల్పెడు వేల్పుబొల్పుగన్ 10

మ. కలలోనం గరుణించి నన్ను బలికెన్ గ్రమేక్షుకో దండహ
స్తలతా కృష్ణ ధనుఃప్రకాండ విగళద్ధారాళ సారామృతో
జ్జ్వల మాధుర్య నిదాన చూడ్కుడుత నాంచారూ రదాచ్ఛాదనాం
చల విచ్ఛేదన సాధుసీధు నముదం చద్దంత వాగ్వైఖరిన్

క. పాంచాలీ పరిణయ కవి 11
పంచాస్య! భవత్ప్రబంధ పద సంబంధ
ప్రాంచనము సుహృత్క విరా
ట్కాంచనము సహృద్విరేఫ కాంచనముసుమా! 12

గీ. అల్లసాని వాని యల్లిక బిగి సొంపు
ముక్కు తిమ్మనార్యు ముద్దుబలుకు
పాండురంగ సుకవిపద్యంబు హరువును
గాక మాని రాయ నీకె కలదు 13

క. అంచితమతి కృతినీవొన
రించిన కృతి ద్రౌపదీ పరిణయము మాక
ర్ణించుము తెనుంగు కవిత వి
రించి విభునిఁ గాక మాని శ్రీమూర్తి కవీ! 14

ఇట్లు కంఠోక్తిగా స్వప్నమున గాన్పించి, శ్రీ రంగేశుడు పల్కిన పల్కులుగా కవి వ్రాయుచున్నప్పు డిది చాటు వెట్లగును? శ్రీ రంగేశుడు చెప్పినట్లున్నది గాన యాత్మస్తుతి ఇందు లేదు.

దీనినిబట్టి అసలు పాఠము "అల్లిక జిగిబిగి" కాదనియు, "తల్లిక బిగిసొంపు" అనునదే పాఠమనియు నిశ్చితముగా జెప్పవచ్చును.

ఈ క్రింది ప్రామాణి కోదాహృతులను బట్టి 'అల్లసాని వాని యల్లిక బిగి' యను పాఠమే ప్రచారములో నున్నట్లు చెప్పనగును.

1. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు
శబ్ద రత్నాకరము పీఠిక—భాషా ప్రశంస
15 వ పుటలో నిచ్చిన పాఠము[4]
"అల్లసానివాని యల్లిక బిగి"

2. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు
తమ ఆంధ్ర కవుల చరిత్ర తృతీయ భాగము
కాకమానిమూర్తి చరిత్రమున పుట 10 లో నిచ్చినది :
"అల్లసానివాని యల్లిక బిగి"

ఇక విశ్వనాథవారి "అల్లిక జిగిబిగి' యను పాఠమెక్కడ నుండి వచ్చినది యని పరిశీలింపగా, పూర్వము నే నుదాహరించిన కట్టమంచివారి 'పంచమి' వ్యాస సంపుటినుండి సంగ్రహీతమైనట్లు తోచినది—అందు 18 వ పుటలో నిట్లున్నది.

ఆ. వె. అల్లసాని పెదన యల్లిక జిగి బిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దు బల్కు
పాండురంగ విభుని రద గుంభనంబును
కాకమాని రాయ నీకె తగుర 2

ఆధో జ్ఞాపిక '2' లో చాటువు—అని కలదు. విశ్వనాథ వారు దీనిని చాటువుగా పరిగణించుట కూడ పైనా వ్రాతకు ప్రోద్బలకము—(పెద్దన)కు వాని యని విశ్వనాథవారి పాఠము.

అయితే కట్టమంచివారికి ముందుగా గురుజాడ శ్రీరామ మూర్తిపంతులుగారు దీనిని తమ కవి జీవితములలో తెనాలి రామకృష్ణ కవి చరిత్రమున నుదాహరించిరి. వారి పద్య మిది:

అలసాని పెద్దన యల్లిక జిగి బిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దు పల్కు
పాండురంగ విభుని పదగుంభనంబును
కాకమానురాయ నీకు దగుర (పుట 220)

పై రెండింటిలోను జిగి బిగి, పద గుంభనంబు—ఈ రెండు పాఠము లు నున్నవి. వీని కాధార మేదియులేదు— ఇంకొక విశేషము గురజాడవారు పై పద్యమును తెనాలి రామ కృష్ణుని "మధుర వాక్యములు" గా దెల్పిరి. పైని నేను చూపిన పాంచాలీ పరిణయ పద్యమును బట్టి ఇది ఎంత యప్రామాణి కమో చదువరు లూహించుకొనగలరు. వీనినిబట్టి చూడగా అల్లిక జిగి బిగి, పద గుంభనము' అను నవపాఠములు గురజాడ వారి మూలమున వ్యాప్తములైనట్లు నిశ్చయింపవచ్చును. ఈ రెండింటిని గతాను గులికముగనే నేడు వాఙ్మయ చరిత్రలలో యనుసరించుచునే యున్నారు—కాని యొక యపపాఠము ననుసరించినచో, నది ఎట్టి యపమార్గమున బడునో సూచించుటకు విశ్వనాథవారి విమర్శన చాలును.

ఇట్లే ప్రాచీన పద్య పాఠముల నుదాహరించుటయందు విశ్వనాథ వారెంత ప్రమాదపడిరో చూడుడు—పుట 45.

"ఓ చతురాస్య వంశ కలశో దధి పూర్ణ శశాంక" అను పద్యమునిచ్చి—46 పుటలో దానిని గూర్చి ఇట్లు వ్రాసిరి.

"ఓ మిహి రాంశు వంశ కలశో దధి పూర్ణ శశాంక" అన్న శ్రీనాథుని పద్య చరణమును దీసికొని "మిహిరాంశు" బదులు "చతురాస్య" పెట్టినా—ఇది పెద్దన్న గమను దనము—శ్రీనాథుని సంబోధనలో పద్య చరణపు కూర్పే ప్రధానముగాని విశేషము లేదు. ఇక్కడి ఈ సంబోధనలో సిద్ధాని స్వభావమునకు ఇది వ్యంజకముగుట యున్నది."

ఈ శ్రీనాథుని పద్య చరణ మాతని కృతులలో దేనిలో నున్నదో విశ్వనాథవారు విశదము చేయలేదు—అది ప్రసిద్ధ మని మానియుందురు—ఇది శృంగారనైషధమున తృతీయాశ్వాసమున 63 వ పద్యముగా నున్నది—అందున్న పాఠమిది :

"ఓ మిహికాంశు వంశ కల శోదధి కౌస్తుభరత్న!"
(పుట 194)

వేదమువారి ముద్రిత శృంగార నైషధమున విశదముగా పై పాఠము నుండగా—విశ్వనాథవారు

"ఓ మి రాంశు వంశ కలశో దధి పూర్ణ శశాంక' అని ఇచ్చుటచే వారు నైషధమును చూడకుండగనే దీని నుదాహరించి రనుట విస్పష్టము. ఇందు "మిహికాంశు" అను దానికి మిహిరాంశు అని యుదాహరించుట యొక దోషము. ఆ పైని "కౌస్తుభరత్న" అను దానికి మను చరిత్ర ననుసరించి "పూర్ణ శశాంక" అని పూరించుట యంతకంటె పెద్ద దోషము. పాఠమిట్లు మార్చుటచే, దానిపై విమర్శనము తార్మారైనది.

"శ్రీనాథుని సంబోధనలో పద్య చరణపు కూర్పే ప్రధానముగాని విశేషము లే"దట—అసలు పాఠము తెలియకుండ, పాఠము మార్చినపుడు విశేష మెట్లు తెలియును? నైషధ పాఠమున "మిహికాంశుడ"ను పాఠము సరియైనది. మిహికాంశుడనగా చంద్రుడు—నలుడు చంద్ర వంశీయుడు. నలునకు పూర్వుడైన చంద్రుడు కలశోదధి యందు పుట్టినవాడే—అయితే, అట్టి చంద్ర వంశమను కలశోదధికి నీవు కౌస్తుభ రత్నము వంటివాడవుఅని నలుని గూర్చి చెప్పుటలోనే విశేషమంతయు నున్నది. కౌస్తుభమును, చంద్రునివలె

4. శబ్దరత్నాకర రచనా కాలమునాటికి ననగా క్రీ. శ. 1885 సంవత్సరము నాటికి పాంచాలీ పరిణయము అచ్చుకాలేదు—కావున నది వ్రాత ప్రతిపాఠము.

కలశోదధియందు— బుట్టినది - కాని చంద్రుడు, పదు నైదు దినములు క్షీణ దశయందుండును. ఎల్లప్పుడు నిండుగా ప్రకాశింపడు — కౌస్తుభమో నిత్యము కాంతివంతమై విరాజిల్లును. అది గాక కౌస్తుభము శ్రీ మహావిష్ణువు వక్షస్థలము నలంకరించును—"కస్తూరీ తిలకం లలాట ఫలకే వృక్షస్థలే కౌస్తుభమ్" అను వాక్యము విద్వల్లోకమునకు సుపరిచితము—ఈ సంబోధనములోని విశేష మిది. నలుడు—అన్న పేరిలో నన్నియు లఘువులే. గురుత్వ ముగాని ఘనతగాని లేదు—అందుచే నాతని సంబోధించు నపుడు నలమహారాజ యని సంబోధించిన నలునకే భావమును గలుగదు.

ఈ పద్యమున ఘట్టమును చూచిన నల సంబోధన ఇంత పెద్దగా నుండుట ఎంతయావశ్యకమో తెలియ గలదు. ఏమనగా నింద్రాదులు దమయంతిని కామించి, దమయంతిని ప్రేమించిన నలునే, యామె యొద్దకు తమ దూతగా బంపుట కేర్పాటు చేయదలచిన సందర్భము. ఇట్టి నలు నెట్లయినను నుబ్బించి తమ కార్యము నెరవేర్చుకోవలెను. అందుచే నింద్రుడు—

"ఓ మిహికాంశువంశ కలశోదధి కౌస్తుభరత్న" అని పెద్ద సమాసము నసలు పేరెత్తకుండ వంశ ఘనతను సూచించుచు సంబోధించినాడు.

ఇంద్రు డెటులైన—అనగా నెట్టి కృత్రిమ మార్గమున నైన నలుని వశపరచుకొని తమ పని చేయించుటకు సిద్ధముగ నున్నట్లు సందర్భమున నున్న నీ క్రింది పద్య పాదములు తెలుప గలవు.

గీ. బల నిషూదను కపటంపు భాషణములు
విని నృపాలుడు పలికె తద్విధముగాగ (3—65)

నైషధమునగల సంబోధన విశేషములకన్న పెద్దన గారి సంబోధనలో గడుసు దనమేమో, విశ్వనాథవారు వివరింతురుగాత!

కేవల శ్రీనాథానుకరణౌత్సుక్యముతప్ప నైషధము నందలి విశేషములను నెట్లు పెద్దన గ్రహింపలేక పోయెనో ఆ సందర్భము నీ వరకు భారతి పత్రికా ముఖమున వెల్లడించితిని. (చూడుడు—శృంగారనైషధము—సుపరిష్కృత ముద్రణము. వాని ప్రకటన సేయదగు అన్న శీర్షిక ఫిబ్రవరి 8, 1964—64—69 పుటలు)

పుట 42 "మన తెలుగు కావ్యములు నన్నయగారు పెట్టిన ఒరవడి ప్రకారము భగవంతునకో, ఒక రాజునకో ఒక మంత్రికో యంకితము లీయబడినవి."

అనగా నన్నయగారు రాజరాజునకు భారతము 'అంకితము' చేసినారన్న మాట—

అంకితము చేసితిననిగాని, అంకిత మిచ్చితి ననిగాని నన్నయ భారతమున నున్నదా? ఇక శివ కవుల కృతులలో 'అంకితము గలదా?

పుట 102 '"ఈ స్వారోచిషుడు దశావతారములు వర్ణించినాడు. విశిష్టాద్వైతులయొక్క దశావతారములలో బుద్ధుడు లేడు. బలరాముడు కృష్ణుడు నిద్దరు రెండవతారములు. అందుచేత పదియును పూర్తియగును—ఈ పెద్దన్నగారి దశావతార వర్ణనలలోని రహస్య మిది"

విశిష్టాద్వైతుల యొక్క దశావతారములలో బుద్ధుడు లేడనుట సరికాదు —విశిష్టాద్వైత మతము ప్రతిపాదించిన ఆమూక్తమాల్యద యందే బుద్ధావతార స్తవము గలదు. చూడుడు: చతుర్థాశ్వాసము 30 వ పద్యము.

మ. తరుణ త్వత్సుత బాణ పంచకమునన్ దైత్యా బలాచ్ఛోణిత
ద్వర సందోహము యుష్మదాత్మక జరద్భాణం బొకంటన్ జెడన్
ద్వరగావించితి వేటికో యహహ బుద్ధం బయ్యె నీ భావను
త్తరుణీ శీలతనుత్రమేరికి నసాధ్యం బౌటగా కేశవా.

ఇందు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, బలరామ, కృష్ణ, బుద్ధ, కల్కి యను దశావతారములు వర్ణితములు.

మను చరిత్రలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, బలరామ, కృష్ణ, కల్కి యను దశావతారములు వర్ణితములు. "శేష భూత సమస్త శేషి—అన్న సంబోధన విశిష్టాద్వైత మతమును ప్రతిపాదించుచున్నది." (పుట 102) అని విశ్వనాథవారి ప్రతిపాదన—అట్టి యెడల విశిష్టాద్వైత మత ప్రాతిపదిక గ్రంథమున దశావతారము లలో గల బుద్ధావతారమును విడిచి పెట్టుటయే పెద్దన యవతార వర్ణనలలోని రహస్యము కాబోలు!

ఇంకను నీ యవతారములను గూర్చి వ్రాసినది చూడుడు: పుట 103—"అందుకని అవతారములు వర్ణించుట నిస్సంశయముగా విశిష్టాద్వైత మత ప్రతిపాదకము."

అట్లయిన దశావతార వర్ణనలున్న కావ్యములన్నియు విశిష్టాద్వైత మత ప్రతిపాదకములేనా? మను చరిత్రకు ముందుగా శృంగార నైషధము అష్టమాశ్వాసమున గల దశావతార వర్ణన (120—141 - 21 పద్యములు) విశిష్టాద్వైత మత ప్రతిపాదకమా? వానికి సంస్కృతమూల మున్నది గదా!

దశావతార వర్ణనలను గూర్చి పరిశ్రమ చేసినగాని మనము వానిని గూర్చి వ్రాయుట కధికారము చాలదేమో?

ఇట్టి విపర్యాసములేగాక, విమర్శనా ధోరణియు నెట్లున్నదో వినుడు:

ప్రథమాశ్వాసాంతమున సిద్ధుడు ప్రవరుని పాదములకు పసరును పూసిన తరువాత నీ క్రింది పద్యము గలదు.

# సాహిత్య చరిత్రలు-విమర్శలు

అమందిడి యత దరిగిన
భూమీసురు డరిగె దుహిన భూధరశృంగ
శ్యామల కోమల కానన
హేమాఢ్య దరీఝరీ నిరీక్షా పేక్షన్ (1—79)

దీనినిబట్టి పసరు పూసిన తోడనే సిద్ధుడు వెడలి పోగా, ప్రవరుడును హిమత్పర్వత ప్రాంతములను చూచుటకు వెళ్లెనని యర్థము స్పష్టముగదా! వ్యాఖ్య యందును నట్లే యున్నది. ఇచట సిద్ధుడు వెడయుటకు, ప్రవరుడు వెడలుటకు కాల వ్యవధి యేమాత్రమును లేదు—పెద్దన ఇచట లోక వ్యవహారములోనున్న "వాడు వెళ్లగానే వీడు వెళ్లిపోయాడు", అతడు వెళ్లగానే ఇతడు వచ్చేశాడు" అను పలుకుబడి వాడినారు. సిద్ధుడు వెడలిన వెంటనే నేయాలస్యము చేయక ప్రవరుడు బయలు దేరె నన్న యర్థము గ్రహింపకయే విశ్వనాథ వారు దీనిని గూర్చి యే రీతిగా వ్రాసిరో చూడుడు:

"కాలికి పసరు పూసినంతనే ప్రవరుని యూహ బదరీ వనమునకు పోవుదమనియే—ఇత డెప్పుడు బయలుదేరినాడను నది తరువాతి ప్రశ్న— (పుట—53)

"అనగా సిద్ధుడు వచ్చిన రోజుననే, ప్రసంగము జరిగినప్పుడే, అది ప్రొద్దు గ్రుంకెడి వేళకో ఇతని పాదముల కా పసరురాచి వాని దారిని వాడు వెళ్ళినాడు. (పుట 59)

"ఈ ప్రవరు డగ్ని హోత్రి—ఇత డా రాత్రి అగ్నిహోత్ర కార్యములు చేసినాడా, ప్రొద్దున హిమత్పర్వతమునకు బయలు దేరకముందు స్నానాదికములు చేసినాడా? ఈ రెండు స్నాన ప్రక్రియలతో నీతని పాదలేపము పూర్వమే కరిగిపోయి యుండవలయును—"—నీహారవారి బెరసి కరగిపోవు లేపమది.

"అతడు జాగ్రత్తగా స్నానము చేసెను. వ్యాధిగ్రస్తులైన వాండ్రు, లేదా, కాలిమీద కురుపు లేచినవాండ్రు పట్టీ వేసికొని ఆ పట్టీ తడియకుండ స్నానము చేసినట్లు కాళ్ళు కడిగికొన్నట్లు చేసియుండును. అనుకొనవలయును.

ప్రవరునికి సిద్ధుడు నిన్నటి సాయంతనమే పాద వేపమును పూసెను—దానినితడు మరునాడు ప్రొద్దుటవరకు సంరక్షించుకొనెను, అనుకొనవలెను" పుట 60.

సిద్ధుని వెంటనే ప్రవరుడు నాడే బయలు దేరెనని పెద్దన చెప్పగా, విశ్వనాథ వారేమరు నాడీతడు బయలు దేరెనని చెప్పుట నిరాధారము. నిష్ప్రమాణము—పై వాక్యములు వ్రాయుచున్నప్పు డిది విమర్శ యను మాట మరచి కథానికయో, నవలయో వ్రాయుచున్నట్లు వ్రాసియుందురు. సాయంత్రమున పసరు పూయుట యేమి? స్నానాదికము లేమి? వ్యాధిగ్రస్తుడను నుపమాన మేమి? ఇది యంతయు వట్టి కల్పన—దీనిని బట్టి విశ్వనాథ వారికి ఆ ఘట్టమునందే యున్న ఈ క్రింది పద్య మర్థము కాలేదనుట స్పష్టము.

క. దివి బిసరుహబాంధవ స్యైం
ధవ సంఘం బెంత దవ్వు దగలే కరుగున్
భువి నంత దుప్పనేమును
దవదవ లే కరుగుదుము హుటాహుటి నడలన్"

(1—74)

పద్య మర్థమైనను భావ మవగతము కాలేదని తెలియుచున్నది. మను చరిత్ర ముద్రిత గ్రంథములలో వ్యాఖ్యానమున నీ పట్టున నేమియు వ్రాయబడి యుండలేదు. ఈ పద్యార్థ భావ మెరుగవలెనన్న మనము కాశీఖండము చూడవలెను. అందు:

గీ. రెండు వేలును నిన్నూట రెండు యోజ
నంబు లర్థనిమేషమాత్రంబులోన
నంబరంబున బారు తీవ్రాంశు రథము
నిలిచె బహుకాల మట్టిదే నియమ మహిమ.ర

(1—135)

సూర్యుని గుర్రములు—నిమిషార్థమున ననగా 30 సెకెండ్ల కాలమున రెండువేల నిన్నూట రెండు యోజనములు—అనగా 17616 మైళ్లు నడచును. ఇంత వేగముతో పాద లేప మహిమవలన మన ఇచ్చ వచ్చినచోటికి వెడలవచ్చునని సిద్ధుడు చెప్పినాడు. దీని ననుసరించి అరుణాస్పదమునుండి హిమవత్పర్వతమున కేగుటకు ప్రవరునికి, ఒకటి, రెండు సెకెండ్లకంటె నెక్కువ కాలము పట్టదు— సిద్ధుడు ప్రవరుని యగ్గరకు కుతప కాలమునకు ననగా మధ్యాహ్నము 11—12 గంటల మధ్య కాలమున వచ్చెను. అప్పటికి ప్రవరుడు మాధ్యాహ్నిక కృత్యముల దీర్చుకొని యుండెను. సిద్ధుడు పాదవేపము పూసెను. ప్రవరు డొకటి రెండు సెకండ్లలో నచటి కేగి, చూడవలసినవి చూచెను. దానితో మధ్యాహ్నము చాల గడిచినది. ఇక సాయంకాలమున నగ్నిహోత్రమునకు బోవుటకే ప్రవరుడు పాదవేపము కరిగి పోవుటచే నగ్నిని ప్రార్థించి సకాలమున కింటికి చేరినాడు. విషయము గ్రంథమున నింత విస్పష్టముగా నుండగా, విమర్శకులు కుతపకాల చర్చలు చేసి పద్యార్థము ననుసంధించనకుండ, కలము కాగితము వ్యర్థము చేసిరి. విశ్వనాథవారు వారి ననుసరించిరి.

---

5. దీనిని గూర్చి కీ. శే. గొబ్బూరి వెంకటానంద రాఘవ రావుగారు "నన్నయభట్టు విజ్ఞాన నిరతి" అను గ్రంథమున వ్రాసియున్నారు. వైజ్ఞానిక శాస్త్రవేత్త లింకను నీ విషయమును గూర్చి చర్చింతురుగాత.

పెద్దన రచనలోని విశిష్టతను, స్వారస్యమును విశ్వనాథ వారెట్లు గ్రహింప లేదో మరియొక పట్టు చూపుచున్నాను.

పుట 61-(ప్రవరుడు) "భోగి. ఆత డెంత భోగి యనగా పూవు దీవులలో నొక భవనము చూచి దానివద్దకు వెడలు నప్పుడు

మృగ మద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్రవీటీ గంధ
స్థగితే తర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్.

కస్తూరి వాసనచేత రెట్టింపైన పచ్చ కర్పూరము కలిపిన తాంబూలపు వాసనతో గూడిన గాలి రాగా, అచ్చట స్త్రీలున్నారని యాతడు తెలిసికొనెను. ఆతని భోగ లక్షణ మిది. ఆ తాంబూల మెట్టిదియో, అందులో యౌవనవతులైన స్త్రీ లెట్టి పాళముతో కస్తూరీ ఘన సారములను కలిపి తాంబూలము సేవింతురో—ఆ గాలి పరిమళ మెట్టిదో—ఇంత తెలిసినవాడు ప్రవరుడు—వాని యనుభవ విశేష మిట్టిది" పై పద్యము మనుచరిత్రమున 2--24 లో నున్నది.

కాని పెద్దన ఇచ్చట మారుతము వర్ణించెనేగాని విశ్వనాథవారు వ్రాసినట్లు—ప్రవరుని భోగ లక్షణములను మనకు తెలుపుటకుద్యోగింపలేదు. పెద్దన ఇచ్చట శబ్దార్థములలో మిక్కిలి ప్రతిభ భాసింప జేసినాడు—మృగ మద సౌరభము—ఘనసారము—వీటీ గంధము—ఈ మూడును పరిమళ యుక్తము లైనప్పుడు మగువ పొలుపు మాత్రము పరిమళ యుక్తమ్ము కాకుండునా. ఆ పరిమళము, పై వాని కంటె విలక్షణమట. ఈ పరిమళము 'మగువ'[6] అను పదములో గుబాళించినది.

'మగువ' పదమునకు మగు+వాయి అని ఉత్పత్తి—'మగు' అనగా పరిమళించు—వాయి అనగా నోరు కలది. మగు ధాతువునకు కన్నడమున పరిమళించు అని యర్థము—తెనుగున ధాతువు, వర్ణ విప్లతిచేత గుమ గుమయైనది. మగు—గుమ—ఇట్లే—చెలువ (చెలు+వాయి) మనోహరమైన నోరు గలది. నలువ (నలు+వాయి—నాలుగు నోళ్ళు గలవాడు. చిలువ (చిలు+వాయి) విషము నోటియందు గలది—పలువ (పలు+వాయి) పెక్కు మాటలు గలవాడు—మున్నగు పదముల వ్యుత్పత్తి నెరుగ నగును. కాగా— పై పద్యమున మగువ శబ్దము సార్థకమై పద్యమునకంతను పరిమళయుక్తముగ నొనర్చినది.

ఇట్లు మగువ పదము సార్థకమగుటయేగాక—నింకొక విశేష మీ పద్యమున నున్నది. ఇచట వర్ణితమైనది 'మారుతము' అనగా గాలి—దీనికి మూడు గుణములు ప్రధానములు. శైత్యము, సౌరభము—మాంద్యము అను నీ మూడును పై పద్యమున నున్నవి.

మృగమదము—సౌరభము—
ఘనసారము—శైత్యము—
వీటీగంధము—మాంద్యము—

పై గుణములన్నియు నొకేసారిగా మూర్తీభవించి మనపై మారుత మొలసినట్లు — అనగా ప్రసరించినట్లు పెద్దన మూడు పాదములను నొకే సమాసముగా వ్రాసి మగువ పొలుపును మనకు ప్రసాదించి యున్నాడు.

ఇట్టివెన్నో శబ్ద, అర్థ, భావ విశేషములు. వీని నెల్ల విస్మరించి, విశ్వనాథవారు విమర్శను సాగించినారు. విస్తర భీతిని విరమించితిని. 'శిల్ప' మనుమాట యనల్పముగ నిందు గలదు. కాని ఆ శిల్ప మేదో ఇందు వ్యక్తముకాలేదు. వారి విమర్శన మూలమున నాంధ్రలోకమునకు, మనుచరిత్ర కొక నూతన వ్యాఖ్యాన మత్యావశ్యకమని విశదమగుచున్నది — అట్టి యనకాశము నీ గ్రంథ మూలమున గల్పించిన విశ్వనాథవారి కాంధ్ర విద్వల్లోకము కృతజ్ఞతా బద్ధమై యున్నది.

---

6. తెలుగున స్త్రీ వాచక పదము లన్నింటికి—వ్యుత్పత్తు లున్నవి. ఇంతి (ఇక+తి)ఇంటిలోనుండునది. ఇల్లాలు—ఉగ్మలి—భయపడు స్వభావము గలది—ఉగిసు భయపడు (తెలుగున స్త్రీ వాచక వ్యుత్పత్తులు చూడుడు—తిరుమల రామచంద్రగారి వ్యాసము (భారతి)

# ప్రజలు - ప్రభుత్వం

శ్రీ జాన్ స్ట్రాచీ

ప్రభుత్వం ప్రజలందరికీ బాధ్యత వహించి ఉండటంమీదనే ప్రజా ప్రభుత్వ ఇతర లక్షణాలన్నీ ఆధారపడిఉంటాయి. తమ కిష్టమైన వారిని స్వేచ్ఛగా జరిగిన ఎన్నికలలో ఎన్నుకుని వారిచేత ప్రభుత్వం స్థాపింపజేయటానికి ఏర్పాటు ఉండటమని నా అభిప్రాయం. ఇది మొదటి లక్షణం. దీనితోపాటు కొంత కాలమైన తరువాత ఏవిధమైన అంతఃకలహం,- రక్తపాతము వస్తాయనే భయంలేకుండా ఉన్నప్రభుత్వాన్ని తొలగించి, మరొక ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించగలగడం అనేది రెండవ లక్షణం. అధికారంలోఉన్న ప్రభుత్వాన్ని కొంతవరకు అదుపులో ఉంచగలగడం మూడవ లక్షణం. ఇదే ప్రాతినిధ్య ప్రభుత్వం. ఇది బ్రిటిష్ పార్లమెంటరీ విధానంకిందఅయితేనేమి, అమెరికా అధ్యక్ష—కాంగ్రెసు విధానంకింద నైతేనేమి ఈమధ్య ఫ్రెంచివారు ప్రయత్నించిన పద్ధతికింద అయితేనేమి, ఇవన్నీ కూడా ఒక విధంగా ప్రాతినిధ్య ప్రభుత్వాలే. నేటి పాశ్చాత్య ప్రజా ప్రభుత్వ విధానంలో, ప్రాతినిధ్య ప్రభుత్వానికి మించినది కూడా ఉంది. వాస్తవానికి ప్రాతినిధ్య ప్రభుత్వము, బాధ్యతాయుత ప్రభుత్వము అనేవి ఒక విధమైన సాధనములు. ఎన్నికలలో ఓటు చేయడంకంటె నిత్య జీవితానికి ఎక్కువ విలువైన వాటిని సాధించడానికి సాధనాలుగా వీనిని పరిగణించవచ్చు.

కాబట్టి ఈవిధంగా రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకొనడానికి ప్రాతినిధ్య ప్రభుత్వము మార్గమైంది. ఇలా అన్న తర్వాత "స్వాతంత్ర్యము" (Freedom) అనే మహత్తరమైన మాటగురించి వస్తుంది. స్వేచ్ఛ అనేది స్థూలమైనదేకాక, చాలా సూక్ష్మమైన విషయం. దానిని గురించి ముందు ముందు చాలా చర్చించవలసి ఉంటుంది. కాని ఇప్పుడు మాత్రం ఆ పదాన్నిపట్టి పిండి చూస్తాను. ఎందుకనంటే ఈ మాటను పరిమితమైన కొన్ని రకాల స్వేచ్ఛను వర్ణించడానికి అసందర్భంగాను, తప్పుగాను ఉపయోగించడం జరిగింది. బాధ్యతాయుతమైన ప్రాతినిధ్య ప్రభుత్వము ప్రసాదించవలసినది నాలుగు రకాల స్వేచ్ఛలు. ఈ నాలుగింటిలో ప్రతిఒక్కటి నేడు చాలా అవసరం.

## మొదటిది

ప్రత్యేకసంఘాల నిర్మాణానికి కావలసిన స్వేచ్ఛ: ఈ స్వేచ్ఛనుబట్టే నేడు బాగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాల జనాభాలో ఎక్కువమంది జీత భత్యాలతో జీవించేవారు. ఇలాంటివారికి వృత్తి సంఘాలు (Trade Unions) ఏర్పరచుకొనే హక్కు ఉండాలి. తమ భత్యాలను గురించి, పనికాలాన్ని గురించి, తమ ఉద్యోగ షరతులను గురించి, తమ యాజమానులతో బేరమాడడానికి ఈ సంఘాలు అవసరమని అనుభవంవల్ల తేలింది. పాశ్చాత్య రాజ్యాలలో పనివారికి ఇలాంటి స్వేచ్ఛ ఉండకూడదని ఏ కమ్యూనిస్టు అనడు. ఆ విషయంలో మనమూ ఏకీభవిస్తాము. పనివారలకు ఈ స్వేచ్ఛ లేకపోతే, వారిని పిండి పీడించడం జరుగుతుందని అనుభవంవల్ల తేలింది. తమ శ్రమవల్ల సృష్టించిన వస్తువుల విలువలో అతి స్వల్ప భాగము వారికి ముట్టడం జరుగుతుంది. పాశ్చాత్య రాజ్యాలలో పనివారికి కనక ఈ సంఘ నిర్మాణపు స్వేచ్ఛ ఉంటే, తాము శ్రమపడి సృష్టించే వస్తువులలో ఇంకా ఎక్కువపాలు వారికి లభిస్తుంది.

ఇంతవరకు అంతా అంగీకరిస్తాము. తమకు తాము ఏర్పాటు చేసుకొని పరుల పెత్తనం లేకుండాఉండే సంఘాలు కమ్యూనిస్టు దేశాల పనివారలకు కూడా అతి విలువైన స్వేచ్ఛగా ఉండితీరుతుంది. కాని దీనికి కమ్యూనిస్టులు ఒప్పుకోర్లు. కాబట్టి కమ్యూనిస్టు దేశాలలో ఈ వృత్తి సంఘాల ఏర్పాటు గురించి కమ్యూనిస్టు చరిత్ర పరిశీలించడం మంచిది. రష్యా విప్లవం అయిన తర్వాత సోషలిస్టు లేదా కమ్యూనిస్టు దేశాలలో ఈ వృత్తి సంఘాలు నిర్వహించవలసిన పాత్రను గురించి పెద్ద చర్చ జరిగింది. ఈ దేశాలలో ఈ వృత్తి సంఘాలుఅనవసరమని అప్పటి అగ్ర కమ్యూనిస్టులు అభిప్రాయపడ్డారు. పెట్టుబడీ, యాజమాన్యంలేక, ఉత్పత్తి సాధనములు ప్రజలవే

అయినప్పుడు ఈ వృత్తి సంఘాలు ఎవవ్వరితో బేరమాడేది? అని ప్రశ్నించారు. తమతో తాము బేరమాడుకోరుకదా!అన్నారు. కాని ఉత్పత్తి సాధనాలు ఎవ్వరి చేతుల్లోఉన్నా ఈ వృత్తి సంఘాలు ఉండడం అవసరమని లెనిన్, ఆయనతోపాటు కమ్యూనిస్టుపార్టీలో ఎక్కువ మంది అభిప్రాయపడ్డారు. అయితే ఆచరణలో మాత్రం ఈ వృత్తి సంఘాలకు ప్రభుత్వాన్ని కాదని వ్యవహరించే స్వేచ్ఛ ఉంచడానికి వారు ఒప్పుకోలేదు. కమ్యూనిస్టు దేశాలలో ఈ వృత్తి సంఘాలకు నిజమైన స్వేచ్ఛ లేదని అందరికీ తెలుసు. అక్కడ అవి ప్రభుత్వ యంత్రంలో ఒక భాగం. తమపైన యాజమాన్యం చేసేవారు ప్రభుత్వంలో ఒక భాగం. అందుకని వారేవిధమైన వత్తిడి తీసుకురాలేదు. బేరము ఆడరేదు. అప్పుడూ కూడ సమ్మె అనే కడపటి ఆయుధాన్ని తమ యజమానులపై ప్రయోగించలేదు.

ఈ పరిస్థితి మూలకంగా కమ్యూనిస్టు దేశాల పని వారు అతిగా పీడింపబడతారు. తాము ఉత్పత్తి చేసే దానిలో తమ కివ్వగా మిగిలిన లాభమంతా ఏ కొద్దిమంది వ్యక్తులకో కాకుండా, మొత్తం రాజ్యానికి చెందటంవల్ల తిరిగి ఆయుధాలకో, విద్యకో, మరిదేనికో వినియోగపడుతుందనేది వారిని ఓదార్చవచ్చు. ఓదార్చకపోనూవచ్చు.

మన తరంలో మనకి వచ్చిన అనుభవాన్నిబట్టి ఈ స్వేచ్ఛ అనేది యజమాని ఎవ్వరైనాసరే— చాలా అవసరమని నేను అంటాను. ఈ స్వేచ్ఛ లేకపోయినట్లయితే పని వారికి అత్యంత ప్రధానమైన వారి వేతనాలు, పనికాలం, పరిస్థితులు, వాటి మార్పును గురించి వారికి ఏ విధమైన పలుకుబడి ఉండదు.

## రెండవది

వాక్స్వాతంత్ర్యము : ఈస్వేచ్ఛ ప్రభుత్వ స్వరూపంతో పెనవేసుకొని ఉన్నది. ఈ స్వేచ్ఛ లేకపోతే, ప్రజలకు. ఒకరితో ఒకరు పోటీపడుతూ, తమ ఓట్లను ఆశించే వేర్వేరు రాజకీయ పక్షాలలో ఒకరిని వరించడానికి వీలుపడదు. ఇలా పోటీ పడేవారు, రాబోయే ప్రభుత్వాలు అంటే, నిజానికి రాజకీయపక్షాలు. వీరు ప్రజలను తమపట్ల తిప్పుకొనడానికి వ్రాయాలి. మాట్లాడాలి. వాక్స్వాతంత్ర్యం, రచనాస్వాతంత్ర్యం ఇంతకుమించిన ప్రయోజనం గలవి. సమాజంలో బుద్ధివికాసం అనేది యావత్తు ఆచరణీయమైన నిర్నిబంధ స్వేచ్ఛమీద ఆధారపడి ఉంటుంది. ఆచరణీయమైన అని ఎందుకంటున్నానంటే, సంపూర్ణమైన స్వేచ్ఛ అనేది సాధ్యంకాదు. అన్ని చోట్ల కూడా వ్రాయడం, మాట్లాడడం సాధ్యంకాదు. నాగరిక ప్రపంచంలో ఎక్కడా కూడా ఒకరిని హత్య చేయాలని వ్రాతమూలానా, మాటమూలానా రెచ్చగొట్టడానికి వీలులేదు. కాబట్టి వాక్స్వేచ్ఛ అనేది ఇంతా— అంతా అనేగాని అంతా కాదు. అంతమాత్రం చేత స్వేచ్ఛ అనేది అప్రధాన్యమని అనటం దోషభూయిష్టమైన రాజకీయ దృక్పథం.

## మూడవది

సమావేశ స్వేచ్ఛ: ప్రజా వ్యవహారాలను తమకు ఉచితమైన మార్గాన నడపడానికిగాను చర్చ, ప్రచారం చేయడానికి సమావేశ స్వేచ్ఛ ఉండాలి. అన్ని స్వేచ్ఛలలో ఇది అతి ముఖ్యమైన స్వేచ్ఛగా ఉండేది. అయితే టెలివిజను, రేడియో, వార్తా పత్రికలువచ్చి ఈ సమావేశ ప్రాముఖ్యాన్ని తగ్గించాయి. అయినప్పటికి ఈ హక్కులేకపోతే స్వేచ్ఛ అనేది ఊహించడానికి వీలులేదు.

## నాల్గవది

చట్టబద్ధమైన పరిపాలన : తమ దేశ చట్టము ప్రత్యేకంగా నిషేధించకపోతే తప్పఎవ్వరైనా ఏదైనా చేయవచ్చు. ఈ స్వేచ్ఛ అతి పురాతనమైన ప్రాథమిక స్వేచ్ఛ. అది ఇప్పుడు అతి ముఖ్యమైనదిగా రూపొందినది. ప్రభుత్వాలు ఈ స్వేచ్ఛను కాదని, చట్టాలకు విరుద్ధంగా ప్రజలను నిర్బంధించి, అరెస్టు చేసి, బాధించి, చంపినప్పుడు ఇతర స్వేచ్ఛ ప్రతిదీ అసాధ్యమైపోతుంది. వృత్తి సంఘాల ఏర్పాటు సాధ్యంకాదు. పై చెప్పిన ప్రమాదాలు రాబోతున్నాయని తెలిస్తే తమ నిరసన తెలపడానికి సమావేశమై మాట్లాడడానికి వీలుఉండదు. చట్టబద్ధ పరిపాలన చట్ట నిర్వహణకు తగుమైన నిబంధనలు చేయడంమీద ఆధారపడిఉంటుంది. అప్పుడప్పుడు చేసే నిబంధనలే చట్టాలు అవుతాయి. ఆ నిబంధనలను వారి వారిపట్ల అనువర్తింపజేయడానికి ఒకరు ఉండాలి. ప్రభుత్వానికే గనక తన ఇష్టం వచ్చినవారిపట్ల అనువర్తింపజేసే స్వేచ్ఛఉంటే ప్రజలు ప్రభుత్వం దయాదాక్షిణ్యంలో ఉంటారు. కాబట్టి ప్రభుత్వానికి లొంగకుండా చట్టాలను నిష్పాక్షికంగా అమలు పరచి నేరం ఏమీ చేయకపోయినా వారిని వీరిని అరెస్టుచేసి ప్రభుత్వం నిరంకుశంగా వ్యవహరించకుండా చూచేటటువంటి న్యాయస్థానాలు ఉండటం ప్రాణావసరం.

పశ్చిమ రాజ్యాలలో ఈ స్వేచ్ఛా ప్రాధాన్యతను ఎవ్వరూ కాదనరు. కమ్యూనిస్టు దేశాలలో కూడా చట్టబద్ధ పరిపాలన చాలా అవసరమని నేడు తెలిసి వస్తూన్నది. ఎందుకనంటే కమ్యూనిస్టు సిద్ధాంతానికి విరుద్ధంగా కమ్యూనిస్టు ప్రభ

త్వము ఆచరణలో ప్రజలకు దూరమైన పెద్ద సంస్థగా తయారైనది. కాబట్టి ప్రజలను వేధించుటకు వీసకుండా ఉండ డానికి విస్పష్టమైన చట్టములు, నిబంధనలు అవసరము. సిద్ధాంతరీత్యా ఈ చట్టబద్ధమైన పరిపాలనా అవసరాన్ని వారు గుర్తించకపోయినా, ఇప్పుడిప్పుడు ఆచరణలో ఇది అవ సరమని తెలియవస్తున్నది. స్టాలిన్ చట్టబద్ధమైనపాలనను అతిక్రమించి వ్యవహరించాడనేది 20—22 పార్టీ మహా సభలో ఆయనపైన కృశ్చేవ్ మోపిన నేరాలలో పెద్దది. స్టాలిన్ అతిక్రమించిన మాట నిజం. 1930 లో స్టాలిన్ చేసిన వడపోత, ప్రభుత్వము చట్టాన్ని కాలదన్ని వ్యవహరించ డానికి భయానకమైన తార్కాణం. చట్టబద్ధ పరిపాలనకింద వచ్చే స్వేచ్ఛ కొద్దిపాటిదైనా, ఎలా ఉంటుందో తెలుసుకొనడం మంచిది. అంతేకాని, మంచి చట్టములు, చెడ్డ చట్టములు అనే ప్రశ్న ఇక్కడరాదు. మంచి చట్టాలకింద పరిపాలించ బడాలని కోరటం చాలా పెద్ద కోరిక. ప్రస్తుతం మనం చర్చించేది సమగ్రమైన, విస్పష్టమైన చట్టాలు ఉండవలె నని, అవి నిష్పాక్షిక దృష్టిగల న్యాయ స్థానాల ద్వారా అమలు కావాలని, ఎవ్వరైనాసరే చట్టాన్ని ధిక్కరించడాన్ని ప్రభుత్వం రుజువుచేస్తేనేగాని శిక్షించకూడదనేది మాత్రమే. కనీసం ఈ స్వేచ్ఛ అయినా లేకపోతే, ప్రభుత్వ వ్యవస్థలు పని చేయ లేవు. ఎందుకనంటే, ప్రతిఒక్కరూ ప్రభుత్వ ధిక్కారకు గురి అవుతారు.

ఈ నాలుగు "స్వేచ్ఛలు" స్వేచ్ఛా సంఘం అనే సౌధా నికి నాలుగు స్తంభాలు. అయితే 1960 లో ప్రపంచంలో ఏ యే ప్రాంతాలలో ఈ నాలుగు స్వేచ్ఛలు సిద్ధించినవి అనేది ప్రశ్న! పశ్చిమ రాజ్యాలను స్వేచ్ఛా ప్రపంచం అనే పేరుతో చాలామంది పిలుస్తారు. అలా అనటంతో మరల మొదటికి వస్తాము. అందుకని నేను ఆ మాటను ఉపయోగించను. అయినా బాగా అభివృద్ధి చెందినటువంటి పశ్చిమ రాజ్యాలలో ఈ నాలుగు స్వేచ్ఛలు మిగతాచోట్లకన్న చాలావరకు సిద్ధించిన వని నా అభిప్రాయం.

ఈ నాలుగు స్వేచ్ఛల మూలంగా నిజమైన స్వేచ్ఛ వచ్చి నట్లేనా అని నన్ను అడగవచ్చు. ఆచరణలో ఇది కార్మికులు కష్టబాధ పడడానికి స్వేచ్ఛ నివ్వవచ్చు. ఈ అవహేళనకు వెనుక అవకాశం ఉండవచ్చు. కాని నేను లేదు. కష్టబాధ చెందటం స్వేచ్ఛలోనూ సాధ్యం. నిర్బంధంలోను సాధ్యం. స్వేచ్ఛ అనేది ఆర్థిక భద్రతను ఇవ్వకపోవచ్చు. బానిసత్వం అనేది అలాంటిది ఇవ్వకపోగా, వాటి సాధన కూడా సాధ్యం కానివ్వదు. అందుకని పైన పేర్కొన్న నాలుగు స్వేచ్ఛలు, అవి దాదాపు సిద్ధించిఉంటే ఇంతవరకు మానవ సమాజం సాధించిన స్వేచ్ఛలో అత్యుత్తమమైనవి

పూర్తిగా నిర్దుష్టమైనది కాకపోవచ్చు. కాని బానిసత్వంకంటె చాలా మెరుగు. మానవకోటి ఇంతవరకు ఇంతకుమించి సాధించి వదిలేరు. ఈ ప్రమాణంలో ఈ విధమైన స్వేచ్ఛను సాధించ డానికి పశ్చిమ రాజ్యాల ప్రజా ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నవి. దీనినే బూర్జువా ప్రజా ప్రభుత్వ ఆశయము అని కమ్యూ నిస్టులు అంటారు. వారేమన్నా, దాని విలువ ఏమిటి అనే ప్రశ్న ఉండనే ఉంటుంది.

పశ్చిమదేశాల ప్రజాప్రభుత్వాన్ని గురించి కమ్యూ నిస్టులు చేసే విమర్శ విషయమై ఇక ప్రస్తావిస్తాను. ఈ ప్రజా ప్రభుత్వాన్నే వారు బూర్జువా ప్రజా ప్రభుత్వం అంటారు. దానిని మీరు ఏ పేరుతో పిలిచినా సరే,

కమ్యూనిస్టులు చెప్పేది స్థూలంగా ఇది: పశ్చిమ రాజ్యంలో ఉండే వర్గ విభజన ప్రజా ప్రభుత్వాన్ని ఒక నాట కంగా తయారుచేస్తుంది. అలాంటి సమాజాలలో ప్రజలు రెండు తరగతులుగా విభజింపబడుతారు. ఒకటి: ఉత్పత్తి సాధనాల యజమానులు. రెండు : శ్రామికులు. అంటే యజ మానులు—పనివారు. సమాజంలో ఈ విభజన పశ్చిమ రాజ్యాలు గొప్పగా చెప్పుకొనే ప్రజా ప్రభుత్వాలను చెడగొడతా యని, పనికిమాలినవిగా చేస్తాయని, లెనిన్ చాలా స్పష్టంగా చెప్పాడు. 1917 ఆగస్టులో రష్యన్ విప్లవం వచ్చే సమ యంలో State and Revolution అనే పుస్తకం ప్రచురించాడు. ఇది అతి ముఖ్యమైన పుస్తకం. దాంట్లో బూర్జువా ప్రజా ప్రభుత్వాన్ని గురించి ఇలా చెప్పాడు. : "పెట్టుబడి విధానం మూలాన ఈ ప్రజా ప్రభుత్వం సంకుచిత మవుతుంది. అందుకని ఆచరణలోకి వచ్చేటప్పటికి అది భాగ్యవంతుల, ఆస్తి—పాస్తులు కలవారి ప్రభుత్వం అవుతుంది. అంటే కొద్ది సంఖ్యాకుల ప్రభుత్వ మవుతుంది. ప్రాచీన గ్రీక్ రిపబ్లిక్‌లలో బానిసలు కల కొద్ది మందికి స్వాతంత్ర్యం ఉన్నట్లే ఈ దేశాలలో కూడా ధన వంతులకే స్వేచ్ఛ ఉంటుంది. పెట్టుబడి విధానంతో వచ్చే పీడనవల్ల భత్యం— బానిసలు బీదరికంతో కుంగిపోయి ప్రజా ప్రభుత్వం అంటేను, రాజకీయా లంటేను ఏమాత్రం పట్టించుకొనరు. మామూలు జనాభాలో ఎక్కువమంది సాంఘిక—రాజకీయ రంగంలో పాల్గొనకుండా ఉండడం జరుగుతుంది."

బూర్జువా ప్రజా ప్రభుత్వాన్ని గురించి లెనిన్ విమర్శ యొక్క సారం, ఆయన చెప్పిన చివరి వాక్యాలలో ఉన్నది. పశ్చిమ రాజ్యాలలో బలైం తెచ్చుకొనేవారు తమ బీదరికం

వల్ల సాంఘిక, రాజకీయ జీవిత వ్యవహారాలలో పాల్గొనలేరని ఆయన అంటున్నాడు. వారు అతి బీదరికంలో ఉండి, విద్య అనేది లేక, నామమాత్రంగా తమకు ఉండే స్వేచ్ఛను ఉపయోగించుకొనలేక పోతున్నారు. ఆచరణలోకి వచ్చేటప్పటికి, బీదరికం మూలాన, తెలియనితనం మూలాన అటకాయింపబడుతున్నారు. అందుకని వారు ఇష్టంవచ్చిన ప్రభుత్వాన్ని ఎన్నుకొనడం, ఇష్టంలేనివారిని తొలగించి, మరొక ప్రభుత్వాన్ని ఏర్పరచుకొనడం—ఇప్పుడు నే పేర్కొన్న నాలుగు రకాల స్వేచ్ఛలు ఏదోవిధంగా వట్టి బూటకమని లెనిన్,—అంటే కమ్యూనిస్టు లందరి—అభిప్రాయం. ఈ స్వేచ్ఛలు కాగితంమీద తప్ప వాస్తవంగా వారికి లేవు.

అయితే ఇప్పుడు కమ్యూనిస్టుల విమర్శను గురించి మనం ఏమనాలి? పెట్టుబడి విధానం మొదటి రోజుల్లో ఇలాంటి స్థితి ఉన్నదనేది చరిత్ర తెలియనివారు తప్ప అందరూ అంగీకరిస్తారు. ఈ రోజున కూడా కొన్ని కమ్యూనిస్టేతర దేశాలలో ఈ స్థితి కొంతవరకు ఉన్నది. అయినప్పటికి పైన పేర్కొన్న లెనిన్ మాటలు చదివితే, బ్రిటన్, ఉత్తర అమెరికా, పశ్చిమ యూరపు, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మొదలైన దేశాలను చూస్తే ఆ మాటలు ఎంత అసమగ్రమైనవో బోధపడుతుంది. అభివృద్ధిచెందిన ఈ దేశాలలో ఏదో ఒక దేశంలో పనిచేసే నాబోటి రాజకీయవాదికి, అక్కడ శ్రామికులు రాజకీయ జీవితంలో పాల్గొనకుండా నిరోధింపబడినారంటే, కాస్త కూడా నమ్మను. నిజానికి అక్కడివారు పశ్చిమ రాజ్యాల రాజకీయ జీవితంలో బాగా పాల్గొంటారు. అలా కాకపోతే నేను గత ఇరవైఏళ్లలోను పార్లమెంటుకు ఎన్నుకోబడేవాడిని కాదు. భాగ్యవంతుల విద్యకన్న, శ్రామికుల చదువు కొంచెం తక్కువ స్థాయిదై ఉండొచ్చు. శ్రామిక వర్గాలమీద ఆధారపడేటటువంటి బ్రిటిష్ లేబర్‌పార్టీ, మిగతా పార్టీలకన్నా తక్కువ ఎన్నికల నిధిని సేకరించవచ్చు. అయినా నానాటికి ఈ బలహీనతను వారు తొలగించుకో గలుగుతున్నారు. ఒక మాటలో చెప్పాలంటే పశ్చిమ రాజ్యాల ప్రజా ప్రభుత్వాన్ని గురించి కమ్యూనిస్టులు చేసే విమర్శకు నేడు అర్థం లేదు. దాని కాలం తీరిపోయింది.

బూర్జువా ప్రజా ప్రభుత్వాన్ని గురించి కమ్యూనిస్టులు చేసే విమర్శ ఇదొక్కటే కాదు. ఉత్పత్తి సాధనాలు తమ చేతులలో ఉండటం మూలాన ధనవంతులైన వారు, ఆచరణలో అన్నిటిని తమ అదుపులో ఉంచుకొన గలుగుతారు. ప్రజాభిప్రాయాన్ని మార్చగలిగే సాధనాలు విద్య, పత్రికలు, రేడియో, టెలివిజన్ వగైరా లన్నింటిని అదుపులో ఉంచుకొన గలుగుతారు. శ్రామికులు తమ హీనస్థితి నుండి బయటపడే వాంఛ లేకుండా వారి మనస్సును కట్టివేస్తారు.

ఇది నేటి విమర్శ : దీనిలో రవ్వంత సత్యం ఉంది. అయితే లెక్కవేసి చూస్తే అంతా సత్యం కాదని తేలుతుంది. ఉత్పత్తి సాధనాలను తమ పట్టులో ఉంచుకొన్నవారు, ప్రజాభిప్రాయాన్ని దిద్దే సాధనాలను కూడ స్వీయ ప్రయోజనానికి ఉపయోగించుకుంటారు. కాని, శ్రామికుల మనోవైఖరులను రూపొందించడంలో అంత జయప్రదం కాలేరు. అంతే కాకుండా శ్రామికుల అభిప్రాయాలే పశ్చిమ రాజ్యాల సమాజ దృక్పథాన్ని నానాటికి దిద్దడం జరుగుతూ ఉంది. (ఓ పట్టాన తేలని, చాలా సూక్ష్మమైనటువంటి దానిని గురించి తర్వాత చెబుతాను.)

ఒకవైపున బూర్జువా ప్రజా ప్రభుత్వాన్ని నిరశిస్తున్నా, ప్రజాప్రభుత్వం అన్నా, స్వేచ్ఛ అన్నా ఉదాత్తమైనవే అని కమ్యూనిస్టులు ఒప్పుకుంటారు. ఈ రెండూ చాలా అవసరమైనవని లెనిన్ పదేపదే వ్రాశాడు. విప్లవానంతరం శ్రామికులకు నిర్దుష్టమైన ప్రజాప్రభుత్వము సాధిస్తామని కాకుండా, దాని కదే లభిస్తుందని లెనిన్ అనుకున్నాడు. అయితే అది స్థాపించడానికి మూడు షరతులు ఉదహరించాడు. ఒకటి: అధికారు లందరూ ఎన్నిక కావాలి. రెండు: ఎన్నికైన అధికారిని, ఇష్టం వచ్చినప్పుడు తొలగించి, మరొకరిని అతని స్థానంలో నియమించడం. మూడు: ఈ "అధికారుల జీతాలు సామాన్య శ్రామికుని జీత ప్రమాణానికి తగ్గించాలి." ఇవి లెనిన్ సొంత మాటలు.

ఈ మూడు షరతులు అమలుజరిగితే పశ్చిమ రాజ్యాలు ఎరిగినదానికన్న మెరుగైన ప్రజా ప్రభుత్వము రాగలదని లెనిన్ చెప్పాడు. విప్లవానంతరము లెనిన్ స్థాపించగలిగిన ఆదిమ ప్రజాస్వామ్యానికి ఇవి ఆధారంగా ఉంటాయని అనుకున్నాడు. శ్రామికులకు ఇచ్చినంత జీతమే ఇచ్చి అధికారులను ఎన్నుకొని, తొలగించగలిగే పద్ధతిని ప్రవేశపెట్టాలని ఆయన గట్టిగా భావించాడు. అధికారులను ఎన్నుకొనుటలో ప్రతి శ్రామికునికి ఓటు ఉండటమనే దొక్కటే, ప్రజా ప్రభుత్వాన్ని పూర్తిచేస్తుందని అన్నాడు. ఆదిమ ప్రజాస్వామ్య ప్రభుత్వం పూర్వ ధనికవర్గానికి స్థానం లేకుండా చేస్తుందని ఆయన నమ్మకం.

కమ్యూనిస్టులు భావించే ఈ ప్రజా ప్రభుత్వ మూలసూత్రం సంగతి పరిశీలనకు ఇప్పుడు వచ్చాము. వర్గాలతో కూడిన సమాజంలో సమగ్రమైన ప్రజా ప్రభుత్వం ఉండ

లేదని, ఉండదని, ఉండబోదని లెనిన్ అభిప్రాయం. ఒక వర్గంవారు ఉత్పత్తి సాధనాలను పొందిఉండి, మరొక వర్గం వారు వారికి శ్రామికులుగా ఉంటే అప్పుడు ప్రజా ప్రభుత్వం అనేది ఉత్పత్తి సాధనాల యజమానులదై, యజమానుల కొరకు సాగుతుంది. అలాగే విప్లవానంతరం శ్రామికులదై, శ్రామికుల కొరకు సాగుతుంది. అంతేకాని ఈ ఉభయ వర్గాలతో కూడిన ప్రజా ప్రభుత్వం అనేది ఉండదని లెనిన్ అభిప్రాయం.

బూర్జువా ప్రజా ప్రభుత్వం కనపడకుండా అధిక సంఖ్యాకులను బాధపెట్టే అల్ప సంఖ్యాకుల ప్రభుత్వమని లెనిన్ విశ్వాసం. కొద్దిమంది ఉత్పత్తి సాధనాల యజమానులను అణిచిపెట్టే అధికసంఖ్యాకులైన శ్రామికుల ప్రభుత్వము నిర్దుష్టమైన ప్రజా ప్రభుత్వమని ఆయన నమ్మకం. విప్లవానంతరం శ్రామికులలో మానవ సమాజంలో ఎప్పుడూ లేనటువంటి స్వేచ్ఛ లభించగలదని ఆయన భావం.

విప్లవానంతరం వచ్చే ప్రజా ప్రభుత్వం గురించి లెనిన్ ప్రతిపాదించిన ఈ సిద్ధాంతం ఆచరణలో ఎలా దానికి విరుద్ధంగా పరిణమించిందో చర్చిద్దాము. ఉత్పత్తి సాధనాల యజమానులైన కొద్దిమంది స్థానంలో, అధిక సంఖ్యాకులైన శ్రామికుల ప్రభుత్వం రాకపోగా, కేవలం ఎట్టి అదుపు లేనటువంటి కొద్దిమంది అధికారుల నియంతృత్వము రష్యన్ ప్రజలపై పడింది. ఇది మన తరంలో జరిగిన మహా విషాదం.

దీనిని పరిశీలించేముందు బూర్జువా ప్రజా ప్రభుత్వాన్ని గురించి కమ్యూనిస్టులు చేసే రెండు విమర్శల సంగతి మన మిప్పుడు చూద్దాము. పశ్చిమదేశాల సమాజంలో శ్రామికులు బీదరికంతోను, జీవితావసరాల లోటుచేత క్రుంగిపోయి సాంఘిక, రాజకీయ జీవితంలో పాల్గొనలేకపోతున్నారనే లెనిన్ వాదన అసత్యమని స్వీయానుభవంవల్ల నాకు తెలుసునని చెప్పాను. లెనిన్ యొక్క ఈ నింద తప్పు అని నిరూపించడం చాలా అవసరం. పశ్చిమ రాజ్యాలలోని శ్రామికులు తమ దేశ ప్రజా ప్రభుత్వాన్ని నిజమైన ప్రజా ప్రభుత్వంగా ఏఏ రీతులలో మారుస్తున్నదీ మనం పరిశీలించడం అవసరం.

(సశేషం)



# 'నేను కాని నేను'

శ్రీ బాలగంగాధర తిలక్

నాకు మీ సాహిత్య వివాదాలు తెలియవు
నలుగుర్నీ మంచి చేసుకోవడం అంతకన్నా తెలియదు

ఒక నిశార్ధ భాగంలో నక్షత్ర నివహ గగనం
ఓరగా భూమ్మీదకు వొంగి ఏదో రహస్యం చెపుతూన్న వేళ
ఒంటరిగా నా గదిలో నేను మేల్కొని వ్రాసుకుంటూంటాను
నా హృదయస్పందన మాత్రం నాకు వినిపిస్తూ ఉంటుంది
ఎదురుగా గోడమీద బల్లి ఏకాగ్రంగా నాకేసి చూస్తూఉంటుంది.

కిటికీ అవతల ఫెరన్ మొక్క క్రీగంట కనిపెడుతూ ఉంటుంది
కీచురాళ్ళ చప్పుడు అప్పుడప్పుడు వినిపిస్తూ ఉంటుంది
పాత యిటికల గుట్టలో మెలికలు తిరిగిన పాము బద్ధకంగా కదులుతుంది

అదే సమయంలో లేత ఎరుపు ఆవేశాన్ని వొంటినిండా కప్పుకుని
కడుపులో వొణికించే చలి కనపడకుండా ఆలోచనల మంటలంటించి
కళ్ళ చివర నేను కాని నేను నీలపుదారాన్ని ముడివేసుకుంటూ
గొణుక్కుంటూ పాడుకుంటూ ఏదో వ్రాసుకుంటూంటాను.

నాలోపల ఎవరో చప్పున ఇటునుంచి అటువైపు వెళ్ళిపోతూ
ఆనవాలుగా వదులుతారు యిరవై ఏళ్ళనాటి జ్ఞాపకాల్ని;
నా గది అవతల ఎవరో నవ్వుని నొక్కిపట్టిన ధ్వని నీళ్ళని కలచినట్టు
రోదసిలో చీకటిలో అంతర్హితసంగీతం తాలూకు శ్రుతి చుట్టుకొన్నట్టు-
మంచూ మసకవెన్నెలా కలిసిన శీతాకాలపు రాత్రి గుండెలమీద
మరకలా పడుతుంది నా నిట్టూర్పు-ఏకాంతంమీద నా తీర్పు.

ఎందుకు వ్రాస్తున్నావంటే యేం చెప్పను - ఎవరికి చెప్పనిప్పుడు
గోడమీద బల్లి విసుగ్గా వెళ్ళిపోయింది—ఫెరన్ మొక్క నిద్రపోయింది
ఆకాశం నక్షత్రాల్ని జారవిడిచి అంత ఎత్తుకు ఎగిరిపోయింది
నా చుట్టూ ఉన్న తెరలు జారిపోయాయి-నాకు నిజంగా మెలకువ వచ్చింది
కిటికీలోంచి శిశిరర్తు క్షీణచంద్రరేఖ గిలగిల్లాడినట్లు కనిపించింది.

---

# కళత్ర భావము

శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

కుజదోషము సప్తమ భావమునకు, అనగా కళత్రమునకు, వివాహ విషయమునకు సంబంధించినదని యెల్లరకు తెలియును. అట్టి దోష స్వభావము సమగ్రముగా గ్రహింపవలెనన్న అందలి తారతమ్యములు, దోష మాపాదించు స్థితులు, వాని భంగములు తెలియవలెను. కుజదోషము పట్టిన జాతకములు గల స్త్రీ, పురుషు లందరు వియోగ మనుభవింపరు. దోష బలమును బట్టి వియోగము సంభవించుట, వైధవ్య ప్రాప్తి, ద్వికళత్ర, బహు కళత్రాది అంశములు సంప్రాప్తమగును. పునర్వివాహము ప్రాప్తించుట గూడ గ్రహబలముచే సూచింపబడుచున్నది. నేడే కాక నాడు గూడ యిట్టి యోగ ఫలములు సంప్రాప్తమైనవని పెక్కు గ్రంథములు నిరూపించుచున్నవి. ఇది ఋషి వచనము. ఇందు భిన్నాభిప్రాయములున్నవి. అవి పరిశీలింతము.

**1 మహాదేవ వచనము:** 7, 10 స్థానములందు కుజ, శుక్రు లుండి, నాల్గవ ఆధిపత్యము కుజ శుక్రులకు ప్రాప్తించిన, చంద్రాత్తు కుజుడు పదింట నుండిన ఆ జాతకుని సప్తమ భావమునకు కళంకము కల్గును. అనగా అతని నడవడి సక్రమముగా నుండదు. శుక్రస్థానములయిన 7, 10 భావము లందు బుధ, శుక్ర, శను లుండిన, 6 వ స్థానాధిపతి 6, 8 12 యందున్న, 2, 7, 10 అధిపతులు పదింట నున్న, సప్తమ స్థానాధిపతి రాహు కేతువులలో ఒక్కరితో కలిసి పదింట నుండి పాప వీక్షణము పొందిన, శుక్రుడు శనిలేక కుజవర్గములందుండి కుజ, రవులలో ఒకరిచే గాని, ఇర్వురిచే గాని చూడబడిన, నవాంశ చక్రమందు కుజుడు గాని, శుక్రుడు గాని, కేతువుగాని వ్యయభావమందున్న, ద్వితీయాధిపతి తృతీయమందు గాని వ్యయమందుగాని స్థితి నొందిన, సప్తమాధిపతి లగ్నమందు గాని, సప్తమమందు గాని ఉన్న, సప్తమాధిపతి ద్వితీయ వ్యయములందున్న, సప్తమ భావమందు శుక్ర శనులు కుజ వర్గములు పొందిన శని కుజుల సంబంధ వీక్షణముల నొందిన, సప్తమమందు చంద్ర, శుక్ర, శనులుండిన, కుజుడు సప్తమమందున్న, రవి చంద్ర కుజులు సప్తమమందుండి కలిసిన, రవి సప్తమమందు కుజుడు చతుర్థమందున్న, రాహువు సప్తమమందుండి కుజుడు చతుర్థమందున్న, సప్తమాధిపతి కుజక్షేత్రవర్తి అయి శుక్ర వీక్షణము నొందిన, బలహీనుడగు సప్తమాధిపతి సప్తమమందుండి పాపగ్రహ వీక్షణము నొందిన, బలహీనుడగు కుటుంబ స్థానాధిపతి పాప సంయోగముగాని, వీక్షణము గాని పొందిన, పాపులు సప్తమ, అష్టమ భావములందుండి కుజుడు వ్యయమందున్న జాతకులకు నైతిక పతనము సూచింపబడినది.

**2. జాతక నారాయణీయము:** కుజుడు 7, 8 స్థానము లందున్న ద్వికళత్ర యోగము సంభవించును. స్వక్షేత్రమగు సప్తమ స్థానమందు కుజుడున్న ద్వికళత్రయోగము భంగమగును. కుజునకు రవేతర గ్రహముల సంబంధము గలిగినప్పుడే ఈ ద్వికళత్రయోగము సంభవించును. సప్తమమునకు శని రాహువుల సంబంధము త్రికళత్రయోగము. కుజుడు 1, 2, 4, 7, 8, 12 స్థానములందున్న కుజ దోషము. సప్తమ స్థానాధిపతి 6, 8, 12 స్థానాధిపతుల సంయోగ వీక్షణములు పొందినపుడు ద్వికళత్రయోగము ప్రాప్తించును. 3, 6, 8, 12 స్థానములందు శుక్రు డున్ననూ, లేక వానికి ఆ రాశి అధిపతుల సంబంధము కల్గినను ద్వికళత్ర యోగము. లగ్నాధిపతియైన కుజుడు లగ్నమందున్నను, ద్వితీయాధిపతియై ద్వితీయమందున్నను, నవమాధిపతియై లాభమందున్నను, లేక 1, 4, 7, 8 స్థానములందున్నను లేక స్త్రీ జాతకములందు సప్తమాధిపతిగాని, అష్టమాధిపతిగాని అయిన కుజుడు, మేష, వృశ్చికములందున్నను కుజదోషము లేదు. కుజదోషము స్త్రీ, పురుష జాతకములందు ఆపాదించినను ఈ దోషము లేదు. కుజా డష్టమమునందుండి బుధ, గురు, శుక్ర, పూర్ణ చంద్రులు ద్వితీయమందున్న కుజదోషము లేదు. సప్తమమందు శుక్రుడుండిన ద్వికళత్రయోగమని పరాశరుడు వ్రాసి యున్నాడు.

**3. వైద్యనాథ దీక్షితుల మతానుసారము :** ఎవని జాతకమందు పంచమ, సప్తమ, నవమ భావములు శుక్ర, కుజ సంబంధములు కలిగియుండునో వానికి వివాహము కాదు. సప్తమందు కుజు డుండిన భార్య మరణించును. కుజుడు 2, 4, 7, 8, 12 యందున్న కుజదోషము. స్థిరము భార్యాభర్తల ఇర్వురి జాతకములందు కుజదోష మేర్పడినచో యీ దోషమునకు భంగ మేర్పడును.

**4. మంత్రేశ్వర ప్రమాణవచనము:** సప్తమమందు కుజు డుండిన భార్య నష్టమగును. శుక్రుని నుండి 4, 8, 12 స్థానములందు పాపు లున్నను, శుక్రునికి పాపార్గళము గల్గినను, శుక్రునికి పాపవీక్షణ కల్గినను లేక శుక్రుడు పాపులతో కలిసినను భార్య నష్టమగును. రాశ్యంశలందు సప్తమ స్థానమునకు కుజ సంబంధము కల్గినను, కుజుడు సప్తమమందున్న ఆ స్త్రీ వైధవ్యము నొందును. సప్తమము శుక్ర పాప మిళితమైన ఆ స్త్రీకి పునర్వివాహము జరుగును. మీనము సప్తమమై అందు కుజు డుండిన భార్య మృతి చెందును.

**5 వరాహమిహిరుడు :** కుజక్షేత్రము లయిన మేష వృశ్చికములందు కుజ త్రింశాంశలలో చంద్రు డుండగా జన్మించిన స్త్రీ అపవిత్రురాలగును. ఈ స్థితి బుధ శుక్రులకు కూడ వర్తించును. వృషభ, తుల లందు శని త్రింశాంశలలో జన్మించిన స్త్రీకి రెండవ వివాహము సూచింపబడినది. అవే కుజ త్రింశాంశలయిన పునర్వివాహము తప్పదని వక్కాణించెను. అందు పాపుల సంయోగము మరింత పాపఫల మిచ్చును. అనగా 3 లేక 4 వివాహములు జరుగును. మిథున, కన్యలందు శుక్ర త్రింశాంశలందు జన్మించిన స్త్రీ అతిచారిణి యగును. సప్తమ స్థానమందు రవి యున్న స్త్రీ భర్తృవియోగిని యగును. సప్తమమందు చంద్ర, కుజ, శనులున్న ఆ స్త్రీ ఒహూ పతివ్రత యగును. కుజ లేక శని క్షేత్రములు జన్మలగ్నమై అందు చంద్రుడు గాని శుక్రుడు గాని యుండి పాప సంబంధము కల్గిన స్త్రీ తల్లితో సహా అతిచార మొనర్చును.

**6. కళ్యాణవర్మ వచనము :** కుజుడు సప్తమమందున్న వియోగము కల్గును. సప్తమమందున్న కుజునికి శని సంబంధము కల్గిన భార్య మరణించును. సప్తమమందలి కుజ లేక శని వర్గములందు శుక్రు డుండి కుజ లేక శని వీక్షణములు కల్గిన భార్యాభర్త లిర్వురు నతిచరింతురు. మేష లగ్న జాతకులకు కుజ చంద్రులు సప్తమమందుండి సంయోగ వీక్షణముల నొందిన అతనికి భార్య మూలముగా మరణము సంభవించును.

**7. చోమాద్రి అభిప్రాయములు:** పాపగ్రహములకు పాపుల వీక్షణ గల్గిన, పాపులు బలహీనులయిన, పాపవర్గము నందున్న, పంచమాధిపతికి అష్టమాధిపత్యము గల్గిన, పంచమాధిపతి మాంది రాశ్యాధిపతి అయిన, గురునికి నీచపట్టిన, శుక్రుడు సప్తమాధిపతితో కలిసిన, శుక్రునికి పాపుల సంబంధము కల్గిన సమయములందు పాపగ్రహ ముండి శుభ సంబంధ వీక్షణములు లేకుండిన, ఆ జాతకునికి భార్యావియోగము తప్పదు. రవి, శుక్రులు 5, 7, 9, స్థానములందున్న లేక కుజ, రవుల స్థానగతులయిన భార్యావియోగము సంభవించును. సప్తమ స్థానమందు నీచ శుభు డున్నను, అది శుభులకు శత్రుక్షేత్రమయినను ఆ జాతకుని భార్య అతిచారిణి యగును. శుక్రుడు సప్తమమందు శని, కుజాంశల నొంది శని, కుజ వీక్షణము లొందిన ఆ జాతకు డతిచారి. చంద్ర, శనులు సప్తమ మందుండి శుక్రుడు కుజ, శని వర్గముల నొంది వారిచే వీక్షింపబడిన అతడు భార్యతో సహా వ్యభిచరించును. శుక్రుడు, శని లేక, కుజ క్షేత్రగతుడై వారికి సప్తమమందున్న వానికి నీతి నియమాదులు లేవు. వృషభ, తుల లందు శుక్ర త్రింశాంశలలో జన్మించిన స్త్రీలు నీతి రహితలు. కర్కాటక లగ్నమందు శని త్రింశాంశమందు జన్మించిన స్త్రీ అవినీతి కాటపట్టగును.

**8. వేంకటేశ్వర వచనము:** రవి, శుక్ర, శనుల సప్తమ స్థితి అశుభము. కుజ సప్తమ స్థితి మంచిదిగాదు. లగ్న ద్వితీయ, షష్ఠాధిపతులు కలసి షష్ఠస్థానగతులయి పాపుల సంయోగము గల్గిన ఆ జాతకుడు గుణవంతుడు కాడు. సప్తమాధిపతి లగ్నమందున్న పాప ఫలము గల్గును. సప్తమాధిపతి రాహు, కేతువులతో కలసి పాపుల వీక్షణ నొందిన యెడల లేక ద్వితీయ, సప్తమ, దశమాధిపతులు దశమమందున్న జాతకులు అతిచారులు. ద్వితీయ, సప్తమ, దశమాధిపతులలో ఒకరు చతుర్థమందున్న అతడు ఇతరుల భార్యలతో సంగమించును. పాపచంద్రుడు సప్తమమందు పాపులతో గలిసిన అశుభము. సప్తమాధిపతియైన కుజుడు పాప షడ్వర్గముల నొందిన లేక క్షీణుడైన లేక శత్రుస్థానవర్తియైన అతని భార్య గుణహీనురాలగును. సప్తమాధిపతియైన శుక్రుడు పాపుల సంబంధ వీక్షణల నొందినను శత్రుస్థాన గతుడైనను అతని భార్య గుణరహిత యగును.

**9 వేంకట రామానుజులవారి మతము :** కుజుని 2, 4, 7, 8, 12 స్థానములందున్న దోషము. అట్టి దోషము నొందిన స్త్రీ వలన భర్త మరణించును.

**10. పరాశర మతానుసారము :** వృషభ, తుల లందున్న కుజుడు గాని, మేష, వృశ్చికములందున్న శుక్రుడు గాని

సప్తమభావమునకు పాపులు. లగ్న, అష్టమాధిపతులు కుజ లేక శుక్ర క్షేత్రగతులయిన జాతకునికి నీతి యరుదు. కుజ, శుక్రులు మకర, కుంభములందున్న లేక యాస్థానముల వీక్షించిన అతని భార్య నీతిరహిత. శని, కుజ, శుక్ర, రవులు సప్తమమందున్న ఆ జాతకుడు నీతిహీనుడు. ద్వితీయ, సప్తమ, దశమాధిపతుల సంయోగ మశుభము. లగ్న, సప్తమాధిపతుల సంయోగ మశుభము నిచ్చును. సప్తమాధిపతి ద్వితీయమందుండి పాప సంయోగము నొంది కుజునిచే వీక్షింపబడిన అతని భార్య లవినీతురాలు. సప్తమాధిపతి కుజ లేక శని క్షేత్రము లందుండి కుజ, శనులచే వీక్షింపబడిన అతని భార్య పాప వర్తిని. శుక్ర, కుజులు మకర కుంభములందున్నను, శనిచే వీక్షింపబడినను, పాప ఫలము ననుభవింతురు.

**11. వి. వి. రామనుగారి భావము:** ద్వితీయ, సప్తమ, దశమాధిపతులు చతుర్థమందున్న జాతకుడు అతిచారి. సప్తమ బుధుడు, ద్వితీయ, సప్తమ, దశమాధిపతుల ద్వితీయస్థాన స్థితి జాతకుని అవినీతి పాల్జేయును.

**12. భృగు సూత్రములు :** (ఎ) సప్తమ రవి అశుభుడు. సప్తమమందున్న రవిని నీచలేక శత్రుస్థానగతులైన గ్రహములు వీక్షించిన బహుభార్యాప్రాప్తి సంభవించును.

(బి) చంద్రుడు చతుర్థ, షష్ఠ, సప్తమ స్థానగతుడైన పాప ఫలము.

(సి) కుజుడు తృతీయమందున్న అతిచార యోగ్యత నొసగును. శుభవీక్షణ నొందిన ఆ పాపము సంభవింపదు. సప్తమ మందున్న కుజునికి రాహు కేతు వీక్షణ గల్గిన అతడు గుణవంతుడు గాడు. సప్తమ కుజుడు భార్యావియోగము నిచ్చును. అతనికి శుభవీక్షణము గల్గిన వియోగము సంభవింపదు. శుభులతో నున్న కుజుడు స్వలేక ఉచ్చక్షేత్ర పాపవీక్షణము నొందిన అతని భార్య మృతిచెందును. లేక అతడు అవినీతిపరు డగును. రాహు కేతువుల సంబంధము గల్గిన సప్తమ కుజుడు పాపుడు, బలవంతుడైన కుజుడు భాగ్యమందున్న నీతికి భంగము.

(డి) సప్తమ బుధుడు, సప్తమాధిపతి బలహీనుడు. సప్తమాధిపతి కుజునితో కలియుట స్త్రీ, పురుషులకు సప్తమ భావ దోషము కల్గించును.

(ఇ) శుక్రుడు అష్టమ, వ్యయాధిపతులతో కలసినను, వారిచే వీక్షింపబడినను, బలహీనుడైనను ఇర్వురు భార్యలు కల్గుదురు. సప్తమ శుక్రుడు అశుభుడు.

(ఎఫ్) ద్వితీయ శని ద్వికళత్రయోగ మిచ్చును. గురు వీక్షణ నొందిన పంచమ శని ద్వికళత్రయోగ మిచ్చును. సప్తమ, అష్టమములందున్న శని పాపి. సప్తమమందు శని, కేతుల కలయిక పాపము.

(జి) రాహు, కేతువులు ద్వితీయ, షష్ఠ, సప్తమ, దశమము లందు పాపులతో కలసిన ద్వికళత్రయోగము.

**13. రామదయాళుని అభిప్రాయము :** శని, చంద్రులు భాగ్యమందున్న జాతకుని భార్య అతిచారిణి యగును. సప్తమ భావము శుక్రవర్గమై శుక్రదృష్టి నొందిన అతనికి బహు భార్య లుందురు. సప్తమమును పాపులు చూచిన ఆతను వ్యభిచరించును. శని అష్టమమందు, కుజుడు సప్తమ మందున్న జాతకునికిర్వురు భార్యలు. సప్తమ స్థానమును చంద్రుడు చూచిన వాని భార్య చంచల స్వభావము గలది. సప్తమమునకు శని, కుజ, చంద్ర సంబంధము గల్గిన లేక చంద్రుడు, శని, కుజుల మధ్యగతుడైన భార్యాభర్త లిర్వురు అవినీతిపరులు. సప్తమాధిపతి బుధ నవాంశము నొంది బుధునిచే వీక్షింపబడిన వాని భార్య అవినీతిపరురా లగును.

కుజదోష నిర్ణయమునకు పూర్వము ఈ క్రింది విషయముల పరిశీలించిన దోష ప్రమాణ మెరుగ నగును.

1. కుజుని స్వభావ మెద్ది ?
2. కుజుడు ఆయా లగ్నములకు శుభుడో పాపియో ?
3. కుజుడున్న స్థానము అనుకూలమా, ప్రతికూలమా ?
4. కుజ దోషము ద్వాదశ భావములందు, ద్వాదశ రాసులందు సమానమా ?
5. చర, స్థిర, ద్విస్వభావ రాసులందున్న కుజుని ఫలముల భేదమేమి ?
6. కుజదోషమున్న భార్యావియోగము, భార్య మరణమేనా లేక సంసార జీవితమందు ఇతర కష్టములు సంభవించునా ?
7. కుజుడు స్వ, ఉచ్చ, శత్రు, మిత్ర, నీచ క్షేత్రగతుడై యొసగు ఫలముల భేదమేమి ?
8. దుస్థానగతుడగు కుజునికి శుభ సంబంధముచే గలుగనున్న మార్పు లెవ్వి ?
9. శుభస్థాన గతుడగు కుజునికి పాపగ్రహ సంబంధముచే దుష్ఫలితములు ప్రాప్తించునా ?
10. ధర్మ కర్మాధిపతియగు కుజుడు దోషరహితుడా ?
11. దుస్థానాధిపతియగు కుజుడు శుభస్థాన గతుడైన గలుగు మార్పు లెవ్వి ?
12. పాపియగు కుజుడు జీవితాంతము వరకు కష్టముల నిచ్చునా లేక ఎట్టి మార్పులు కల్గును ?
13. కుజదోషము గల్గిన భార్యాభర్తల జీవిత మెట్లుండును ?

14. ఒకే జాతకమందు కుజదోష ముండిన భార్యాభర్తల సంసార జీవిత మెట్లుండును ?

15. కుజదోషములేని జాతకుల సంసార జీవితము సుఖప్రదమా?

16. 2, 7, 11 లందు శుభులున్న, కుజుడు దుస్థానగతుడైన దోషముండునా ?

అను నంశముల సమగ్రముగా పరిశీలింపవలెను.

కుజ క్షేత్రములు లగ్నములు కాగా అందు జనన మొందినవారికి కుజుడు శుభుడు కాజాలడు. వానికి షష్ఠ, అష్టమాధిపత్య పాపము సంభవించుటచే తద్దోషము లనివార్యములు. కర్కాట, సింహ, ధను ర్మీనలగ్న జాతకులకు కుజుడు రాజయోగ కారకుడు. మిధున, కన్యారాసులందు జన్మించినవారికి కుజుడు పాపి. అందును, కన్యాలగ్న జాతకులకు పాప మధికము. అట్లే వృషభ, తులా లగ్నములకు చూచుకొనవలెను. మకర, కుంభ రాసులందు జన్మించినవారికి ప్రాపంచిక సౌఖ్యములకు కుజుడు సహకరించును. కుజునకు దుస్థానాధిపత్యము గాని, దుస్థాన స్థితి గాని గల్గిన జాతకులకు మనశ్శాంతి యుండదు. స్త్రీ జాతకములందు కుజుడు బలవంతుడైన శుభుడుగా నుండిన సౌఖ్యము గల్గును.

కుజుడు 1, 2, 4, 7, 8, 12 స్థానములందున్న కుజ దోషమని సామాన్య వచనము. ఇట్టి స్థానములు లగ్న, చంద్ర, శుక్రుల నుండి యని గ్రహింపవలెను. ఈ స్థానముల ప్రత్యేకత గమనింతము. లగ్నము ఆరోగ్య ఆయు ర్భాగ్యాది సర్వ విషయములకు నిలయము. సప్తమము కళత్ర స్థానము. అందుకు సప్తమము లగ్నము గాన కళత్ర మారక స్థానము. ద్వితీయము కుటుంబ స్థానము. ఇది సప్తమమునకు అష్టమముగాన కళత్ర భావమునకు కష్టముల సూచించును. చతుర్థము కుటుంబ పరిసర స్థానము. అట్టి స్థానము దోష భూయిష్ట మగుట పాపము. అనగా జాతకుని ఆరోగ్య, సంపదలకు భంగము కల్గును. సప్తమము కళత్రస్థానము గాన కళత్ర ఆరోగ్య, ఆయుర్భాగ్యములకు నిలయము. భార్యాభర్తల అన్యోన్యతకు మూలస్థానము. గాన ఈ స్థానమునకు దోష మాపాదింపరాదు. సప్తమమునకు ధనస్థానమగు అష్టమము శుభమై యుండవలెను. ద్వితీయము ఏ భావమునకైనను మారక స్థానము గాన అందు పాపస్థితి అశుభము. మాంగల్య స్థానమగు అష్టమము పాపరహితమై యుండుట క్షేమము. ద్వాదశ స్థానము శయ్యా, సౌఖ్యాదుల సూచించును గాన ఈ స్థానము గూడ శుభమై యుండవలెను. ఈ పై స్థానములందు 1, 2, 7, 12 ముఖ్యములు. తను భావమునకు ఇరుప్రక్కల నుండు 2, 12 స్థానములుగాని ఎదురుగా నుండు 7 వ స్థానముగాని పాపులతో చేరిన కష్టములు ప్రాప్తించును. ఈ స్థానములు ఎంత శుభమైన జాతకుడు అంత సుఖించును. ఇరుగు పొరుగు స్థానములందు గాని, ఎదుటి స్థానమందు గాని దుష్టుల నివాసము కష్టహేతువగుట నిత్య జీవితమం దనుభవించుచున్నాము గదా ! అట్లే తను స్థానమునకు గూడ చూడవలెను.

లగ్న, చంద్ర, శుక్రాదుల నుండి కుజదోషము నిర్ణయింపవలెనని శాస్త్రము దెల్పుచున్నది. జాతకములందు ఈ మూడు స్థానముల నుండి గాని, రెంటినుండి గాని, ఏక స్థానమునుండి గాని దోష మాపాదింపవచ్చును. దోష నిర్ణయము ఉత్తరోత్తర క్రమమున నిర్ణయింపవలెను. అదిగాక లగ్న, చంద్ర శుక్రస్థానములలో ఏ స్థానమునకు దోషము బలీయమను విషయము పరిశీలింపగా శుక్రస్థానమునుండి ఏర్పడు కుజ దోషము బలీయమని అనుభవములో నిర్ణయింపవచ్చును. ద్వితీయ స్థానము చంద్రునకు, తృతీయము లగ్నమునకు ఏర్పరుపవలెను. కాన, కుజదోష విచారణయందు ఈ క్రమము పాటించుట ఉత్తమ పద్ధతి. 1, 2, 4, 7, 8, 12 స్థానములం దేర్పడు కుజ దోష ఫలముల క్రమము పరిశీలింతము. అష్టమమం దేర్పడు దోషము స్వల్పమని ఋషుల అభిప్రాయము. ఇట్టి దోషముచే వివాహ మాలస్య మగుట, వివాహ సంబంధమయిన సంప్రదింపులందు కొంతవరకు భిన్నాభిప్రాయము లేర్పడుట మాత్రమే సూచింపబడుచున్నది. పురుష జాతకములందు 1, 4, 8 స్థానములందు, స్త్రీ జాతకములందు 2, 7 స్థానములందున్న కుజుడు దోషి గాడని కొందరి అభిప్రాయము. ఇట్టి అభిప్రాయము సరిగాదు. కుజుని, స్వ, ఉచ్ఛ, నీచ క్షేత్రములు లగ్న, చంద్ర శుక్రులకు 4, 7 స్థానములైన అందున్న కుజుడు దోషి గాడని చెప్పుట మంచిది. లగ్న, చంద్ర, శుక్రులు, తులా లేక మకరములందున్న మేష కుజుడు దోషరహితుడు. వృషభ, సింహ, లగ్న జాతకులకు వృశ్చిక కుజుడు దోషిగాడు. లగ్న, చంద్ర, శుక్రులు కర్కాటక లేక తులలయందున్న జాతకులకు మకర కుజుడు శుభుడు. లగ్న చంద్ర, శుక్రులు మేష లేక మకరమందున్న నీచ కుజుడు పాపిగాడు. చర లగ్నములు లగ్న, చంద్ర, శుక్రులకు 1, 2, 4, 8, 12 స్థానములయిన కుజ దోషము లేదు. ఇతర లగ్నములకు పై జెప్పబడిన స్థానములందున్న కుజునకు గురు లేక బుధ సంబంధము కల్గిన దోషరహితమగును. కుజ, బుధ క్షేత్రములు ద్వితీయమై అందు కుజు డున్న దోషములేదు. కుజ శుక్ర క్షేత్రములు చతుర్థములై, అందు కుజుడున్న దోషము లేదు. మేష, కర్కాట

# కళత్ర భావము

వృశ్చిక, మకరములు సప్తమములైన అందు కుజుడున్న దోషము లేదు. గురుక్షేత్రములు గాని, కుజుని ఉచ్చ, నీచ స్థానములు గాని అష్టమములైన అందు కుజుడున్న దోషము లేదు. బుధ, శుక్ర క్షేత్రములు ద్వాదశములైన అందు కుజుడున్న దోషము లేదు. భార్యాభర్తల జాతకములందు కుజుడు ద్వాదశమందున్న దోషిగాడు. శని, రాహు, కేతువుల సంబంధముచే కుజుడు దోషరహితు డగుచున్నాడు. గురునకు 8 డిగ్రీల దూరములో నున్న కుజుడు దోషరహితుడు. కుజ, గురుల ద్విద్వాదశ స్థితిచే వివాహ మాలస్య మగును. చంద్ర, కుజుల యుతి కుజదోషమును హరించును. పైన జెప్పబడిన అంశములు దేవ కేరళ, హోరాశాస్త్ర, జాతక చంద్రిక, నారదీయ, గార్గ సంహితలందు తెలుపబడినవి.

**కుజదోష నిర్ణయము :** 1 గురు, బుధ క్షేత్రములు తప్ప ఇతర స్థానములు కుటుంబ స్థానములైన అందున్న కుజుని దోషిగా నిర్ణయింపవలెను.

2. శుక్ర క్షేత్రములు తప్ప ఇతర స్థానములు వ్యయ భావములైన అందున్న కుజుడు దోషి.

3. స్వక్షేత్రములు తప్ప ఇతర స్థానములు చతుర్థ ములైన అందున్న కుజుడు దోషి.

4. స్వోచ్చ, నీచ క్షేత్రములు తప్ప ఇతరస్థానములు కళత్ర భావములైన అందున్న కుజుడు దోషి.

5. శుక్ర, గురు క్షేత్రములు తప్ప ఇతరములు అష్టమములైన అందున్న కుజుడు అపకారి.

6. కళత్ర భావములైన సింహ, కుంభములందున్న కుజుడు పాపిగాడు.

7. గురునితో కలసిన కుజుడు దోషరహితుడు.

8. పూర్ణచంద్రయుతిచే కుజుడు దోషరహితుడు.

పైన జెప్పబడిన లగ్న, చంద్ర శుక్ర స్థానములనుండి చూచుకొనవలెను.

## ముఖ్య సూత్రము

కుజదోషము మాత్రమే వైధవ్య కారణముగాదు. సప్తమాధిపతి బలహీనుడగుట, స్త్రీలకు సప్తమ భావ కారకుడగు గురుడు బలహీనుడగుట కూడ హేతువులగును. స్త్రీలకు సప్తమభావ కారకుడు కుజుడని కొందరి అభిప్రాయము. ఋషి సాంప్రదాయము ననుసరించి గురుడని కూడ చెప్పబడియున్నది. అందుచే గురు, కుజుల రిద్దరను విచారించుట శ్రేయస్కరము.

1. కుజుడు లగ్న, చంద్ర, శుక్రులకు 2, 4, 7, 8, 12 లందున్న కుజదోషమని పండితాభిప్రాయము. అందు శుక్ర, చంద్ర, లగ్నములు ఉత్తరోత్తర బలీయములు.

2. సప్తమాధిపతి బలహీనుడగు పాపియైన దోషము. ఆ యధిపతి బలవంతుడగు శుభుడైన సద్గుణవతియగు భార్య, మంచి సంతానము కల్గును.

3. సప్తమాధిపతి పాపియైనను, స్వక్షేత్రములగు సప్తమ మందున్న శుభము.

4. 6, 8, 12 స్థానాధిపతులుగాని శుభులు, సప్త మందున్న శుభము.

5. పాపదృష్టి, సంయోగములు లేని శుక్రునితో సప్త మాధిపతి కలియుట శుభము.

6. సప్తమాధిపతి ఉన్నతాంశల నొంది శుభ స్థాన ములందుండుట శుభము.

7. మాంగల్య భావమగు అష్టమమునకు కుజ, శనుల బలదృష్టులు గల్గిన భర్తృ మరణము తప్పదు.

8. 5, 8, అధిపతులు సప్తమందున్న లేక పంచ మాధిపతి సప్తమమందు, సప్తమాధిపతి అష్టమమైన తన మూలత్రికోణరాశి గతుడైన వైధవ్యము తప్పదు.

9. తుల, మకర లగ్నములకు కుజుడు సప్తమమందున్నను సప్తమమును చూచినను వైధవ్యము ప్రాప్తించదుగాని దంపతుల సంబంధ బాంధవ్యములు క్రమగతినుండవు.

10. శుక్ర లేక శుక్ర కుజుల సప్తమ స్థితి కొంతవరకు దోషము.

11. కుజ క్షేత్ర శుక్ర స్థితి, కుజ వీక్షణ అతిచార దోషమును గల్గించును.

12. పాపులు 2, 7, స్థానములందున్న లేదా ఆ స్థాన ములను చూచిన పురుషులకు భార్యా మరణము ప్రాప్తించును. స్త్రీలకు శుభము కల్గును.

13. శుక్రునకు 4, 8, 12, స్థానములందు పాపు లున్నను, శుక్రుడు పాప మధ్యముడైనను పాపులతో కలసినను పాపులచే చూడబడిననూ వైధవ్యము తప్పదు. ఇట్లే సప్త మాధిపతిని చూచి ఫలము నెరుగవలయును.

14. కుజ, శనులు, శుక్రచంద్రులకు సప్తమందున్న వివాహముండదు. లేదా సంతానముండదు.

15. క్షీణచంద్రుడు పంచమందున్నప్పుడు 1, 7, 12 లందు పాపులున్న భార్యగాని, సంతానముగాని ఉండదు.

16. అష్టమాధిపతి సప్తమమందున్న భార్య మర ణించును.

17. పంచమ, సప్తమాధిపతుల పరివర్తనచే వైధ వ్యముగాని నపుంసకత్వముగాని గల్గును.

18. సప్తమమందు శుభులు లేకున్నను, సప్తమ మును శుభులు వీక్షింపకున్నను, సప్తమమందు పాపులున్ననూ

పాపదృష్టి నొందినను బలహీనులగు గ్రహములున్నను, పాప వర్గులనొందిన గ్రహములున్నను, పంచమాధిపతియున్నను, అష్ట మాధిపతియున్నను, మాందిరాశ్యధిపతియున్నను, నీచగ్రహ మున్నను, గురుశుక్రుల యతిగర్విననను, పాపయుతుడగు శుక్రు డున్నను భార్య మరణించును.

19. గురుని సప్తమస్థితి అశుభము.

20. కన్యాలగ్న జాతకులకు శని లేక కుజుల సప్తమ స్థితి భార్యకు నష్టము.

21. శుక్రుడు లాభమందున్న, సప్తమాధిపతి షష్ఠ వ్యయములందున్న, పాపులులగ్నమందున్న, గురుడు ద్వితీయ మందున్న, రాహువు సప్తమమందుండగా శని ద్వితీయమందున్న పాప సంబంధముగల శుక్రుడు, మిధున, ధను ర్మీనములందున్న కళత్ర దోషము కల్గును.

22. శుక్రుడు ద్వితీయ, సప్తమాధిపతులతో కలసి తృతీయమందు లేక ఇతర దుఃస్థానములందున్న వైధవ్యము తప్పదు .

23. సప్తమాధిపతి వక్రించిన వివాహమాలస్యమగును.

24. 1, 2, 7, 8 అందు రాహు కేతువులున్న వివాహ హమాలస్యమగును.

## కుజదోషనివారణ సూత్రములు

1. స్త్రీ జాతకములకు సప్తమందు కుజుడు, పురుషులకు ద్వితీయమందు కుజుడున్న దోషములేదు.

2. పాప సంబంధములేని నైసర్గిక శుభులు భాగ్య మందున్న, 7, 8, లందు పాపులున్నను స్త్రీ జాతకములకు దోషముండదు.

3. కర్కాట, మకరములు సప్తమభావములైన అందున్న కుజునకు దోషములేదు. కాని ఇది ఎల్లరకు వర్తింపదు. కుజుడు బలవంతుడై శుభసంబంధము గలిగియున్నప్పుడు మాత్రము పాపము స్వల్పముగా నుండును.

4. కుజుడు స్వ లేక ఉచ్చ క్షేత్రగతుడైనను, గురు సంబంధము గలిగియున్నను దోష రహితుడు.

5. రాహు, శనులు 1, 4, 8, 7, 12 స్థానములందున్న కుజ దోషముండదు.

6. కుజ స్థిత రాశ్యధిపతి లగ్న, చంద్రులకు కేంద్ర ములందున్న కుజ దోషముండదు.

7. కుజ, శనులు సప్తమమగు కర్కాటమందున్న ఎట్టి దోషములుండవు.

8. పూర్ణచంద్ర, కుజుల కలియికచే కుజదోషము నివారింపబడును.

9. అష్టమమందు శుభులు పాపులు కలసిన , అష్ట మమునకు గురుదృష్టి కలిగిన, ద్వితీయాధిపతి అష్టమమందున్న బలవంతులైన లగ్న, పంచమ, సప్తమ, భాగ్యాధిపతులు అష్ట మమును చూచిన వైధవ్యము సంభవింపదు.

10. మేష, వృశ్చికములగు 1, 2, 4, 7, 8, 12 లందు కుజుడున్న దోషము లేదు.

11. రవి, చంద్ర, శని స్థానములందు కుజుడున్న దోష ములేదు.

## ద్వికళత్ర యోగములు

1. సప్తమ భావము మిధున, కన్య, ధను, ర్మీన రాసు లైఅందు రవి, చంద్ర, శుక్రులున్న వారిని పాపులు వీక్షించిన,

2. సప్తమ భావమందున్న శుక్రుని పాపులు వీక్షించిన,

3. సప్తమాధిపతి 6, 8, 11 స్థానాధిపతులగు పాపులతో కూడిన,

4. పురుష జాతకములందు చంద్రుడు, స్త్రీ జాత కములందు రవి పాపసంబంధులైన,

5. సప్తమాధిపతి పాపులతో కలసినను సప్తమమునకు పాపసబంధము కల్గినను ద్వికళత్రయోగము,

## స్త్రీ జాతక విచారణ

స్త్రీ జాతకములందు వైధవ్యము, వియోగము, భర్తృమూలక దుఃఖము, భర్తృ తిరస్కారము, సంసారసౌఖ్య హీనత, భర్తృవర్గమూలక బాధలు సామాన్యాంశములు. వీని హేతువులు శాస్త్రసమ్మతముగా నెఱుగదగును.

స్త్రీ జాతకములందు 7, 8 స్థానములందు పాపులున్న బాల్యమందే వైధవ్యము ప్రాప్తించును. కుజుడు సప్తమందున్న అవి మకర, కర్కాటకములుగాకున్న వైధవ్యము సూచింపబడును. సప్తమగతుడగు శనిని శత్రుగ్రహములు చూచిన లేప్రాయ మున వైధవ్యము సంభవించును. కాని ఆ స్త్రీ పూర్ణాయుర్దా యము గలిగియుండును. సప్తమము పాపస్థానమై అందు శని కుజులున్న వైధవ్యము తప్పదు. అష్టమమందుండు పాపగ్రహము నవాంశయందు నీచనొందినను శత్రుక్షేత్రగతు డైనను,పాపనవాంశయందున్నను, వైధవ్యము గల్గును. కుజుడు 2, 12, 7, 4, 8 స్థానములందుండుట ఉత్తరోత్తరముగా వైధవ్య కారణములు. సింహము సప్తమమై అందు రవియున్న భర్తృ వియోగము సంభవించును. సప్తమమందున్న రవిని, శని. రాహువు, కేతువులు చూచిన భర్తృ వియోగము వాటిల్లును, బలహీనుడగు పాపి సప్తమమందుండగా వానిని శత్రు గ్రహములు చూచిన భర్తచే తిరస్కరింపబడును. సప్త మము గ్రహవర్జితమైనను ఆ స్థానమును పాపులు చూచిన

భర్తృ మూలక కష్టములు ప్రాప్తించును. సప్తమము బల హీనమై గ్రహవర్జితముకాగా పాపవీక్షణ నొందిన — భర్తృమూలక కష్ట మనుభవించును. సప్తమభావగతుడగు పాపి, నీచనొందిననూ, శత్రుక్షేత్రవర్తియైనను, భర్తను బాధించును. లగ్న సప్తమాధిపతులు షష్టాష్టక స్థితి నొందిన స్త్రీ భర్తతో కలహించును. లగ్న, చంద్రులు పురుష రాసులందుండి పాప సంబంధముగలవారైన స్త్రీ భర్తను తిరస్కరించి దారిద్ర్య మనుభవించును. అట్టి స్త్రీ, పురుషగుణములు దుర్గుణములు గలిగి పాపములజేయును. ఆమె జీవితము దుఃఖ భూయిష్టమగును. పాపులు 1, 7, 8, 9 స్థానములందున్న స్త్రీ జీవితము దుఃఖభాజనము. ఈ స్త్రీకి కేమద్రుమ రేఖా యోగములు సంభవించిన అనేక దుఃఖముల నొందును. కోణములందు బలహీనులగు శుభులున్న సంతాన నష్టము. సప్తమ భావగతుడగు శనిని పాపులు చూచిన అవివాహితయై పూర్ణాయుర్దాయురాలగును. 1, 7, 8, 9 లందు స్వక్షేత్ర వాసులుగాని పాపులుండుట పాపము. రవి, యురానస్ లయుతిచే స్త్రీ పురుషుల వాంఛించును. సప్తమమందు కుజునితోయున్న నెప్ట్యూను భర్తృ వియోగ కారకుడగును. సప్తమమందు బలహీనులగు పాపులు పాప సంబంధము కలిగి యున్న భర్త మరణించును. చంద్ర యురానస్‌లు సప్తమ మందున్న భర్తచే విడువబడును. చంద్ర, శక్రులకు పాప త్వము సంభవించిన అనారోగ్యముగలిగి సంసార సౌఖ్యహీనత నొందును. రవి పాపసంబంధము గలిగి మిధున, కన్యా, ధను ర్మీనములందున్న 1, 5, 7, స్థానములు శుభ రాసులైన ద్వితీయ వివాహము కల్గును. అగ్ని తత్వగ్రహములు సప్తమ మందున్న వైధవ్య ప్రాప్తి, రవి సప్తమమందున్న వియోగము. శని, రాహు కేతువులు సప్తమమందున్న వైధవ్యము తప్పదు. అట్టి పాపులు బలహీనులైన వియోగము మాత్రము సంభ వించును. సప్తమమందు బలహీనులగు పాపులుండి, భాగ్య భావమందు శుభులు లేకున్న వియోగమేకాని వైధవ్యము ప్రాప్తిం పదు. అట్టిచో కొన్ని జాతకములందు వివాహముకూడ కాక పోవచ్చును.. ద్వితీయమందు పాపులున్న ద్వితీయాధిపతి పాప స్థానమందున్న, పాపులతోకూడిన, పాపులచే వీక్షింపబడిన వైధ వ్యము తప్పదు. రవి, కుజులు 2, 7, 8 లందున్న భర్తృ వియోగము.

## స్త్రీ జీవిత మెట్లు శుఖప్రదమగును?

2, 4, 8 భావములచే స్త్రీల సౌఖ్యము నిర్ణయింప వచ్చును. నవాంశచక్రమందు గూడ ఈ భావములు శుభ ప్రదములై యుండవలయును. సప్తమ భావము, భావ నవాంశ శుభమైనను, శుభునిచే వీక్షింపబడినను, శుభులందున్నను, స్త్రీ సర్వసౌఖ్యముల ననుభవించుచు భర్తకు ప్రియయై యుండును. 7, 8 భావములందు పాపులున్నను భాగ్యభావ మందు శుభులున్నను పూర్ణ సుమంగళియై పుత్రపౌత్రాభి వృద్ధిగాంచును. 1, 7, 8, 9 లందు శుభులున్న సర్వ సుఖములు చేకూరును. ఈ భావములందు పాపులున్ననూ ఆయా భావములు గ్రహస్వక్షేత్రములైన శుభము. కోణములందు శుభులున్న ధన సౌఖ్యము ననుభవించును. లగ్న చంద్రులు స్త్రీ రాసులందుండి శుభులచే వీక్షింపబడిన నిష్కళంక మగు పాతివ్రత్యము కలిగి ధన వాహన సంతానాది సౌఖ్యములు గలిగి, దీర్ఘ సుమంగలియగును. రాత్రులందు జననమొంది, లగ్న రవి, చంద్రులు స్త్రీ రాసులందున్న మహాభాగ్య యోగ మనుభ వించును. లగ్న ,చంద్రులు స్త్రీ రాసులందుండి, శుభులచే వీక్షింపబడిన స్త్రీ మహాపతివ్రత. సప్తమాధిపతి, శుక్రుడు ఉపచయములందున్న స్త్రీ అభివృద్ధి నొందును. లగ్న, చంద్రులు పురుష రాసిగతులై శుభ సంబంధములు గలిగియున్న, విద్య వినయ ములు గలిగి మిశ్రమమగు నడవడి గలిగియుండును.

## పురుషజాతక విచారణ

రవి కన్యయందుండ సప్తమమగు మీనమందు శనియున్న, భార్య మరణించును. సప్తమమందు కుజుడున్న భార్యా వియో గము తరచుగా గల్గును. అట్టి కుజుని శని చూచిన భార్య మరణించును. క్షీణచంద్రుడు పంచమమందు, సప్తమ ద్వాదశ ములందు పాపులుఉన్న వివాహము కాదు. ఒకవేళ వివాహ మైనచో సంతానముండదు. బుధ, శుక్రులు సప్తమమందున్న భార్యయుండదు. రవి, శుక్రులుగాని, కుజ శుక్రులుగాని 5, 7,9 లందున్న వానిభార్య అంగవిహీనురాలగును. సప్త మమందు శుక్రుడున్న అందమైన భార్యకలిగి సర్వ సుఖముల ననుభవించునుగాని అతిచారదోష ముండును. సప్తమాధిపతి రాహు, కేతులతో నున్నను పై ఫలములు గల్గును. బలవంతుడగు శుక్రుడున్న బహుస్త్రీకాముడ యగును. 7, 8 లందు పాపులుండి, 12 నందు కుజుడు ద్వాదశాధిపతి లగ్నము మొదలు షష్ఠభావమువరకు ఎచ్చట నున్నను ద్వితీయవివాహము గల్గును. లగ్న. సప్తమాధి పతుల సంబంధముచే అందమైన భార్య ప్రాప్తించును. లగ్న, సప్తమాధిపతులతో రవికూడిన భార్య గుణహీనురాలగును. చంద్ర, శనులు సప్తమభావగతులైన వివాహము కాదు. కాని విధవా వివాహము ప్రాప్తించవచ్చును. సప్తమాధిపతి నీచనొందిన, శత్రు క్షేత్రమందున్న, అస్తంగతుడైన, పాపదృష్టి నొందిన

లేదా సప్తమ భావమునకు పాపసంయోగ దృష్టులు ప్రాప్తించిన భార్య మరణించును. క్షీణచంద్ర, గురులు సప్తమమందున్న, పాపులు చతుర్థమందున్న, గురుడు సప్తమందు అస్తంగతుడైన భార్య మరణించును. నీచగురుడు సప్తమమందున్న భార్యా నష్ట ముగల్గును. చంద్రుని యురానస్ చూచిన లేక శుక్రుని యురానస్ చూచిన పరస్త్రీగామియగును, కర్కాట, వృశ్చిక, మీనములు, 1, 5, 7 స్థానములై అందు కుజ, శుక్రుల సంబంధము గల్గిన పరస్త్రీగామి యగును. రవి శత్రుక్షేత్రమగు సప్తమమందున్న, సప్తమాధిపతియగునని శత్రుక్షేత్రమగు ద్వితీయమందున్న ధనాధిపతియగు రవికి, శనితో షష్టాష్టక స్థితి ప్రాప్తించిన శత్రువులగు ద్వితీయ సప్తమాధిపతులకు పరివర్తన గల్గిన, దోషయుక్తమగు సప్తమమును గురుడు వీక్షించిన అనేక వివాహములగును, కాని సంసార సౌఖ్యముండదు.

### సప్తమభావమైన వివిధ రాసుల ఫలములు

మేషము సప్తమ భావమైనవారు అధికారము చలాయింతురు. అందువలన స్వల్పమగు గృహకల్లోలములుండును. భార్యాభర్తలలో కుజుడు లగ్నమందున్నవారు రెండవారిని అదుపులోనుంచుకొనెదరు. సప్తమాధిపతికి పాపసంబంధము కల్గిన తగాదాలు, తీవ్రత, అభిమాన శూన్యత, దుర్గుణములు ప్రాప్తించును. కుజుడు జలరాశియందు బలహీనుడైన దుఃఖము కల్గును.

వృషభము సప్తమముకాగా వివాహము కట్నములమీద ఆధారపడియుండును. ధనమే ప్రధానము. శుక్రుడు సప్తమాధిపతి గనుక సంసారము సుఖదాయకముగా నుండును. శుక్రుడు ద్వితీయమందు శుభగ్రహములున్న ధనవృద్ధి. శుక్రునకు శుభదృష్టి గల్గిన వానిభార్య సౌందర్యవతి, శాంతము, దయా, దాక్షిణ్యములు గలది. పాపదృష్టినొందిన అధిక ధననాశము. సోమరితనము, సంసార సౌఖ్యహీనత ప్రాప్తించును.

మిథునము సప్తమమైన, భావకారకు లశుభులైన లేదా మిథున, సింహ, కన్యలందున్న వివాహము సమస్యగా పరిణమించును. ఇందు బంధువుల సహాయ మవసరమగును. ఇట్టి జాతకులకు విద్య, వివాహమునకు ప్రథమ కారణమగును. తృతీయమందున్న గ్రహములు, బుధుడు వీరి వివాహమునకు కారకులగుదురు. పాపదృష్టినొందిన అతిగా మాటాడువారు, సణుగుట, మరుపు ఎక్కువగా నుండువారగుదురు.

కర్కాటము సప్తమ భావమైన వివాహము తల్లిదండ్రుల యిష్టానుసారము జరుగును. వాని భార్యకు గృహమందభిమానముండును. ఇట్టి జాతకుల చతుర్థ భావమునందలి గ్రహములచే ఫలముల నిర్ణయింపవలెను. ఈ దంపతులు జాగరూకత, వివేకము, పొదుపు, ఆదరణ, దూరదృష్టి గలవారగుదురు. కుటుంబ క్షేమము వీరికి ముఖ్యము.

సింహము కళత్రభావము కాగా ప్రేమప్రధానమగు దాంపత్యము ప్రాప్తించును. భార్య అనుకూలవతియై గౌరవ మర్యాదలు గలిగియుండును. దురభిమానము, పరస్పర గౌరవము, గణ్యత వివాహమునకు ప్రధానలక్ష్యములు. పంచమమందున్న గ్రహముల ప్రేరణచే వివాహము నిశ్చయమగును. ఆటలు, పాటలు, నాటకములు, ఇతర ఆనందదాయకమగు క్రీడలు వీరి నాకర్షించును. సంచమమునకు పాపము వాటిల్లిన వీరి సంసారజీవితము దుర్భరమగును.

కన్య సప్తమభావమైన దంపతులు వ్యాధిగ్రస్తులగుదురు. వీరి భార్య బంధువుల కుటుంబమునకు చెందియుండును. ఆమె అనుపూర్వికయై సద్దై, క్రమనడివడిగలదై యుండును. వీరి వివాహము అధికార స్థానముపై నాధారపడియుండును. బుధుడు ఈ దాంపత్యమునకు అనుకూలుడైన శుభముకల్గును.

తుల సప్తమభావమైన దాంపత్యము శోభ గలిగి యుండును. ఈ దంపతులు కళాభిమానులు. శుక్రుడు శుభదృష్టినొందిన వానిభార్య సౌందర్యవతి, శాంతము కలది, కళలందు నేర్పరి, సంగీతమందభిమానము గలదిగానుండును.

వృశ్చికము సప్తమభావమైన వారి సంసార జీవితము రసవంతమగును. దంపతులలో ఒకరికంటే మరొకరు ఉన్నత స్థాన మాక్రమింప నభిలషింతురు. వీరికి సంసార సుఖము తక్కువ. కుజుడు లగ్నమందున్న ధనాశ మెండుగా నుండును. తగదాల యందు ప్రీతిగలిగి యుండును. అష్టమమందలి గ్రహములచే వీరి జీవిత ఫలముల నెరుగగనగును.

ధనస్సు సప్తమముకాగా కుటుంబ గౌరవము, వంశ మర్యాద మతాభిమానము వీరి వివాహ నిశ్చయమందు ప్రాధాన్యత వహించును. బంధువులు వివాహమునకు కారణమగుదురు. భార్యాభర్తలు అన్యోన్య అనురాగములు కలవారగుదురు. వీరికి దైవభక్తి మెండు. గురుని స్థితిచే వీరి దాంపత్య సుఖముల నిర్ణయింపవలెను. పాపసంబంధము గల్గిన ధన నష్టము నిచ్చును.

మకరము కళత్రభావమైన వానిభార్య ప్రాపంచిక జ్ఞానముకలది, యుక్తిగలది; సంచిత భావము గలది యగును. ఈ దంపతులకు తరచు వియోగముకల్గును. అనుమాన పిశాచము వీరిని ఎల్లప్పుడు బాధించుచుండును. దయాదాక్షి

ణ్యములు తక్కువ. శని స్థితిచే వీరి దాంపత్య జీవితము నిర్ణయించుట శాస్త్ర సమ్మతము.

కుంభము కళత్రభావమైన వానిభార్య పరకుటుంబమునకు చెందియుండును. వీరి దాంపత్యమునందు అభిమాన దురభిమానములు సమానములు. అకస్మాత్తుగా సంభవించు సంఘటనలుండును. స్వతంత్రాభిలాషచే వీరి దాంపత్య జీవితము దుఃఖదాయకమగును. లాభభావమునందున్న గ్రహములచే వీరి సంసార మార్గ మెఱుఁగ వచ్చును.

మీనము కళత్రభావమగు దంపతుల సంసార మర్మము తెలియుట కష్టము. దంపతులలో నొకరు దాంపత్య ధర్మముల నతిక్రమింతురు. దైవప్రేరణ, దైవాభిమానములచే వివాహ బంధమేర్పడును. ద్వాదశ భావమందున్న గ్రహముల నాధారము జేసుకుని వీరి దాంపత్య జీవిత రహస్యముల నెరుగవలెను. వీరి దాంపత్య మార్గము నిర్ణయించుట యందు జాగ్రత్త నవలంభింపవలెను.

సప్తమాధిపతి పంచమమందున్న ప్రేమ ప్రధానముగా వివాహమగును. సప్తమాధిపతి షష్టమందున్న భార్య వ్యాధి గ్రస్థురాలగును. సప్తమాధిపతి సప్తమమందుండుట శుభము. అష్టమమందుండి పాప సంబంధము గల్గిన భార్య త్వరలో మరణించును. భాగ్యమందున్న ఆ దంపతులు తీర్థయాత్రలు సేవింతురు. ద్వాదశమందుండుట అశుభము. కుజుడు ద్వితీయ మందున్న భార్యకు అనారోగ్యము, వివాహానంతరము స్వకుటుంబమునుండి విడిపోవుట ప్రాప్తించును. చతుర్థమందు కుజుడు దోషించిన ద్వికళత్రయోగము. పుత్రభావమందు కుజుడున్న ఆలస్యముగా సంతానము కలుగుట, లేక పురుష సంతానము లేకుండుట సంభవించును. స్త్రీలకు గర్భస్రావము కలుగును. కళత్రభావమందు కుజుడున్న ఆలస్యముగా వివాహమగుట, సంసార సౌఖ్యము కొరతవడుట గల్గును.

కళత్ర భావమునకు సంబంధించినంతవరకు కుజుని ప్రేరణచే ప్రాప్తించు ప్రధాన విషయముల సంగ్రహముగా తెలిపియున్నాను. ఇతర గ్రహములు, వాటి సంబంధ హేతువులగు విషయములు గూడ కొంతవరకు విశదపరుపబడినవి. కళత్ర భావవిచారణ జీవితమందు ప్రధానస్థాన మాక్రమించును. కాన అందరి మంచిచెడులు శాస్త్రసమ్మతముగాను విపులముగాను పరిశీలించి, నిశ్చయించినగాని సంసారసుఖము ప్రాప్తించదు. కాన వివాహ నిశ్చయమునకు పూర్వము శాస్త్ర విధానముగా వధూవరుల జాతకముల సమగ్రముగా పరిశీలించుట యవసరమని గ్రహింపవలెను.

## మనవి

"భారతి" రచయితలకు మనవి ఒకటి చేయవలసివచ్చింది. ఇది "భారతి"లో ప్రకటించే రచనలను గురించి.

"భారతి"లో ప్రచురించే రచనలు ప్రత్యేకంగా "భారతి" కి మాత్రమే రచయితలు పంపడం జరుగుతూ వుంది. ప్రచురించినవి, మేము కోరిన మీదట వచ్చినవి కావచ్చు. రచయితలు తమకు తామై పంపినవి కావచ్చు; మొత్తం మీద ఇవి మొదటిసారి "భారతి" ద్వారానే వెలుగు చూడడం జరుగుతూ వచ్చింది. తరువాత అవి గ్రంథరూపంలో రావడం జరిగితే, మొదట "భారతి"కి సౌజన్యం తెలిపే సాంప్రదాయం పాటించబడుతూ వచ్చింది. కాని ఈ మధ్య ఈ ప్రాథమిక సౌజన్యాన్ని అనేకమంది పాటించడం లేదు. కొందరు "భారతి"కి తమరచనలను పంపుతూ, అప్పుడో అంతకుముందో పుస్తకరూపంలో తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారు. ఒక్కొక్కప్పుడు ఇంచుమించు కొద్దిరోజుల తేడాతో ఆ రచన "భారతి"లోను, పుస్తకంలోను రావడం జరుగుతూవుంది. ఇది సౌజన్యంతో కూడిన పనికాదని చెప్ప సాహసిస్తున్నాము.

"భారతి" కాపీరైట్ హక్కును గురించి చెప్పడంలేదు. కేవలం సామాన్య సౌజన్యాన్ని కోరుతూ వుంది. అంతకంటే కూడా తన సాహిత్య సేవను వెల్లడి చేయమని కోరుతూవుంది. ఈ కోరికను రచయితలు మన్నించవలెనని మనవి.

—సంపాదకుడు.

# సమానత్వ సిద్ధాంతాలు

శ్రీ లార్డ్‌లయనల్ రోబిన్స్

సమానత్వం అనేపదం సమకాలిక నినాదంగా వుంది: సర్వం సమానంగా వుండాలనేది ఈ తరం ప్రత్యేకలక్షణం: అతివాదఉద్యమంలో అంతర్భాగమైన ఇతరత్రా భావాలకు రూపకల్పన జరగడమో, లేదా, వాని ఆకర్షణశక్తిని కోల్పోవడమో జరిగిపోయింది. జాతీయకరణ అనే దానిమీద ఆకర్షణీయంగా వుండే మేలిముసుగు తొలగిపోయింది. కాని సమానత్వం అనే భావనను గురించి ఇంకా అలా జరగలేదు. అతివాదుల మనుకునేవారు వాంఛనీయమని భావించేటంతగా, మనం సమానత్వసాధనలో ముందుకు పోయినా (అదెలా జరిగిందీ ముందు ముందు వివరిస్తాను) వారి హృదయాలలో మాత్రం సమానత్వ సాధనేచ్ఛదే ఇంకా పైచేయిగా వుంది: సోషలిజం అనేది సమానత్వానికి సంబంధించినదని ప్రొఫెసర్ లీవిస్ చెప్పాడు. శ్రీ కోల్డార్ వ్రాసిన ఆకర్షణీయమైన గ్రంథం An expenditure tax కూడా ఈ భావప్రేరణతో వ్రాసిందే. మొత్తంమీద సమానత్వమనేది సాధించవలసిన ఒక ఆశయంగా మనకాలపు ప్రధానసమస్యగా ముగ్గులోవుంది. అయితే కొన్ని వర్గాలలో ఇది, పరభాగ్యోప జీవితకాంక్షకు (Snobism) ప్రాతిపదికగా వుంది. సర్వం సమానంగా వుండాలనే నినాదానికి అంగీకరించనివారిని, ఒకవిధంగా నైతికంగా తక్కువస్థాయిలో వున్నట్టు పరిగణించడం జరుగుతూవుంది.

ఈ సమస్యను మన మిస్సాము వాస్తవికదృష్టితో చర్చించాలంటే, కొన్ని వ్యత్యాసాలను పరిగణించడం అవసరం: సమానత్వం అనేదానిని ఒక ఆశయంగా తీసుకుంటే, దానికి విభిన్నమైన అర్థాలు వుండగలవు. వీటిని ముందుగా స్పష్టంగా విడదీసుకుంటే తప్ప, నిరుపయోగమైన వాదన, తికమక సంభవం కాగలదు. ఒకరకమైన సమానత్వానికి అనుకూలంగా, మరొకరకమైన సమానత్వానికి సంబంధించిన వాదోపవాదనలు గుప్పించి, విపరీతమైన ఆవేశం పుట్టేటట్టు చేయడం చాలా సులభం. ఉదాహరణకు ఒక వ్యక్తికంటె మరొకవ్యక్తి అదనంగా సంపాదించకుండా నిరోధించడానికిగాను, వారి వారి జాతిని లేదా శరీరాన్ని జుట్టును రంగును ఉదాహరించి, సందర్భానుసారంగా వాదన చేయవచ్చు. మహిళలు పురుషులకువలెనే సమానస్థాయిలో వైజ్ఞానిక వృత్తులలో ప్రవేశించడాన్ని నిరోధించడం అన్యాయమని మీరు భావించినప్పుడు, అదే ప్రాతిపదికమీద, విభిన్నవ్యక్తులు భిన్నరకాల ఆస్తి పాస్తులను

కలిగివుండడం అన్యాయమనే భావంకూడా మీలో వుండితీరాలని తలంచబడుతుంది.

కనుకనే, నేను గమనిస్తున్న దానిని బట్టి, ఆరంభంలోనే సమానత్వానికి సంబంధించిన స్థూలమైన మూడు వ్యత్యాసాలను చట్ట సమానత్వం, అవకాశ సమానత్వం, ఆదాయం-సంపద సమానత్వం-అనేవానిని గమనించడం అవసరం. ఇందులో నేనిప్పుడు చర్చించదలచినది ఆదాయం-సంపద సమానత్వం, దాని విభాగాలను గురించి మాత్రమే. అయితే ఈ చర్చలో ఈ మూడింటి స్థానాన్ని గురించి ముందుగా ఒకటి రెండు మాటలు చెబుతాను.

## 2

ముందుగా చట్ట సమానత్వం (Equality before law) సంగతి చూద్దాం. ఇది వాంఛనీయమని ఇప్పుడు పెద్దగా వాదించవలసిన అవసరం లేదు. నాజీల ఓటమి తర్వాత ఇదెక్కడా వివాదాంశంగా లేదని చెప్పడం సరికాదు. చట్ట అసమానత్వమనేది కొనసాగే ప్రాంతాలు ఇంకా చాలా వుండడమే కాక, కొందరు మేధావులు దానిని సమర్థించడంకూడా జరుగుచున్నది. దక్షిణఆఫ్రికా ప్రధాని డాక్టర్ వెర్వోర్డ్‌కు ఈ రకమైన సమానత్వంమీద నమ్మకంలేదు. పరిపాలనా ఏర్పాట్లలోకూడా ఒకే ప్రతిపత్తిలో వున్న విభిన్నమైన తెగల వారిని విభిన్నంగా చూస్తున్న సందర్భాలు కూడా బ్రిటన్‌లో వున్నవి. అద్దెల కంట్రోలుకు సంబంధించిన చరిత్ర ఇందుకు ఉదాహరణ. దానిని తొలగించడానికి కూడా కృషి జరిగింది. ఏమైనప్పటికి బ్రిటన్‌లో, కనీసం సుహృద్భావ ధోరణికల వర్గాలు, చట్ట సమానత్వం మూలసూత్రాలను కాదనడంలేదని స్థూలంగా చెప్పుకోనవచ్చు.

అయినప్పటికి ఈ రకమైన నమ్మకానికి గల కారణాలను వివరించడం అవసరం. ఇందుకు సంబంధించిన యోచనలలో ఒక మక చాలా వుంది: ఈ నమ్మకం జీవన సమానత్వ (Biological equality) సూత్రాలమీద ఆధారపడి ఏర్పడింది కాదు. ప్రకృతిలో జంతువులుకాని వృక్షాలుకాని ఏ విధమైన సమానత్వాన్ని సూచించడం లేదు. మానవులసంగతి ఇందుకు విరుద్ధమని అనడం అతిశయోక్తి కాగలదు. మామూలు అనుభవంకూడా విభిన్నత్వాన్ని తెలియజేస్తూవుంది. వయోజనులలో కానవచ్చే విపరీత వ్యత్యాసాలకు కారణం ప్రకృతి అనడంకంటె, వారి పెంపకంలో వచ్చిందనడం సబబుకాగలదు. ఇందువల్ల ఏర్పడే అసమానత్వాన్ని తొలగించడానికి సహేతుకమైన కృషి శక్తికొలదీ జరగవలసి వుంది. అయితే మానవులలోని వ్యత్యాసాలన్నింటికి మూలం వారి పెంపకంలో వుందని అనడం మనను మనం మోసం చేసుకోనడమే అవుతుంది. పసితనం మొదలు పెద్దతనంవరకు ఎంతగా విద్యాబోధం చేసినా విద్యార్థులందరూ అగ్రశ్రేణిని, లేదా ద్వితీయ శ్రేణిని అందుకోనలేరనేది ప్రతి ఉపాధ్యాయునికి అనుభవైకవేద్యం: దీనిని ఎవ్వరైనా ఎలా కాదనగలరో నాకు ఆశ్చర్యంగావుంది. చట్ట సమానత్వమనేది, మేధాశక్తినిబట్టి మినహాయింపులతో అమలు జరపాలంటే, మానవులలో అర్హులైన వారెందరు అనర్హులుగా మిగిలిపోగలరనేది ఆలోచించడం అవసరం.

చట్టంఅనేది ఒకటి వుండడం స్వేచ్ఛా సమాజానికి ప్రధానలక్షణం. నిరంకుశత్వం సాగే సమాజంలో అది వుండదు. సమాజంలో భౌతికంగాను, మానసికంగాను వ్యత్యాసాలు వున్నంతమాత్రాన, చట్టం అమలు జరగడంలో వీనిని పరిగణించడం సమర్థనీయంకాదు. నేరం చేసినందుకు శిక్షించడంలోను, కంట్రాక్టు బాధ్యతలు అమలు జరపడంలోను, అతడు మేధావంతుడా లేక సామాన్య కార్మికుడా అనే దానినిబట్టి చట్ట నిబంధనలు విభిన్నంగా పనిచేయవు. ఇలా విభిన్నంగా చట్టం అమలు జరగాలనడం లిబరల్ సమాజ ప్రాతిపదికకు వ్యతిరేకం. మానవులలో ఎవరు "చట్టానికి అతీతులు", ఎవ్వరు "చట్టానికి లోబడినవారు" అనేది మనమెలా చెప్పగలం? ఇంత బృహత్తరమైన బాధ్యతను ఎవ్వరు భరించగలరు?

## 3

అవకాశ సమానత్వ (Equality of opportunity) సూత్రాలకు సంబంధించిన పరిస్థితి ఇంత సులభంకాదు. ఈ సూత్రంకూడా వాంఛనీయమైనదేనని అంగీకరించడానికి మనలో చాలామంది సిద్ధంగా వున్నారు. ఏదో ఒక చట్టనిబంధన, లేదా, కులసంబంధమైన నిషేధాలతో ఒక యువకునికి నిర్ణీతమైన ఉద్యోగానికి అవకాశాన్ని నిరాకరించడం అన్యాయమని, అవాంఛనీయపద్ధతి అని మనం తప్పక అంగీకరిస్తాము. ఇది చట్ట సమానత్వం అనే మూలసూత్రాన్ని కాదనడమే ననికూడా అంగీకరిస్తాము. ఇతరత్రా అన్నిరకాల సమర్థతలు వున్నా, కుటుంబపరిస్థితులు కారణంగా, సోదరసభ్యులతో పోటీ చేయడాన్ని ఒకరికి నిరాకరించడమనేదికూడా దురదృష్టకరమైన పరిస్థితి అనికూడా మనమంతా ఏకీభవిస్తాము. ఇలాంటి పరిస్థితులు నైతికంగా అవాంఛనీయమైనవిగా తలపోస్తాము. అంతే కాదు. ఆర్థికంగా ఇది అసమర్థతకు దారితీస్తుంది: స్వల్పసంఖ్యలో లభించే మేధావులను ఉత్తమంగా వినియోగించుకోనివ్వదు. అందువల్లనే ప్రభుత్వం ఇప్పటికంటె విరివిగా తగిన చర్యలు తీసుకోవాలని, కుటుంబాల రాబడికి అదనపు మొత్తాలనుచేర్చి, కుటుంబ ప్రోత్సాహాన్ని మరింతగా పెంచడానికి కృషి చేయాలనికూడా మనలో అనేకమందిమి కోరుతున్నాము. ఉపాధ్యాయులుగా జీవించేవారికి, ఇది వారి విధ్యుక్త ధర్మాలలో ఒక భాగమనికూడా తెలుసు.

ఒక ఆశయంగా, ఆశయసాధన విధానంగా ఇది స్వతహాగా వాంఛనీయమని మనం పరిగణించినా, ఇదే అంతిమలక్ష్యమని అంగీకరించడానికి మనలో పెక్కుమంది సిద్ధపడరని నాకు తెలుసు. అవకాశ సమానత్వం విస్తృతంగా వుండాలని మన వాంఛ. అయితే సమగ్రంగా ఈ ఆశయసాధనకు మిగిలినవన్నీ త్యాగం చేయాలనడానికి మనం సిద్ధంగాలేము: మన అభిప్రాయంలో కీలకమైన వ్యత్యాసాన్ని చూపుతున్నందున, దీనిని గురించి కొంత వివరించడం అవసరం.

వివిధ కుటుంబాల పిల్లలలో డబ్బుకు సంబంధించిన వ్యత్యాసాలు లేకపోయినా, వాతావరణం-విజ్ఞానికి సంబంధించిన ప్రయోజనాల వ్యత్యాసం కొంత అయినా వుంటుంది. అన్యోన్యంగా, లోకజ్ఞానంతో జీవించే దంపతుల పిల్లలకు వున్నరీతి మంచి అవ

కాశాలు, లోకజ్ఞానం లేకుండా అన్యో న్యత లేకుండా జీవించే దంపతుల పిల్లలకు వుండవు. అయితే ఈ రకమైన అసమాన త్వాన్ని సరిదిద్దడానికిగాను కుటుంబం అనే వ్యవస్థను విచ్ఛిన్నం చేయడానికి మనలో ఎంతమంది ఇష్టపడతారు? ప్లేటో మహా శయుడు చెప్పిందేమంటే, పోషణలో అస మానత్వం తొలగించడానికిగాను పిల్లలు పుట్టగానే తల్లిదండ్రులనుంచి వేరుచేయాలని సమష్టివాదులలో అలవాదులుకూడా ఆయన చెప్పినట్టుగా చేయడానికి తటపటా యిస్తు న్నారు. దీనికి సంబంధించినంతవరకు అవ్వా కావాలి- బువ్వా కావాలి అనే ధోరణిలో వున్నారు. మొత్తంమీద కుటుంబం అనే దానిని రద్దుచేయడం అనేది చాలా తీవ్ర మైన వాదన. కనుక దానిని గురించి వాదిం చడం వృథా శ్రమకాగలదు.

అయితే ఆచరణలో ఇంతకంటె ప్రముఖమైన ప్రాధాన్యం కలిగిన అంశాలలో ఆశయసాధనకు సంబంధించిన చిక్కులు రావచ్చును: ఉదాహరణకు కుటుంబాల నిధులను తగినంతగా పెంచడానికి ప్రయ త్నించడమనేది వుంది; సంపత్తి అంతగా లేని తల్లిదండ్రులకంటె, సంపత్తి కలిగిన తల్లిదండ్రులను కలిగివుండడంలో లాభం వుంది. అయినప్పటికి ఆస్తి-సంపత్తి సమా నంగా వుండాలనే స్థూలాభిప్రాయం కలిగిన సమష్టివాదికి మాత్రం, ఆ వాదన చేయ డానికి ఇదొక కారణంగా వుంది. ఇతరత్రా కారణాలవల్ల, ఇలాంటి సమానత్వానికి ఇష్ట పడనివారుమాత్రం, ఈ కారణాన చలించి, ఇంకా సమానత్వసాధనలో ముందుకు పోవడానికి ఇష్టపడరు. వారు చెప్పేదేమంటే- కుటుంబ రాబడులను సహేతుకంగా పెంచ డంద్వారా అవకాశ సమానత్వం సాధించ వచ్చు. అలాంటి దృక్పథాన్ని మేమూ విశ్వసిస్తాము. అయితే ప్రోత్సాహమిచ్చే కుటుంబ పరిస్థితులను పూర్తిగా స్తంభింప జేయడానికి మేము అంగీకరించము అంటారు. అంటే సాధించదలచిన ఆశయంపట్ల స్థూల మైన ఏకాభిప్రాయం వుంటుంది: కాని వాంఛనీయమైన ఇతర ఆశయాల సాధనలో పోటీగా ఈ అవకాశ సమానత్వసాధనకు ఎంతవరకు అవకాశమివ్వాలనే విషయంలో విభిన్నాభిప్రాయం వుంటున్నది.

## 4

ఇప్పుడు ఆదాయం-సంపద సమా నత్వం (Equality of income and wealth) సంగతి చూద్దాము: దీని వ్యవహారాలు విభిన్నమైనవి. పైన చర్చించినట్టుగా ఇది స్థూలమైన ఏకాభిప్రాయానికి వచ్చిన ఆశయ సాధనకు అనుసరించే విధానాలమీద విభి న్నాభిప్రాయాలకు సంబంధించినది మాత్రమేకాదు, అసలు ఈ ఆశయం అభిలష ణీయంకాదని కొందరు, అవునని కొందరు గట్టిగా వాదించుకోనడానికి సంబంధించి నదిగా వుంది. దీనిని వివరంగా పరిశీలించా లంటే, ఈ సమస్యను కొన్ని విభాగాలుగా విభజించడం మంచిది.

(1) ముందు ఆదాయ సమానత్వం గురించి పరిశీలన ప్రారంభిద్దాము. ఇతరత్రా సంగతులు రాకుండా వుండడానికిగాను, "పని చేసినందున వచ్చే ఆదాయం" గురించి మాత్రమే చర్చిద్దాం; "అనార్జిత ఆదాయం" (Unearned income) లేదా ఆస్తిమీద వచ్చే ఆదాయాన్ని గురించి. సంపదల

సమానత్వాన్ని చర్చించే సందర్భంలో పరిశీలించుకోవచ్చు.

ఈ నాడు అది ఆచరణ సాధ్యమను కున్నప్పటికీ, "పని చేయడంవల్ల వచ్చే ఆదాయాలలో సమానత్వ" ఆశయాన్ని సాధించుకోవాలని ఎంతమంది గట్టిగా కోరు తున్నారో నేను చెప్పలేను. గతంలో చాలామందికి ఈ దృక్పథం వుండేది. నా చిన్నతనంలో ఇందుకు సంబంధించిన ఆశయాలు రష్యాలో కమ్యూనిస్టు విప్లవ ఉదృతాన్నిబట్టి ఏర్పడ్డాయి; చాలామందికి అప్పుడు ఆ విధంగా ఈ దృక్పథం ఏర్పడింది. బెర్నార్డ్‌షా అప్పుడు గట్టిగా దీనిని గురించి వాదించాడు. (కాని ఆయన వృద్ధాప్యంలో, తనమీదకూడా పన్నులభారం విపరీతంగా వున్నకారణాన తనమీద ఆధారపడి జీవించేవారి జీతాలు పెంచడానికి నిరాకరించాడు.) ఆ తరం గడిచిపోయింది. ఆ తర్వాత చాలా పరిణామాలు సంభవించాయి: సర్వ సమానత్వం అనేదానిని-దాని అర్థం ఏమైనప్పటికీ—సమర్థించేవారి సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. నా మట్టుకు నేను, అవసరందృష్ట్యా కాని, లేదా, నైతిక లక్ష్యాల దృష్ట్యాకాని, సర్వ సమానత్వం అనేది ఆమోదయోగ్య మనుకోను.

అవసరందృష్ట్యా చూస్తే, కష్టపడి పనిచేసేవారికి-సోమరిపోతులకు; తెలివిగల వారికి-చవటలకు ఒకేరకమైన ప్రతిఫలాన్ని ఇవ్వడానికి హామీ ఇచ్చేవ్యవస్థ; నేడున్న పేదరికంతో కూడిన వ్యవస్థకంటె తక్కువ ఉత్పాదకశక్తి కలదిగావుండి ఇది తీరుతుంది: విజ్ఞులెవ్వరూ దీనిని సంతృప్తికరమైనదిగా పరిగణించరు. డబ్బు ఇవ్వడమనేది మాత్రమే ప్రోత్సాహకారమనే ధోరణిలో నేను వాదించడంలేదు. శాస్త్రజ్ఞుల, సాంఘిక సంస్కర్తల ఉత్తమ కృషిఫలితం, డబ్బుకు సంబంధించిన ప్రతిఫలాన్ని కోరకుండా ఎన్నో ప్రయోజనాలను సమకూరుస్తుందనే దానిని నేను కాదనడంలేదు. కాగా నా వాదన ఏమంటే అనేక ఉద్యోగాలలో అంతర్గతమైన ఇలాంటి విలువ వుండదు. కృషికి-ప్రతిఫలానికి మధ్య ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని ఏదో ఒకరకమైన సంబంధం వుండనప్పుడు, ప్రపంచ వ్యాపారరంగంలో దైనందిన వ్యవహారాలు ఉత్తమంగా జరిగి పోగలవని భావించడానికి వీలులేదు. ఇది ప్రయివేటు ఆస్తి-మార్కెట్ స్వేచ్ఛవున్న సమాజాలలోనేకాక, కమ్యూనిస్టు సమాజంలోకూడా వాస్తవమని సోవియట్‌రష్యా అనుభవాన్నిబట్టి స్పష్టమైపోయింది.

ఇక నైతికలక్ష్యాల దృష్టితోచూస్తే, సమానత్వ ఆశయం తప్పనిసరి అని నాకు అనిపించడంలేదు; రాబడులను - కృషివల్ల రావలసిన ప్రతిఫలాలను ఏర్పరచడంలో నైతికంగా వుండే ప్రత్యేకమైన ఆకర్షణ ఏదీ నాకు కనిపించడంలేదు. అంతేకాదు. నేను సమర్థించే అవకాశ సమానత్వానికి, నేను నిరాకరించే ఆదాయ సమానత్వానికి మధ్య స్పష్టమైన వైరుధ్యంకూడా నాకు కానవస్తున్నది. సమానమైన బహుమతులు పొందడానికి సమానమైన అవకాశాలు—. అనేదానిలో మేధావులను, సాంఘిక చైతన్యం కలవారిని నిజంగా ఆకర్షించేది ఏమి వుంది?

(2) పోతే సంపదవల్ల వచ్చే ఆదాయం, ఆస్తి-పాస్తులు కలిగివున్నందున

వచ్చే రాబడి సమస్యలు చూద్దాము. ఇందులో సమానత్వానికి సంబంధించిన ఆశయం ఏమిటి ?

సంపాదించినదానిని ప్రయివేటుగా నిల్వ చేసుకోవడానికి అనుమతించినప్పుడు, కలిగివుండడమనేదానిలో అసమానత్వం అనేది తప్పక వస్తుంది. ఇది ఖాయం. అంతే కాదు అలా నిల్వచేసుకున్న మొత్తాలను పెట్టుబడిగా పెట్టినప్పుడు తద్వారాకూడా ఆదాయాల అసమానత్వం వస్తుంది; ప్రయివేటు ఆస్తులనేవి, వాటి యజమానుల మరణానంతరం ప్రభుత్వపరం అయ్యే ఏర్పాటు చేసినప్పటికి, ఈ పరిణామాలు తప్పనిసరి. ప్రజలలో పెక్కుమందికి పెక్కు రకాలుగా పొదుపరితనానికి సంబంధించిన అభిలాషలు వుంటాయి. సంపాదనలలో అసమానత్వం అనేది వున్నప్పుడు, ప్రజలలో విభిన్న రకాలుగా పొదుపరితనానికి సంబంధించిన శక్తులు వుంటాయి: పొదుపు అనేది జరిగినప్పుడు విభిన్న రకాల ఆస్తులు, కిమ్మతులలో విభిన్న రూపాలు పొందుతుంది: మరణానంతరం ఈ ఆస్తి మరొకరి పరమైనప్పుడు, అసమానత్వానికి దారితీసే అవకాశాలు మరికొన్ని వుంటాయి. విభిన్న రకాలవారు, విభిన్నమైన వారసత్వాలను పొందుతారు. అయితే, ఇందులో ప్రధానాంశాన్ని మాత్రం స్పష్టం చేసుకోవాలి. అసలు ప్రయివేటు ఆస్తి అనేదానికి అవకాశ మిచ్చినప్పుడు, ఎంతో కొంతగా అసమానత్వం వుండడం అనేది తప్పనిసరి. సర్వ కాలాలలోను, సర్వ విధాలా సమానత్వం వుండడమనేది అసంభవం. కనుక, నావలెనే మీరుకూడా, ఎంతో కొంతగా ప్రయివేటు ఆస్తి వుండటం మంచిదనే భావంతో వున్నప్పుడు, అది వికేంద్రీకృతమైన ప్రోత్సాహాలను పెంచి, స్వేచ్ఛలకు రక్షణ సమకూర్చగలదని విశ్వసించినప్పుడు, సమానత్వం అనే ఆశయానికి వ్యతిరేకమైన మరొకరకమైన సాంఘిక లక్ష్యాన్ని కోరుతున్నట్టుగా తెలిసిపోతున్నది.

ఇది తెలిసినందునే, సమానత్వవాదులు ప్రయివేటు ఆస్తి అనేది దాదాపు లేకుండా చేయాలన్న ప్రచారాన్ని ప్రారంభించారు. ఈ విధంగా చేసినప్పుడు ఉత్పాదక వ్యవస్థ సవ్యంగా వుంటుందా లేదా అన్న సంగతి అలావుంచి, అది కనీసం ప్రయివేటు సంపదల అసమానత్వాన్ని అయినా తొలగించగలదని చెబుతున్నారు అంతా తలక్రిందులయినా సరే, న్యాయంమాత్రం జరిగితీరాలంటారు. అయితే ఇలాంటి సమష్టి వ్యవస్థలో దక్షత వుండదని మీరు భావిస్తే, నిరంకుశ ప్రభుత్వ పాలకులచేతిలో ఇలా అధికార కేంద్రీకరణ జరగడంవల్ల, రాజకీయ స్వేచ్ఛ, నిజాయితీ, ప్రోద్బల శక్తులు సమసిపోగలవనే అభిప్రాయానికవస్తే (ఇలా జరగగలవనేది తగిన ఆధారాలతో ధృవపరచవచ్చు) అసలుజాడ్యం కంటె (సంపదల అసమానత్వం) దాని నివారణ మార్గం (ప్రయివేటు ఆస్తుల రద్దు) మరింత దారుణమైనదనే నిర్ణయానికి మీరు రావలసివుంటుంది. ఆర్థిక సమానత్వానికి సంబంధించిన భావాలను పునఃపరిశీలన అవసరం వుంటుంది.*

అయితే, ఇదంతా తర్కంతో తేల్చుకుంటున్న అతివాద-మితవాద ధోరణులుగా వున్నాయి. ఆచరణలో మాత్రం, ఈనాడు వామపక్షీయులలో హెచ్చుమంది తమ ఆశయాలను ఇంత తలక్రిందులుగా మార్పుచేసు

కొనడం అనేది అనుమానాస్పదం. సాంప్రదాయ సిద్ధమైన నినాదాలను పునశ్చరణ చేయడంవల్ల వారికి మానసికమైన సంతృప్తి వుండవచ్చు కాని నావలెనే వారిని సవాలు చేసినప్పుడు, ఇంత పచ్చిభావాలు తమకు లేవని, అలా మనం చిత్రిస్తున్నామంటూ మనను గట్టిగా నిందించడం జరుగుతుంది. ఉత్పత్తికి-రాబడికి మధ్య ఏదో ఒక రకమైన సంబంధం వుండాలన్నంతవరకు వారు అంగీకరిస్తారు. చివరకు సమష్టి వ్యవస్థలో కూడా, ఎంతోకొంతగా ప్రయివేటు సొముపరితనం వుండవలసిన ఆవశ్యకత కలదంటారు చివరకు రష్యాలోకూడా మరణాంతరం వారసులకు ఆస్తి దక్కడమనేది కొంతవరకు అనుమతించారు.

## 5

దీనినిబట్టి చూస్తే, సమకాలీన పరిస్థితులలో రాజకీయ అవసరాల దృష్ట్యా, అసలు సమస్య పూర్తి సమానత్వం అవునా-కాదా అనేది కాక, ఎంతగా సమానత్వాన్ని లక్షించాలి, ఎంతగా అసమానత్వానికి (ఆయా రకాల ఆదాయాలు - సంపదలలో) అనుమతించాలి అనేది అసలు సమస్య అవుతున్నది. ఇది అంతగా ఉత్తేజకరమైన ప్రశ్న కాదు. అయినప్పటికీ దీనిలోకూడా చర్చకు-విభిన్నాభిప్రాయాలకు కావలసినంత అవకాశంవుంది.

నిర్ణీతమైన సమస్యలను తీసుకొని పరిశీలన చేయడానికి ముందు, ప్రస్తుతం మన దృష్టిలో వుంచుకున్న పరిమితమైన ఆశయానికి సంబంధించిన స్థూలమైన అంశాలు కొన్ని స్పష్టం చేసుకోవలసి వుంది. ఆదాయాలు, సంపదలలో పూర్తి సమానత్వం ఎంతవరకు తగ్గించడం అనేదానిని మనం సమర్థించగలం అనేది పరిశీలించుకోవాలి. ఇది ఇదమిత్థమైన సమాధానం ఇవ్వగల ప్రశ్న కాదు. ఎందుచేతనంటే, ఈ దృష్టిలో సమానత్వం అనేది విశిష్టమైన అనుబంధాలకు సంబంధించినదిగా వుంది. అసమానత్వాలలో లెక్క లేనన్ని రకాలు వుండడం, అందులో కొన్నింటిని మనం సహించదలచడం, కొన్నింటిని సహించకపోవడం కూడా ఇందుకు కారణంగా చెప్పుకోవచ్చు. అయితే సమకాలీనమైన వాస్తవిక పరిస్థితులను బట్టి, మనలో కలిగే భావాలకు అనుగుణంగా స్థూలమైన కొన్ని నిర్ణయాలకు మనం రావచ్చునని నేను అనుకుంటున్నాను.

ముందుగా మనకు వున్న ఆర్థిక వ్యవస్థను బట్టి, కటిక పేదరికాన్ని, ఈతిబాధలను తొలగించడానికి ఉద్దేశించే చర్యలను మనలో చాలామంది ఆమోదించగలరు. అంతేకాదు. నేను ఇదివరలోనే వివరించినట్టు, ఆరోగ్యం-విద్య మొదలగు వసతులలో కుటుంబాల ఆర్థిక స్తోమతను పెంచి, అవకాశ సమానత్వ సాధనకు తీసుకొనే తీవ్రమైన చర్యలనుకూడ మనం సమర్థించగలం. ఇలాంటి చర్యలన్నీ తలసరి ఆదాయాలలో హెచ్చు సమానత్వం సాధించడాన్ని లక్షిస్తాయి. ఇలా ఆదాయాల సమానత్వాన్ని సాధించడాన్ని మనం కాదనముకూడా. అయితే ఇలాంటి సమానత్వ సాధనకు ఉద్దేశించిన ఏర్పాట్లు విభిన్నంగా వుంటాయి కనుక, సుహృద్భావ దృక్పథం కలవారిలో కూడా ఏకాభిప్రాయం లేకపోవడం సహజం. అలా అని సమానత్వ సాధన ధోరణిని వారు ఎన్నడూ కాదనరు. ఇలా ఆదాయాల పెంపకానికి సంబంధించిన చర్యలలో వుండన్ని వ్యతరేకత, అసమానత్వం

తగ్గించాలనే లక్ష్యంతో ఆదాయాలను కత్తిరించడానికి తీసుకొనే చర్యలకు మాత్రం వుంటున్నది. ఈచర్యలకే మరొకపేరు అభ్యుదయకరమైన పన్నుల విధానం. దీనినిగురించి కొంత పరిశీలన చేసినప్పుడు కాని ఇందుకు సంబంధించిన అంశాలు స్పష్టంగా అవగాహన కావు.

నాకు తెలిసినంతవరకు అభ్యుదయకరమైన పన్నులవిధానం అనేదానిని (1) ఉమ్మడి భారాన్ని పంచుకొనే సాధనంగాను (2) అసమానత్వాన్ని తగ్గించేమార్గంగాను సిఫారసు చేయవచ్చు. వీనికి సంబంధించిన ప్రాతిపదికలు విభిన్నంగా వున్నవి. వీని మధ్య వున్న వ్యత్యాసం అనేదానిలోనే రాజకీయ ధోరణులకు సంబంధించిన విపరీతమైన అగాధం కూడా వుంది.

ఉమ్మడి భారాన్ని పంపిణీచేసే సాధనంగా అభ్యుదయకరమైన పన్నుల విధానాన్ని వామపక్షీయులు కానివారు కూడా సులభంగా ఆమోదించవచ్చు. ప్రజోపయోగంకోసం అని పెట్టే పెట్టుబడిలోను, ఖర్చులోను ప్రయోజనం అనేది ఉన్నప్పుడు దాని భారాన్ని అందరూ పంచుకొనడానికి సిద్ధాంతరీత్యా ఎందుకు అభ్యంతరం చెప్పాలో నాకు అర్థం కాదు. ఇందులో నైష్పత్తిక సూత్రం (Proportional principle) అనేది వుంది. దానిని ఆమోదించినవారు కూడా నిర్ణీతమైన మినహాయింపును (Exemption limit) అంగీకరిస్తారు. ఆ మినహాయింపు హద్దు దాటిన తర్వాత, గణితశాస్త్రరీత్యా, నైష్పత్తిక సూత్రం అమలులోకి సహజంగా వస్తుంది. అదే అభ్యుదయ క్రమగతిని సూచిస్తుంది. ఈరకంగా, ఈ రకమైన ప్రయోజనం కోసం అభ్యుదయ క్రమాన్ని అనుసరించడం నైతికంగా మంచిదని, లోకజ్ఞానంతో కూడిన పని అని నాఅభిప్రాయం. ఈ కారణాన దీనిని ఇలా సమర్థిస్తున్నంత మాత్రాన, ప్రోత్సాహకరమైన పరిస్థితులను సృష్టించడానికి అభ్యుదయకరమైన పన్నుల విధానం ఏయే హద్దులలో వుండాలనే దానిని గురించి చర్చించడానికి అవకాశం లేదంటే నేను అంగీకరించను.

పోతే, అభ్యుదయకరమైన పన్నుల విధానాన్ని అసమానత్వాన్ని తగ్గించడానికి కూడా వినియోగించవచ్చు. దీనికి సంబంధించిన ప్రాతిపదికలు కూడా అస్తవ్యస్తంగా వున్నాయి. సూత్ర రీత్యా దీనిని మనం ఆమోదించమని ఎల్లప్పుడూ చెప్పడానికి వీలుపడదు. విపరీతమైన అసమానత్వం ఉన్నప్పుడు పన్నుల విధానంద్వారా దానిని కొంతవరకు తగ్గించడమనేది రాజకీయంగా వాంఛనీయం కాగల పరిస్థితులు ఏర్పడవచ్చు. దీనిని కాదనడానికి వీలులేదు. అయితే సామాన్య దృష్టితో చూచినప్పుడు మాత్రం,ఇది నీతిబద్ధమైనదని నాకు అనిపించడం లేదు. అందరినీ సమానంగా (ఆదాయాలలో) తగ్గింపజేయడమనే మానసిక ధోరణి నీతిబాహ్యంగా వుంది. నిరంతరం పోలికల స్వభావాన్ని, ధోరణిని వ్యక్తం చేసే పౌరుడు, ఆ మాటకు వస్తే రాజకీయ వేత్త కూడా గమనింపదగిన వారు కాబోరు. ఎందుచేతనంటే, ఒక వ్యక్తి చేసే పనికి హెచ్చుజీతం వచ్చిన కారణాన, నిష్పత్తి ప్రకారం అతని సంపాదనలో హెచ్చు మొత్తాన్ని తీసుకొనడంలో ప్రశంసనీయమైనది ఏమీ వుందని నేను ప్రశ్నిస్తున్నాను? ఒకవైపున మార్కెట్ ద్వారా

హెచ్చు జీతాలు తీయడానికి అవకాశమిచ్చి మరొకవైపున పన్నుల విధానం ద్వారా దానిని తగ్గింపజేయడం, అదికూడా ప్రజోపయోగకరమైన సౌకర్యాలకోసం అని కాక, అతని సంపాదన హెచ్చు అంటూ నిర్ణీతమైన లక్ష్యం కోసం తెగించి, తీసుకోవడానికి సిద్ధపడే సమాజంలోని పరిస్థితులు పరస్పర విరుద్ధమైనవిగా వుండడం లేదా అని నేను అడుగుతున్నాను: ఇలా అనడంతో మార్కెట్‌లోని విలువలకు నేను అధిక ప్రాధాన్య మిస్తున్నాననే అపోహ పడకండి. నాకు అలాంటిభావమే లేదు. ఉదాహరణకు ఒక విద్యావేత్త గరిష్టవేతనం సాలుకు ఏ 3000 రూ. లకు తక్కువగా ఉన్నంత మాత్రాన, సినిమాతారలు, క్రీడా కారులు అంతకు 30-40 రెట్లు అదనపు సంపాదన చేసినంతమాత్రాన, నైతికంగా నేమి, సాంఘికంగా నేమి వీరు ఎక్కువని, వారు తక్కువని నేను భావించను వీరు అలా సంపాదించడాన్ని వీరు నిరసిస్తారనికూడా నేను తలంచను. నా అభిప్రాయం ఏమంటే ఓటర్లలో జీతభత్యాలు సంపాదించేవారిలో ఇలాంటి నిరసనభావం అసలు లేనే లేదని: కాగా ఆర్థికరంగంలో మేధావంతులైనవారు, బహుశా వంశ పారంపర్యపు ఆస్తుల పెట్టుబడిమీద వచ్చే రాబడులతో సుఖజీవితం గడిపేవారు మాత్రమే, ఏదో ఒక ఆందోళన తెచ్చిపెట్టుకోవడానికి తగిన అవకాశంకోసం వెదకుతూ వుంటారు.

నాకు సంబంధించినంతవరకు అభ్యుదయకరమైన పన్నుల విధానం వల్ల స్థూలంగా కానవచ్చే ఫలితాలను గురించి నాకు ఆట్టే ఆసక్తిలేదు. అయితే నేను గౌరవించేవారిలో కొందరు, హెచ్చురాబడి కలవారి సంఖ్యలో పెద్దగా కానవచ్చే తగ్గుదలచూచి అతిగా సంతోషించే వారు కూడా వున్నారు నేనుమాత్రం ఈ సంఖ్యలనుచూచి కాక, దైనందిన వాడకాలు, పట్టణం-పల్లెటూరులలో కానవచ్చే పరిసరాలు, ప్రయోగాలకు-వైవిధ్యాలకు అవకాశాలు తగ్గడం వగైరా ఫలితాలను బట్టి చూచినప్పుడు, దీనిలో నా కేలాంటి సంతోషం కలగదు. అయితే నాగరికతలోని విశేషాంశాలు ధనవంతులుచేసే ఖర్చుమీద ఆధారపడివుంటాయని నేను సూచించడం లేదు. ఇలా అనడం నేను చెప్పని అర్థంలో వ్యాఖ్యానించడం కాగలదు. అయినా కొన్ని విషయాలలో ఇదీ యదార్థమే: కళలు, విద్యావ్యాసంగానికి సంబంధించిన విషయాలలో ప్రయివేటు ప్రోత్సాహం అతి తక్కువ స్థాయికి వచ్చినందున ఏర్పడిన పరిస్థితి ఇందుకు నిదర్శనంగావుంది. బ్రిటన్‌లో ఇప్పటి ఉత్పాదకశక్తుల స్థాయినిబట్టి, సమానత్వ సాధనచర్యల ఫలితాలు నిరుత్సాహకరంగా వున్నవని చెప్పకతప్పదు.

## 6

చివరిమాటగా, భావధోరణుల, వాతావరణాన్ని గురించి మరొకసంగతి చెబుతాను నేను పైన చేసిన వివరణ యావత్తు విమర్శనాధోరణిలోను, వ్యతిరేక దృక్పథంలోను నడిచింది. అంతమాత్రాన ఎప్పుడైనా సమానత్వ సూత్రాలను, ఆశయాలను గురించి స్థూలంగా పొగుడుతూ మాట్లాడినప్పుడు, అతనిపట్ల నాకు సానుభూతి వుండదనుకుంటున్నారా? అలా ఎప్పటికీ కాదు. సానుభూతి వుంటుంది.

# సమానత్వ సిద్ధాంతాలు

చట్ట సమానత్వమనేది పశ్చిమ దేశాల సంప్రదాయాల ఉత్తమ లక్షణంగా వుంది: సుదీర్ఘంగా, పట్టుదలగా పోరాటాన్ని సాగించినతర్వాత మన పూర్వీకులు దీనిని సాధించారు. మనతరంలో నిరంకుశ ప్రభుత్వాలు ఏర్పడిన కారణాన, చట్ట సమానత్వాన్ని గురించి మనం నిర్లక్ష్యంగా వుండరాదని స్పష్టమవుతున్నది. అవకాశ సమానత్వమనేదికూడా ఉదారమైనది. విశాలమైనది: సృజనాత్మక శక్తులను పెంచేది దీనికోసమని, మిగిలినవన్నీ త్యాగం చేయడానికి, కుంచింప జేయడానికి మనం సిద్ధంగా లేకున్నంతమాత్రాన,- ఈ ఆశయానికి మనం విలువ ఇవ్వడం లేదనో, దాని సాధనకు సరళమైన మార్గంలో కృషి చేయడానికి మనం సిద్ధపడడంలేదనో అర్థం చెప్పుకొనరాదు. ఇక ఆదాయం-సంపదలకు సంబంధించినంతవరకు, కేవలం కత్తిరించాలన్న ధోరణిలో ఆదాయాలు, సంపదలు తగ్గింపజేయడాన్ని మనం వ్యతిరేకిస్తాము: ఈర్ష్యవల్ల, ద్వేషంవల్ల మనమిలా చేయడం లేదనికూడా చెప్పుకొనడం న్యాయం కాగలదు: అసమానత్వానికి జతపడివున్న తప్పుడు విలువలను గురించి విజ్ఞుడైనవ్యక్తి విచారించక మానడు: సౌజన్యధోరణి కలవ్యక్తి తనతో సమానమైన లేదా తనకంటె మెరుగైనవారితో కూడిన సమాజంలో హెచ్చు సంతృప్తిని పొందగలడు. తనను అందరికంటె ఘనునిగా చూడాలని ఆయన కోరడు. కాగా కృత్రిమమైన వర్గ విషచక్రాన్ని సృష్టించే పరిస్థితులకు సహజంగానే వైముఖ్యం చూపుతాడు. దీనిని అందరూ సానుభూతితోను, సుహృద్భావంతోను అర్థం చేసుకొనడం అవసరం.

ఈ కారణాలవల్ల వామపక్షీయుల పరిష్కారమార్గాలను సమర్థించేవారికి, వ్యతిరేకించేవారికి మధ్యవున్న తేడా-తప్పుడు విలువలపట్ల వారికిగల వైముఖ్యం వీరిలోనూ లేకపోవడంకాక, మరొక మార్గంద్వారా ఆ తప్పుడు విలువలను సవరించవచ్చునని సూచించడంలో వుంది: నిర్ణీతమైన లోపాలను, వాటిని సవరించగల నిర్ణీతమైన చర్యల ద్వారా పరిష్కరించాలికాని, సముద్దేశ్యాలతో కూడిన స్థూలమైన పరిష్కారమార్గాలను అనుసరించడంవల్ల, ఏ ఉత్తమ శక్తులను ప్రోత్సహించాలని మనం అభిలషిస్తున్నామో, ఆ ఉత్తమశక్తుల అభివృద్ధికి ఏమాత్రం అవకాశమివ్వని విధంగా సామాజికవ్యవస్థను మూసపోయడం ప్రమాదకరమని హెచ్చరించడంలో వుందని గమనించకోరుతున్నాను. [లండన్ లో "బవ్ గ్రూపు"వారు సమానత్వాన్ని గురించి జరిపిన విద్వద్గోష్ఠిలో శ్రీ రాబిన్స్ చేసిన ప్రసంగభాగాలు ఈ వ్యాసం]

---

# కవిత్వము - ఛందము

## శ్రీ కె. వి. రాఘవాచార్య

గత ఫిబ్రవరి నెల 'భారతి' లోని 'కవిత్వము—ఛందము'— అను నా వ్యాసమందలి కొన్ని దృక్పథములను మిత్రులు శ్రీ వి. రాజగోపాలరావు ఎం.ఏ. గారు మార్చి నెల, 'భారతి' లో పరిశీలించిరి. అందులకు వారికి కృతజ్ఞత చెప్పుకొంటూ, ఆ పరిశీలన లోని కొన్ని అభిప్రాయములను పరామర్శించుచున్నాను.

నన్నయ వసంత ఋతువర్ణన లయగ్రాహిలో గాకుండా, మరొక ఛందములో (వృత్తము?) యుండి యుండిన రస గ్రహణమునకు అంతరాయము కల్గియుండునా యను విషయమును యోచింపవలయుననిరి కాని యోచించి, ఒక నిశ్చితాభిప్రాయమునకు రాజాలరైరి! మరియు, వారు ఎఱ్ఱన, నన్నయల వసంత ఋతు వర్ణనల నుదాహరించి, పరిశీలించి "ఇరువురొనరించినది వసంతఋతు వర్ణనయే యైనను శబ్ద చిత్రములందలి భేదములవలన పాఠకుల మనో నయనముల యెదుట గోచరించు వసంత కాల దృశ్యము వేర్వేరుగనే కన్పట్టును" అనిరి. ఆ వసంత వర్ణనల ఉనికి, ప్రయోజనముల గమనించిన నాకు తోచిన భావము లివి :—

### ఎఱ్ఱన - వసంత వర్ణన

వ: ఇట్లా దంపతులు (సావిత్రీసత్యవంతులు) మంద గమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియంజొచ్చి రప్పుడు.

సీ: కమనీయ కమలినీ కల్లోల వీథుల
గదలు రాయంచల గతుల యొప్పు
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేటి గముల యులివు
బరి పక్వమంజుల ఫల రసోద్ధత ములై
పలుకు రాచిలుకల పటు రవంబు
ప్రియుడు వేఱువేఱ ప్రీతిమై జూపుచు
చెప్పుచును జనంగ చిగురుఁ బోడి
గనుచు వినుచు నిర్వికార సల్లాపమిం
పారనతని తెలుఁగు నరయు చుండె.

వ: తదనంతరంబయా రాజర్షి నందనుండు మధురంబు లగు ఫలంబులు గోయుచు .....

—భారతము. ఆరణ్య. 7 ఆ 212—214.

ఇందలి ప్రకృతి సౌంతర్యము యువ దంపతులగు సావిత్రీ సత్యవంతుల హృదయముల పై నెట్టి ప్రభావమును నెఱపలేక పోయినది! ప్రకృతి సౌందర్యమును దర్శించిన స్త్రీ పురుషులందు వికారమంకురించుట సహజము. ఇకనూత్న దంపతుల మాట చెప్పనేల? ఈ సహజ ధర్మ మనివార్యమనుటకు లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే పలికించిన "కిం నుఖలు ఇమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా" (1 అం) (ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారము పాలయితినేమి?) అను వాక్యము ప్రమాణము. సావిత్రి నిర్వికారియై యుండుటకు తగిన కారణమున్నది! యువకుడగు సత్యవంతుడట్టి మనోహర సన్నివేశములో పత్నీయుతుడయ్యు చలింపకుండుటకు హేతువేమి? వికారము నొందకుండుటస్వాభావికమా? వసంతఋతువైనా, ఆ ప్రకృతియందు ప్రేరేపక శక్తి లేదు. అది నిర్జీవము. ఈ వర్ణన లేక పోయినను కథకు లోపము గలుగదు! అది సాధించు ప్రయోజనము లేదు!! ఈ వర్ణన సంప్రదాయ రక్షణకై చేసినది కాబోలు!

### నన్నయ - వసంత వర్ణన

వ: .....వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై చనుదెంచు చున్న

లయగ్రాహి:— కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీత నినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకు
ళమ్ముల సు నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా

రమ్ముల నశోక నికరమ్ములును జంపక చ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్.

లయగ్రాహి:— చందన తమాల తరులందు నగరు ద్రుమము
లందు గదళీవనములందు లవలీమా
కంద తరు షండములయందు నని మీాల దర
విందసరసీ వనములందు వనరాజీ
కందళిత పుష్ప మకరంద రసముం దగులు
చుందనువు సౌర భము నొంది జనచిత్తా
నందముగ బ్రోషితుల డెందములు లందురుగ
మందమలయానిల మమంద గతి వీచెన్.

వ: ఇట్లు సర్వభూత సమ్మోహనంబయిన వసంత సమయంబునం బాండురాజు మదన సమ్మోహన మార్గణ బంధీకృత మానసుండై మద్ర రాజపుత్రిదైన మనోహరాకృతి యందు మనంబునిలిపి యున్నంత......

—భారతము. ఆది. 5 ఆ. 137—140.

ఎఱ్ఱన వసంత వర్ణన వలె ఇదియు వచనములంమధ్య అమరి యున్నది. పద్యమున కిరు ప్రక్కలనున్న వచనములు వాని స్ఫూర్తిని పోషించుచున్నవి. ఈ వర్ణనయందు లోకజ్ఞుడగు నన్నయ చూపిన విదగ్ధత అపురూపము. రసోత్కంఠ స్థితికి మొదటి వచనము ఆరోహణముగ, రెండవ వచనము అవరోహణముగ నున్నవి. ఇక ఇందలి వ్యంగ్య వైభవమును దర్శింతము.

(1) లతాంత—మన్మథుడు లతాంతాయుధుడు.
మధుపములు—మన్మథుని వింటి అల్లెత్రాడు.
సుగీత నినదమ్ము— వింటినారి మ్రోత.

మన్మథుని వింటి నారిగా తుమ్మెదల జెప్పుట కవిసమయము. వాటి మ్రోత కామోద్దీపకము. ఇందులకు

శ్లో. ధనుః పౌష్పం మౌర్వీ మధుకర మయీ చంచల దృశాం
దృశాంకోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః
స్వయం చైకోఽనంగః సకల భువనం వ్యాకులయతి
క్రియా సిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

అను శ్లోకము ప్రమాణము. ధ్వని బాణ ప్రయోగమునకు పూర్వము నారిని మ్రోయించుట సహజము. తుమ్మెదల ఝుంకారము, నారిటంకారము యొకటిగా నుండుట విశ్రుతము. కావున మొదటి వాక్యమున వసంత కాలము అఖిలజీవ లోకానంద దాయకమై యుండగా భావజుడు బాణ ప్రయోగమునకు సిద్ధపడి, నారిని మ్రోగించుచు స్ఫురించుచున్నది.

(2) కిసలయమును స్త్రీల అధరముతో పోల్చుట కవి సమయము. పల్లవాధరి— మొ. వి ప్రసిద్ధములు. కోకిల— పుంలింగ శబ్దమగుటచే చుంబనము ఊహింపదగినది.

(3) సుమనస్. (స్త్రీ. లిం.) పూవు. స్త్రీలు పూబోడులు, పుష్పవతులగుట ప్రసిద్ధము. అశోకము (పు. లిం) శోకము లేని వాడు. చంపక కింశుకములు పుంలింగ శబ్దములు. కావున మూడవ వాక్యమున పురుషాయిత భోగ మూహ్యము. ఇదియే రతికి పరమావధి. ఇంకే స్త్రీల భారమునే పురుషుడు శోభించుట సంభవించును. ఇందులకే భర్తృహరి శ్లోకము ప్రమాణము.

శ్లో. ఉరసి నిపతితానాం స్రస్త ధమ్మిల్లకానాం
ముకుళిత నయనానాం కించి దున్మీలితానాం
ఉపరి సురత ఖేద స్విన్న గండస్థలానాం
అధర మధు వధూనాం భాగ్యవంతః పిబంతి॥

—శృంగార శతకము. 25 శ్లో.

ప్రకృతి మధుపమ్ముల సంగీత నినదమ్ములతో, కోకిలల మధుర రవమ్ములతో, సుమనో భారమ్ములగు అశోకమ్ములతో నుజ్జ్వలంబై యుండగా, మలయానిలము శైత్య, సౌరభ, మాంద్య గుణములు గల్గి మంద గతిని వీచుచుండగా పాండు రాజు కిందముని శాపమును గూడ తలంపక ప్రకృతి ప్రేరణకు పరవశించి, మాద్రి శాప భయముచే వారించుచున్నను, బలిమిం దత్సంభోగ సుఖ సమీహితుండయ్యెను.

నన్నయ వసంత వర్ణన ప్రేరేపక శక్తి గల్గినట్టిది. సొగసైన బహిరాకారము, సత్వ గరిష్ఠమైన జీవకళ గలది. ఈ ప్రకృతి పాండు రాజునకేగాక పాఠకులకు గూడ సమ్మోహమును గల్గించుచున్నది. కథకు మిక్కిలి ప్రయోజన కారియైనది. పాండురాజ మరణమునకు వసంత ఋతు సౌందర్యము హేతువగుచున్నది. ప్రయోజన కరమగు ప్రకృతి వర్ణనలను చేయుటలోను నన్నయ ఆద్యుడే! ఇట్టిది కదా మహాకవుల ప్రతిభ! ఇందు కోమలాను పదనము గల ప్రసన్న పద సంఘటన వలన గలుగు మనోజ్ఞమగు నాదమ్ము, వర్ణముల యావృత్తి వలన గలుగు శబ్ద సంగీతము వీనులకు విందొనర్చుచున్నవి. పద్యము లందలి శయ్యా సౌభాగ్యము, ఛందోగుణములగు లయ, తాళములు విషయ వైశద్యమునకు, అర్థ స్పష్టతకు తోడ్పడుచున్నవి. ఇట్లు సాహిత్య, సంగీత, నృత్యతత్త్వములు సంయోగించి యుండుట ఇందలి గానము. ఇందు శబ్దార్థ సిద్ధులను నన్నయ సాధించెను.

# కవిత్వము - ఛందము

ప్రాయము ( " గద్యం — వృత్తగంధి, చూర్ణ ముత్కలికా ప్రాయంచ, పద్యభాగవత్ వృత్తగంధి. అనా విద్ధ లలిత పదం చూర్ణమ్; విపరీత ముత్కలికా ప్రాయంచ " — కావ్యాలంకార సూత్ర వృత్తి) ప్రాచీన కాలమున గద్య, వచన పదములు తాళలయానుగుణ్యమైన, పాడుటకనువుగ నున్న రచనలకే చెల్లు చుండెను. వెంకటేశ్వర వచనములు, బిరుదు గద్యలు, శఠకోపవిన్నపములు — ఇట్టివి. ఈ రచనలు మాత్రా ఛందము ననుసరించి ప్రవర్తించుచు, పాడుటకు తగి యుండెను. పాదనియ మము లేకుండుటయే వీనికి పద్యములకు గల భేదము !

సర్వ ఉద్రిక్త భావములు, భవ్యావేశములు లయాన్వితములగు ఛందోబద్ధమైన భాషలో వెలువడుట సహజము. అది పద్యమా? గేయమా ? వచనమా ? అనునది కవి యొక్క ప్రతిభ, ప్రక టనా సామర్థ్యము, అలవాటు మొదలగు వానిపై ఆధారపడి యుండును. ఈ క్రింది ' శ్రీపాద ' వారి వాక్యములను పరిశీ లించండి.

" ' ఫిడేలు రాగమ్, ఫిడేలు రాగమ్ ' అన్నారు. ఏదో నడక స్ఫురించింది. ' ఫిడేలు రాగంబులు ' అని విరిచారు. ' వినూత్న పదప్రేమికులు మహాకాముకులు ' అనగానే మళ్లి నడక స్ఫురిం చింది. ' అన్యోన్యమగు దంపతులు గూడ ' అని మళ్లీ విరిచారు."

—— ' భారతి ' డిసెంబరు 1963. 6 పుట.

దీన ఆవేశముచే లేక ఆలోచనచే నేర్పడిన శబ్దస్వరూపమును పదసంఘటనచే సహజముగా స్ఫురించుచున్న నడకను, లయను ' అహంభావ కవులు ' నవ్యత కొరకు చెరచుచున్నారని తేలుచున్నది గదా ? పదముల కూర్పుచే సహజముగా నేర్పడుచున్న లయ, తాళములను చెరచుటకు కవుల మనుకొనువారే కావలెనా ? అందులకు ఎవడు తగడు ?

" కవిత్వము రసాత్మకమైనది. కనుక సరసభావము యే రూప మున నున్నను రసికుని భావోద్విగ్న మానసునొనరించియే తీరు ననుట " సరికాదు.

> అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
> రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసమ్
> అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘం
> నజానేభోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః॥
>
> — శాకుంతలము. 2 అం. 10 శ్లో.

ఈ సరస భావమునే వచనములో అనువదింతుము. " శకుంతల సౌందర్యము వాసన చూడబడని పూవు. గోటితో గిల్లబడని లేజిగురు. తొలువబడని రత్నం. రుచిచూడబడని క్రొత్త మధువు, పూర్వ పుణ్యముల సమగ్ర ఫలము వలె నున్నది. ఇట్టి రూపము ననుభవించుటకు బ్రహ్మ ఎవనిని కూర్చునో నేనెరుంగను" శ్లోక మందలి, వచన మందలి భావము యొకటేయైనను 'శబ్ద సంఘటనాశక్తి ' వలన శ్లోకము వలె వచనము పాఠకుల మనము. నాకట్టుకొనజాలదనుటకు రసికుల హృదయముపై వానికి గల ప్రభావము హస్తి మశకాంతరమనుటకు సహృదయుల ఆనందాను భవమే ప్రమాణము !

హృదయము భావశబలితమై యుద్రిక్తమైనపుడు భావములు తమంతట రాను ఉచితమైన భాష వెదికి కొని తాళలయాన్వితముగ ప్రవహించును. కీచకుని పలుకులకు కోపించిన ద్రౌపది వాడు నీచుడు గాపున జంకించిన గాని మెత్తబడి పోడని దలంచి ఇట్లనుచున్నది.

> శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసోద్రేక ప్రతాపస్ఫుర
> ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యా పారగుల్ మత్పతుల్
> గీర్వాణాకృతులేవు రిపుడ్డ నిను దోర్లీలన్ వెసంగిట్టిగం
> ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం
> గీచకా !
>
> —భారతము. విరాట. 2 ఆ. 55ప.

అందులకు ప్రత్యుత్తరము బలగర్వితుడైన కీచకుడు నిర్వికారముతో ఇట్లనుచున్నాడు.

> అనుడు నతడిట్టు లనియె నాయతుల బాహు
> బలము జెనయంగ భవదీయ పతుల కారు
> మూడు లోకంబులందు నెవ్వాడు లేమి
> నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి.
>
> —భారతము. విరాట—2 ఆ. 56

ఇట్లు భావతీవ్రత ననుసరించి రచన మారుచుండును. రసవ్యంజనకుచితమైన పద సంఘటనతో మహాకవులు భావ ప్రకటన గావింతురు.

వచన కావ్య కర్తలు రస సంచారమున్న చోట వచన మును శ్రుతి, లయ, తాళాది, ఛందో గుణములచే శక్తి వంత మొనర్చి యున్నారు. ఇందుంకు బాణ, దండి, నన్నయ, చిన్న యల వచన కావ్యములుదాహరణములు. ప్రాచీన కవులు— నన్నయాదులు— రసస్ఫూర్తి లేనిచోట వచనము వంటి పద్యములనే రచించిరి. ఇట్లు రససంచారము ననుసరించి వచనమును, పద్యాలనుపయోగించుటయే గాక తిక్కనాది కవులు శ్రవ్యకావ్యములందలి రసవద్ఘట్టములను దృశ్య కావ్య గుణ సంపన్న మొనర్చిరి. విరాటోద్యోగ పర్వములు, మను చరిత్ర ద్వితీయాశ్వాసము ప్రభావతీ ప్రద్యుమ్నము లుదాహ రింప దగినవి. సమ్యక్ పరిశీలన వలన రసాత్మకమైన భావము

గల వచనము సైతము కవిత్వ మగుననుట ఔపచారికమేయగును! గద్య కావ్యముల కంటె పద్యకావ్యములు వానికంటె దృశ్య కావ్యములు శ్రేష్ఠమైనవి గదా ! "కావ్యేషు నాటకం రమ్యమ్" అను ఆర్యోక్తి ప్రమాణికమైనదే !

* * * *

'సద్యః పరనిర్వృతి' కావ్యము యొక్క పరమ ప్రయోజనము. ఈ కావ్యానందమును అనుభవించునది పాఠకుని హృదయము. అందులకు తోడ్పడునది శ్రవణము. కవిత్వము యొక్క సౌందర్యమును నిర్ధారణ జేసి, కావ్యానందమును గల్గించునది. కవిత్వము శ్రవ్యకళ కావున భావములు లయతాళ సమన్వితమై శ్రవణానంద సంధాయకము లైననే గాని, సహృదయుని అనుభవములకు ఉత్తేజకములై, హృదయముచే కావ్యానందమును ననుభవింప జేయలేవు. భావములు శ్రుతిరంజకత్వము గీతి మాధుర్యము గల్గి యుండుటవసరము. ఈ గుణము శ్రుతి లయ తాళముల గల్గి యుండుటచే జనించును. శ్రుతి, తాళ, లయ్యాగుణములు ఛందో మూలములు. శబ్ద సంఘటన ఛందో మూలమువననే శ్రుతి, లయ, తాళ బద్ధమగును. ఈ ఛందస్సు వలననే పద్య పఠన వేళ మధురమైన, హృదయా వర్జకమైన గీతి విశేషము, వచన పఠనము కంటె భిన్నమైనది వ్యక్త మగుచుండును. "There is no doubt that rhythmical words exert an enchanting influence on the mind. we restored to music even we fail to seize the sense." అని సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల అభిప్రాయము.

కవిత్వమునకు వలయు సామగ్రి అంతయు గద్య పద్యములకు సమానమైనను, ఛందము పద్యమునకు విశేషము. అందువలన గద్య పద్యములకు గల భేదము ఛందో గుణముల ననుసరించి యుండును. అనుభవములకు ప్రవేశకములైన, వీనులకు విందొనర్చు స్వరములను ఛందము వెలయించును. కావున గద్యము, పద్యముతో అన్ని విధముల సరి పోవుచున్నను ఛందోలోపము వలన రూప, నాద సౌందర్యముల లేమి గలదగుచున్నది ! వచన కవిత్వమునందు కేవల సాహిత్యము, పద్య కవిత్వమునందు సాహిత్యముతో బాటు సంగీత నాట్య గుణ సంపన్నత గలదు. "కావ్యమునకు శ్రుతి, లయ, తాళములవలన గలుగు నిశ్చితత్వము (certainity) శక్తిమత్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రయము పద్యకావ్యములందు స్పష్టీకృతమై, హృదయ స్పందకమ్ములైనట్లు వచన, కావ్యములలో కుదరదు"— ఎం. అర్నాల్డ్.

హృదయాను భావములకు ఉత్తేజకమైన, గీతి మాధుర్యము గల గద్యరచన పద్యరచన కంటె కష్టతర మగుటచే "గద్యం కవీనాం నికషం వదన్తి" అను నానుడి యేర్పడినది. కాదంబరి మొ. గు గద్య కావ్యములందు రసస్ఫూర్తి గల్గుచున్నది. సంస్కృత లాక్షణికులు గద్య కావ్యములను గూడ పరిగ్రహించిరి. నన్నయ భట్టాది కవీంద్రులు శ్రుతి లయ, తాళ సమన్వితమైన వచనములో రసప్రవాహమైన రచన చేసిరి ! అతి విస్తృతమైన సంస్కృత సాహిత్యములో గద్య కావ్యము లెన్ని ? గద్య కవులెందరు ? ఒక హస్తమునను దాటవు ! దాటరు ! బాణ, దండి ప్రభృతుల వచన కావ్యములకు, కాళిదాసాది మహా కవుల కావ్యములకుగల ప్రాచుర్యమే ఛందో బద్ధరచనా విశిష్టతకు ప్రమాణము.

"క్రాస్వర్డ్ పజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వు చేసే మహా భాగ్యం
ఏ మానవునిదో కదా !
ఓ భోగం చానా ! నీవు
సంఘానికి వేస్టు పేపరు బాస్కెట్టునా ?"

రసాత్మకమైన భావము కవిత్వము గదా ! ఇందు అసూయ, శంక, మోహము, విషాదము, వితర్కము మొ.గు వ్యభిచారి భావములే గలవు. రసమేది ? చిత్త విభ్రమము గలదేగాని ధ్వని యేది? "విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" (విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, వ్యభిచారి భావములు అనువాని సంయోగమున రస్యమాన మగు స్థాయి భావము రసము) అని భరతుని రస సూత్రము. ఇందు పాఠకులను 'ఆహా !' అనిపించే మాటల గమ్మత్తు గలదు. చెవి కింపగు లయా ఖండములు గలవు. శైలి మణి ప్రవాళము. భాష ఆంగ్లాంధ్ర సంకరమగుటచే పరిమితమైన పాఠకులు గల దగుచున్నది. 'టెక్నిక్' ప్రధానంగా గల ఈ సాము గరిడీల కవిత్వము ప్రాచీన బంధకవిత్వాదుల వలె Intellectual gymnastics కు ఉదాహరణము కాదగియున్నది.

వ్యక్తి యొక్క ప్రతి ప్రైవేటు ఉద్రేకము కవిత్వమనిపించు కొంటుందా? వాఙ్మయమును సృజించు వారనేకు లుందురు. వారందరిని కవులను కొనుట ఆత్మవంచనయే యగును.

# లంకా ఉజ్జయిని రేఖ ఎచ్చట గలదు?

శ్రీ మామిడెల రామమూర్తి

భారతీయ పంచాంగ గణితమున తిథ్యాదులను సాధించుటకు ఇష్ట దినమునకు లంకా మధ్య గ్రహములను సాధింపవలసి యున్నది. ఈ లంకా మధ్య గ్రహములనగా 'లంకా ఉజ్జయిని రేఖ' మీద ఉన్న మధ్యగ్రహములని అర్థము.

పంచాంగ గణితమున కుపక్రమించువారు. ఈ లంకోజ్జయిని రేఖ ఎచ్చట యున్నది తెలుసుకొనిన గానీ అచ్చటి మధ్య గ్రహములను దేశాంతర సంస్కారము చేసి స్వదేశమునకు మార్చుకొన జాలరు. ఈ లంకా ఉజ్జయిని రేఖను గురించి జ్యోతిష సిద్ధాంత గ్రంథముల జెప్పబడిన ప్రమాణములు ఆధారము. ఈ రేఖకును స్వదేశమునకు గల అంతరము తెలిసికొనుటకు నవీనులచే తయారు చేయబడిన దేశపటములు ఆధారముగా నుండును.

లంకా ఉజ్జయిని రేఖ జ్యోతిష సిద్ధాంత భాగమున చాలా ప్రాముఖ్యత గలది. ఇదియే భూమధ్యరేఖ అనియు ప్రాచీన భారత దేశమున ప్రసిద్ధి చెంది యుండినది. లంక ఉజ్జయిని పట్టణములును అతి ప్రాచీనమైన ప్రసిద్ధికెక్కిన పట్టణములని సర్వులకు విదితమే ! ప్రాముఖ్యమైన ఈ రెండు పట్టణముల పేరుతో యామ్యోత్తరములకు కల్పింపబడిన ఈ భూ(మధ్య) రేఖ లంకా ఉజ్జయినీ రేఖగా ప్రసిద్ధి జెందినది. దీని నాధారముగ జేసికొని వివిధ పట్టణములకు రేఖాంశమ్ములను మన ప్రాచీనులు నిర్ణయించిరి. ఇటీవలి వరకు గలిగిన శాస్త్రాభివృద్ధి ననుసరించి వివిధ యంత్రములు వెలసిన నేటి ఆధునిక కాలమున నవీనులు ఇప్పటికి కనుగొన్న శాస్త్రాధారముల ననుసరించి 0 డిగ్రీ గల ఉజ్జయిని రేఖ అను రేఖాంశ రేఖను ఉజ్జయిని ప్రాంతము నుండి మార్చి గ్రీనిచ్ పట్టణమున యుండుట సమంజసమని నిర్ణయించిరి. కనుక ఇప్పటి అట్లాసును పరిశీలించిన గ్రీనిచ్ నుండి ఉజ్జయిని పట్టణము 75.45° లు తూర్పు రేఖాంశమున యున్నది.

మన ప్రాచీనులు చెప్పిన 'లంకా ఉజ్జయిని రేఖ లంకా, ఉజ్జయిని పట్టణములను కలుపుచు పొడిగింపబడిన కల్పిత రేఖ యని తోచును. కాని అట్లాసును పరిశీలించిన ఉజ్జయిని పట్టణమునుండి యామ్యోత్తరములకు పొడిగించిన రేఖపై రావణ రాజధానియైన లంకా పట్టణము (ఇప్పటి సింహళము) కన్పింపదు. ఇట్లే అట్లాసులో లంకా పట్టణము నుండి యామ్యోత్తరమునకు పొడిగింప బడిన రేఖపై ఉజ్జయిని పట్టణమును కన్పింపదు. కనుక ఈ రెండు పట్టణములను కలుపురేఖ యున్నదనుట పొసగదు. కాన ఈ రెంటిలో ఏదో ఒక పట్టణము మీదుగా యామ్యోత్తరములకు పొడిగింప బడిన రేఖయే లంకా ఉజ్జయిని రేఖ' అని పిలువబడి యుండు నని ఊహింప వచ్చును.

దీని విషయమై ఉజ్జయిని పట్టణమునుండి యామ్యోత్తరములకు పొడిగింప బడిన రేఖ లంకోజ్జయినీ రేఖ అని పిలువ బడినదని కళ్యాణ గణితమున— వేదార్థ ప్రవీణ, దైవజ్ఞ సార్వభౌమ బ్ర. శ్రీ. చివుకుల వెంకటరమణ శాస్త్రి గారు చెప్పియున్నారు. ఈ రేఖ 75.45° తూర్పు రేఖాంశమున యున్నది. వీరి ప్రకారము ఆంధ్రదేశమంతయు లంకోజ్జయిని రేఖకు ప్రాగ్భాగమున యున్నది. ఉదాహరణకు ఈ చెప్పిన లంకోయుజ్జయిని రేఖనుండి నెల్లూరు పట్టణము 4.17° లు తూర్పు రేఖాంతరాంశలు అగును. ఈ లంకోజ్జయిని రేఖ ఉజ్జయిని ప్రాంతము గుండా మేరువును చేరినదని "శ్లో. యల్లంకోజ్జయినీ పురోపరి కురుక్షేత్రాది దేశాన్ స్పృశ త్సూత్రం మేరుగతం బుధైర్నిగదితా సామధ్య రేఖా భువ." అని భాస్కరాచార్యులు సిద్ధాంత శిరోమణి యందు చెప్పి యున్నారు.

సిద్ధాంత గణిత విషయమై ప్రసిద్ధి బడసిన సిద్ధాంత గ్రహలాఘవము, గణ కానందము అను కరణ గ్రంథములలోను ఈ రేఖను గురించి చెప్పబడినది. సిద్ధాంత

గ్రహ లాఘవమున, శ్లో. రాక్షసాలయ దేవౌకః శైలయోర్మధ్య సూత్రగా, రోహీతక మవంతీంచ తథా సన్నిహితం సరః అనియు, గణకానందమున 'లంకావంతీ పురీ మధ్య రేఖా. . . .' అనియు చెప్పబడినది. ఈ రేఖ రోహీతకము, అవంతి (ఉజ్జయిని) కురుక్షేత్రాది దేశములను స్పృశించుచు మేరువును బొందినదిగా చెప్పబడినది. ఈ లంకా ఉజ్జయిని రేఖకు ప్రాగ్భాగముననే ఆంధ్ర దేశమంతయు యుండినట్లు తెలియుచున్నది. ఉదాహరణకు నెల్లూరు ఈ రేఖకు తూర్పున 31 యోజనముల దూరమున యున్నదని గణకానందమున పట్టికలో ఇవ్వబడినది. దీని ప్రకారము నెల్లూరు ఈ రేఖకు తూర్పు రేఖాంతరాంశలు షుమారు 2.14° లుగ యున్నట్లు తెలియును.

పైన చెప్పిన వాని ప్రకారము లంకా అని చెప్ప బడు నేటి సింహళము ఈ ఉజ్జయిని రేఖకు తూర్పు భాగమున 4.15° లు రేఖాంతరాంశలలో యున్నది. నేటి అట్లాసులో గ్రీనిచ్ నుండి 80° లు తూర్పున యున్నది. లంక నుండి యామ్యోత్తరముగా మేరువునకు పొడిగింప బడిన రేఖయే 'లంకోజ్జయిని రేఖ' అయి యుండిన అవంతి, కురుక్షేత్రాది దేశములను ఈ రేఖ స్పృశించుట లేదు.

లంకోజ్జయిని రేఖ అను ఈ భూమధ్య రేఖ విషయమై శ్రీ జగ్గరాట్ ప్రభు ఆస్థాన జ్యోతిష విద్వాంసులగు శ్రీమద్రాజ్ఞీ మహాగ్ని చిన్నరసింహ దైవజ్ఞ సార్వభౌముల వారిచే తిథి కల్పవల్లి అను గ్రంథమున, శ్లో. లంకాతః ప్రాక్సార్ధ సప్త లవ దేశా ద్వినిర్గతా కాశీ ప్రాంతాన్మేరుగా యా మధ్య రేఖాత్ర కల్పితాః అని— లంకా పురమునుండి ప్రాగ్భాగమున 7 అంగుళములు గల ప్రదేశమునుండి బయలుదేరి కాశీనగరమునకు తూర్పు వైపున 20 లిప్తలు గల బిందువును స్పృశించుచు మేరువును బొందిన యామ్యోత్తర రేఖ భూమధ్య రేఖగా గ్రహింప బడినదని చెప్పబడినది. కాశీ ప్రాంతమున బోవు ఈ రేఖ కురుక్షేత్రాది దేశములను స్పృశించును కానీ, ఈరేఖ లంకా పట్టణమునకు 7½° లు ప్రాగ్భాగము నుండి బయలుదేరిన దనుట సమంజసముగా తోచుట లేదు. లంకా పట్టణము గ్రీనిచ్ నుండి షుమారు 80° లు తూర్పున యుండుటచే ఈ లంకా నగరమునకు ఇంకను ప్రాగ్భాగమున 7½° లు దూరమున ఈ రేఖ బయలుదేరిన దనుట వలన గ్రీనిచ్ నుండి షుమారు 87½° లు దూరమున ఈ రేఖ యున్నట్లు తెలియును. ఇట్టి 87½° రేఖా ప్రాంతమున కాశీ, కురుక్షేత్రాది దేశములు స్పృశించవు. మరియు 'తిథి కల్పవల్లి' యందు ఇవ్వబడిన పట్టికలో విశాఖ పట్టణము భూమధ్య రేఖ మీద యున్నదని చూపబడినది. విశాఖపట్టణము అట్లాసు ననుసరించి గ్రీనిచ్ నుంచి తూర్పు 83.20° లో యున్నది. విశాఖ పట్టణము నుండి యామ్యోత్తరమున పొడిగింప బడిన రేఖపైన కాశీ, కురుక్షేత్రము మొదలగు ప్రాంతములు స్పృశించుట కనుపించును. కనుక, వీరి అభిప్రాయము ప్రకారము గ్రీనిచ్ నుండి తూర్పున 83.20′ ల రేఖయే భూమధ్యరేఖగా తోచును. కాని ఈ రేఖ ఉజ్జయిని పట్టణము మీదుగా పయనింపదు. వెనుక చెప్పిన ఉజ్జయినికి షుమారు 7½° లు తూర్పుగ ఈ రేఖ యున్నట్లు తెలియును. ఇట్లే ఆ గ్రంథము నందలి పట్టికలోను చూపబడినది. వీరి అభిప్రాయము ప్రకారము ఆంధ్ర దేశమంతయు తూర్పున యుండక కొన్ని పట్టణములు ఈ రేఖకు ప్రాగ్భాగమునను, కొన్ని పట్టణములు పశ్చిమ భాగమునను యుండును. ఉదాహరణకు విజయనగరము 0.9° లు శ్రీకాకుళము 0.34° లు ప్రాగ్భాగమున గలవు. ఈ రేఖకు నెల్లూరు 3.21° లు పశ్చిమముగా యున్నది.

ఉజ్జయిని పట్టణము మీదుగా ఈ లంకోజ్జయిని రేఖ యుండినట్లైన నెల్లూరు ఈ రేఖకు ప్రాగ్భాగమున 4.17° లు తూర్పుగా యుండును. ఈ రేఖ యందు మధ్య రవిలో నెల్లూరుకి దేశాంతర సంస్కారము చేయుటకు 42 విలిప్తలను లంకా మధ్యరవి నుండి ఋణము చేయవలయును.

ఉజ్జయిని లంకా పట్టణములకు ప్రాగ్భాగమున — విశాఖ పట్టణము, కాశీ ప్రాంతము మీదుగా యామ్యోత్తరముగ నుండిన 83.20° లు గల రేఖయే లంకోజ్జయిని రేఖగా యుండినట్లయిన నెల్లూరు ఈ రేఖకు పశ్చిమ భాగమున 3.21° లు దూరమున యుండును. ఈ రేఖ యందలి మధ్య రవిని నెల్లూరుకు మార్చుకొనుటకు అగు దేశాంతర ఫలము 33 విలిప్తలు లంకా మధ్యరవికి ధనము చేయవలసి యున్నది. ఈ రెండు అభిప్రాయముల ప్రకారము నెల్లూరికి దేశాంతర ఫలము 33+42 విలిప్తలు = 1 లిప్త—15 విలిప్తలు వ్యత్యాసము వచ్చుచున్నది. ఇది ఒక్క మధ్యరవి విషయము. తక్కిన మధ్య గ్రహములకును ఇట్లే తగు వ్యత్యాసము వచ్చును. ఈ రెండు అభిప్రాయముల ననుసరించి ఒక ప్రదేశమునకు గుణింపబడిన పంచాంగముల యందు తిథ్యాదుల యందు కొన్ని ఘడియలు వ్యత్యాసము వచ్చును. దృగ్గణిత పంచాంగమునకు, ప్రాచీన పద్ధతి పంచాంగమునకు తిథ్యాదుల యందు కొన్ని ఘడియలు వ్యత్యాసమున్న సంగతి అందరికి తెలిసినదే !

కనుక నేడు గ్రీనిచ్ రేఖను 0 డిగ్రి రేఖగా అందరు అంగీకరించినను, ముఖ్యముగా పంచాంగ గణితమునకు సంబంధించినంత వరకు ఈ లంకా ఉజ్జయిని రేఖ ప్రాముఖ్యతను మన భారత దేశమున త్రోసివేయ జాలరు. దీనికి కారణము మన పూర్వులు పంచాంగ గణితమున మధ్య గ్రహములను ఈ లంకా ఉజ్జయిని రేఖకు సాధించి యుండిరి. ఈ రేఖను ఆధారముగ జేసికొని అట్టి గ్రహములను వారివారి స్వదేశములకు సాధించుకొను విధానము చెప్పియుండిరి. కనుక ఈ రేఖ ఖచ్చితముగ ఎచ్చట యున్నది తెలిసినగాని స్వదేశమునకు నిర్దుష్టముగా గణితము జేయజాలరని పై ఉదాహరణమున తెలియుచున్నది.

కాన 'లంకోజ్జయిని రేఖ', విషయమై పై అభిప్రాయములలో ఏది సమంజసము ? ఈ రేఖ విషయమై

మరి వేరే అభిప్రాయమేమైనా యుండియున్నదా ? ఈ రేఖ ఖచ్చితముగా ఎచ్చట యున్నది ? అనుభజ్ఞులైన పెద్దలు భారతి పత్రికా ముఖముగా తెలుప గలందులకు ప్రార్థన.

# నివాళి పాటలు

## శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య

గత 1963, డిశంబరు నెల, భారతి సంచిక యందు శ్రీ హస్నాబాద నాగలింగ శివయోగిగారు "నివాళిపాట," నొక దానిని ఉదాహరించి, ఆ పాటను గురించి ఇట్లు వ్యాఖ్యానించిరి :

మంగళహారతికి నివాళి పర్యాయ పదము. పాల్కురికి సోమనాథుని కాలమున, శుభ సమయములందు, "నివాళి పాడుట యాచారమై యున్నట్లుగా తోచుచున్నది. రాను రాను "నివ్వాళి"యే మంగళముగా, మారినదా ? అన్నమయ్య గారి కాలమునుండి, మంగళములు యాచార మయ్యెనేమో. అయిన, ఈ "నివ్వాళి" పాటయందు నీరాజనములు (ఆరతులు) మంగళము మున్నగు శబ్దములును వచ్చుటచే, నీరాజనములు నివాళులు, వేరువేరు అయి యుండునా ? యని సంశయము కలుగుచున్నది."

శ్రీ శివయోగి గారు ప్రకటించిన "నివాళి" పాట యందు, పన్నెండవ చరణమును, పరిశీలించండి !

"యాలపురములోనే (దారమబ్బంగ) నీరాజనము లిచ్చు, నీకు నివ్వాళి",ని బట్టి నీరాజనము, నివ్వాళి, యును నవి వేర్వేరు తెగకు జెందినవని, స్పష్టమగుచున్నది గదా?

ఈ "నివాళి" పాటలను గురించి స్వర్గీయ శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు, "దేశి" యందిట్లు చర్చించిరి :

"ఈ దేశీయ రచనలనునవి పదములని పాటలని, రెండు విధములుగా నున్నవి. అట్టి వానిలో జేర్ప దగినవే ఈ క్రిందివి కొన్ని :

తుమ్మెద పదములు :

ప్రభాత గీతములు : ఇవియే, మేలుకొలుపులుగా వచ్చును.

వెన్నెల పదములు : ఇవియే చందమామ పదములు.

నివాళి పదములు : ఇవియే ఆరాత్రికములు ఆరతులుగా వచ్చును. మంగళ హారతులుగా వచ్చును."

* * * *

మరియు రామకృష్ణయ్యగారు ఇలా వ్రాశారు :.

"పండితా రాధ్యుడు వెలనాటి చోడుని బౌద్ధగురువుతో వాదించుటకుగా నా రాజసభకు బోవు సందర్భమున నాతని వెంట వచ్చు శిష్యులు సద్భక్త సంకులము, నాడుచు బాడిన పదములు మరికొన్ని గలవు :

"పదములు, తుమ్మెద పదముల్ ప్రభాత పదములు శంకర పదముల్, నివాళి పదములు, వాలేకు పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజ వర్ణన, మరిగణ వర్ణన పదములు బాడుచునాడుచు. . . . "నేగుదేరిరి.

* * * *

ఈ నివాళి ఆచారము మొదట ద్రావిడ దేవతల ఆరాధనల యందుండి యుండెననుట, నిర్వివాదాంశము. శ్రీనాథ మహాకవి విరచితమైన శ్రీభీమేశ్వర పురాణము నందలి పద్యమును పరిశీలించండి ! !

"అర్చనలు చేసి గంధపుష్పాక్షతముల
ధూపమిచ్చె గాలాగురు ధూమరేఖ
గప్పురంబు నివాళించె గములనేత్ర
పంక్తి పంక్తికి నేతెంచి బ్రాహ్మణులకు"

శ్రీనాథ కవి ప్రయోగమును బట్టి "నివాళి" యనునది, "హారతి"గా, మారియుండునా— యనిపించును. గాని— సందేహాస్పదముగానే దోచుచున్నది. ఆ నాడు శైవ మతానుయాయులు, వాలేకు పదములు, వెన్నెల పదములు, నివాళి పదములు పాడిరనిన యెడల, శివరాత్రి నాడె మాత్రము కాజాలదు. శివరాత్రి యనునది పర్వదినము. అమావాస్య నాటికి ఒకటి రెండు రోజులు ముందుగా మాత్రమే వచ్చును. గనుక నివాళి పదములేగాక— ముఖ్యముగా వెన్నెల పదములు యెట్లు గానము జేయగలరు ?

శ్రీ రామకృష్ణయ్య గారు ఇచ్చిన శివరాత్రి నాటి విశేషములను ఇచ్చట మరల మనము పరిశీలించుట అవసర మనిపించి, "దేశి" నుంచి ఉదాహరించుచున్నాను. "శివరాత్రి జాగరమున వేడ్కలు, ప్రదర్శనలు ననేక రీతులుగ నున్నవి.

"భసితంబు పూతపై బరగు బచ్చెనలు
ససలారు చిరుగజ్జెయలు నందియలును
గరమొప్పు తొంగళ్ళుగల చల్లడములు

బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు
దాల్చి యత్యదుభుతోత్సవ లీలదనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూల వివిధ వాద్య సమ్మేళనమున
నార్భటంబిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వత్రిల్ల
నిక్కుచును త్రిభంగి నిలుచుచు నట్ల
చొక్కుచు సభజూచి యొక్కింతనగుచు
అలరి శిరఃకంప మాచరించుచును
తను పాద ఘట్టన దనరు నుద్భటన
లనునయించుచు నందియల్ గదల్చుచును
జతులు పాడుచు దాళగతుల నాడుచును
గంతులు వైచుచు. . . .
నొడ్డోలంబుల నొరసి తిర్గుచును
బురములు గాల్చిన పోల్కియాడుచును
వెండియు భవుబహు విధ చరిత్రముల
ఖండిత గతి నాటకంబు లాడుచును.''

మరి యిుక నివాళి పదములు, వాలేశు పదములతోటి వెన్నెల పదములు, గానము జేయు పండుగ యేది ? కార్తీక పూర్ణిమ నాటి రాత్రి, శివాలయములందు, జ్వాలా తోరణము ఉండును గదా ? దీనినే, ''నివాళి'' యనిరేమో ! ఆ నాడు గాని యెడల, వెన్నెల పదములు సైతము ఎట్లు గానము జేయ గలరు ?

శివరాత్రి తిరునాళ్ళకు, అంకమ్మ మొదలయిన ద్రావిడ దేవతల తిరుణాళ్ళకు ప్రభలు గట్టి యూరేగించుట మన ప్రాచీన సంప్రదాయమై యున్నది. ఈ ప్రభల ముందు ఒక వ్యక్తి నిల్చుని దండకమును చదువు చుండగా— మరి కొంతమంది వంతబల్కు చుందురు. డోలు వాద్యమును పక్క వాద్యముగా ఉపయోగించు చుందురు.

దక్షుని యాగమును ధ్వంసము జేయు సందర్భమున, దక్షుని పరివారమునకు ప్రమథగణము వలన గల్గిన పరాభవ ములు ఇట్లా దండక రూపమున చిత్రించ బడినవి. ఈ నివాళి పదములనేవి గూడా ఇలాంటి కోవకి జెందినవని మాత్రమేనని ఊహించు చున్నాను.

# పంచారామాలు

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

చామర్లకోట శివారు భీమవరమూ, దక్షారామమూ, క్షీరారామమూ, గుణుపూడి భీమవరమూ, అమరారామమూ అన్న శైవక్షేత్రాలైదూ పంచారామము లనబడుతున్నాయి. బౌద్ధులకు సంఘారామాలుండేవి కాని వైదిక మతానుయాయులకూ, జైనులకూ ఆరామాలంటూ లేవు. కనుకనే కాబోలు ఈ ఆరామాలన్నీ బౌద్ధుల సంఘారామాలుగా ఉండేవి కాబోలనీ, శైవులు వాటినాక్రమించి, ఆరామాలన్న పేర్లు మార్చకుండానే శివాలయాలుగా మార్చుకున్నారనీ కొందరు అభిప్రాయపడ్డారు. ఆ ఊహకు, ఈ పంచారామాలలోనూ అమరావతి, గుణుపూడి, దక్షారామమూ, కుమారారామమూ (చామర్లకోటది) రెండంతస్థుల ఆలయాలు కావడము మద్దత్తు అన్న అభిప్రాయము కూడా ఉంది. అజంతా బౌద్ధ గుహలకు రెండంతస్థులున్నట్టు కనబడు తుంది. తెలుగు దేశంలోనే అనకాపల్లి సంఘారామము రెండంతస్థు లది ఉన్నది. అయితే అది గుహాలయము, ఇవి కట్టుడు ఆలయాలు. అయినా పౌరాణిక దేవతలకు రెండంతస్థుల ఆలయాలు నిర్మించడము అలవాటు లేని కారణం చేత ఈ పంచారామాలూ బౌద్ధుల వనుకున్నారు.

ఈ ఆలయాలలో — అమరావతీ, దక్షారామమూ, కుమారారామాలలోని లింగములు పాలరాతివీ సుదీర్ఘములూను. వైదిక దేవాలయాలలో లింగములను పాలరాతితో చేసే అలవాటక బౌద్ధుల కాలంలో ఉండినది కాని, చాళుక్యులు ఎర్రఇసుక రాతి లింగాలనూ పానవట్టాలను చేయడముతో ఆ అలవాటు తగ్గి పోయింది. (నాగార్జున కొండ మ్యూజియములో పాలరాతిదీ, మూడు పలకలు ఒక వైపూ, తక్కినదంతా దీర్ఘవృత్తాకారమూ కల లింగమున్నది. ఏలేశ్వరపు త్రవ్వకాలలో పాలరాతి లింగాలు చాలా బయటబడ్డాయి. పశ్చిమగోదావరి జిల్లా గణపవరములో ఏటిఒడ్డున ఒక పాలరాతి లింగమున్నది. ఘంటసాల సరస్వతి పాలరాతిదే కాని అది బౌద్ధవైదిక సంధి కాలంలో చేయబడింది. యిదా లాభమేగాని యత్న నిర్మితమ్ము కాదు. బెజవాడ మ్యూజి యములోని పాలరాతి పరశుధారి పరమేశ్వరుడూ అలాటిదే) కాగా

ఈ ఆరామాలలోని పాలరాతి లింగాలు ఏ బౌద్ధస్తూపానివో ఆయకస్తంభాలని ఊహించడము బహుసులువై పోయింది. ఆయకస్తంభాలు — అయిదు — తెలుగు దేశపు స్తూపాల వేదికకు నాలుగు దిక్కులా ఉంటాయి సర్వసాధారణంగా. ఈ లింగాలు, భగ్నము చేయబడ్డ ఏ స్తూపానివో ఆయకస్తంభాలుగా ఉండినవి తరిమెణ పట్టి తయారు చేసినట్టివి అని ఊహించారు మరి కొందరు.

అయితే, సత్యము కథకన్నా చిత్రముగా ఉంటుంది, ఈ ఆరామాలు వీరశైవవిజృంభణానికి ముందే ఉండినవి. చామర్ల కోట ఆలయమూ, దక్షారామ ఆలయమూ అసలు ఆలయాలా, లేక, అసలు ఆలయాలు శిథిలములైతే ఆ ఆలయాల శిలలూ శాశనాలూ తీసేసి ఈ ఆలయాలు మళ్లి కట్టేరా అన్న అనుమానానికి కొన్ని కారణాలున్నాయి. దక్షారామ సప్తగోదావరసరోవరమును దేవాలయ ప్రాకారపు ఈశాన్యమూల స్పృశించే చోటిమెట్లలో— బిక్కవోలు దేవాలయాల గూళ్ల కిటూ అటూ ఉండే యాళి తోకలు — శిల్పించిన శిల చూచాను నేను. ఆ శిలలు తక్కినవి తిరగదీసి చూస్తే అవతలి వైపున్నది యమున తాపేటి మీద ఉన్నదీ, శిరస్సు ఎవరో విరగ గొట్టేరు; ఎర్రఇసుకరాతి శిల్పము, చాళుక్యులది. అక్కడి ఆలయమేదో శిథిలమైనదని స్పష్టము. రాజనారాయణాలయ ప్రాకారము లోవైపు బిగించిఉన్న రావణానుగ్రహమూర్తి, లక్ష్మీనారాయణులూ, విరూపాక్షస్వామి, వాయు దేవుడూ ఆ ఆలయానివే కానలయునే. కుమారారామము అనంతర నిర్మాణము. ఆ ఆలయ శాసనాలు కూడా కొంత ఆలస్యముగా వెలసినవి. దక్షారామపు తొలిశాసనాలు వక్రశిలల మీద ఉన్నాయి. తొలి ఆలయము గజపృష్ఠాకారమేమో!

కుమారారామాలయము రెండంతస్థుల దీర్ఘచతురస్రాలయము. ముందు వైపు చిన్న మండపమును చేర్చినారు, దాని మీద రెండో అంతస్థులోనూ మండపముంది. ఇదే ఈ ఆరామ దేవాలయాల మొదటిరూపు. రక్షించి, కుమారారామాలయములో మార్పులూ చేర్పులూ లేక నిలిచి ఈనాడు సాక్ష్యము పలుకుతోంది. దక్షారామ దేవాలయానికి ముందు మండపమునకు రెండు వైపులా మండపాలు లేపి, ఆలయశిఖరాల్లాగ శిఖరాలు కట్టేరు తరవాతి వారెవరో. వీటివల్ల ఆలయము రూపము మారింది. కుమార, — దక్ష, — ఆరామాలు రెండింటికీ పై అంతస్థుకి పోవడానికి మెట్ల వరుసలు పార్శ్వములలో ఒకే చోట కనబడుతున్నాయి. పై అంతస్థులోనికి చొచ్చుకు వచ్చిన లింగము చుట్టూ గర్భాలయమూ తరవాతి నిర్మాణమే, స్తంభాల నడుమ బండగోడ! పై అంతస్థులోనూ, దిగువ అంతస్థులోనూ లింగమునకు ప్రదక్షిణము చేయవచ్చును. గుణుపూడిలో పై అంతస్థు అలంకారమే, లింగము పై అంతస్థు వరకూ అమరావతిలో లింగము శుభ్రమైన పాలరాతిదీ, పొడవూ ఉన్నది; అయితే దిగువ అంతస్థు మూసిపెట్టారు.

అన్ని ఆరామ లింగాలూ పాలరాతివీ, తెల్లనివి. పురాణాల్లో చెప్పినట్లు స్ఫటిక లింగాలు కావు. ఇవి పాలరాతివి ఎందుకెంచారు. అంత పొడవు అవి ఎందుకు చేశారు ? ఈ ఆలయాలు శైవులు కట్టారు, వారు శివపారమ్యమునే నమ్ముతారూ, బోధిస్తారు. శివపారమ్యాన్ని చక్కగా ప్రకటించేది లింగోద్భవ గాథ. బ్రహ్మ విష్ణువూ “ నేను గొప్ప అంటే నేను గొప్ప ” అని వాదించుకుంటూ ఉంటే వారి నడుమ మహాదేవుడు జ్యోతిర్లింగ రూపంలో ఉద్భవించాడట. ఆ జ్యోతిర్లింగము పై కొన చూడాలని హంస మీద బ్రహ్మ, దిగువ కొన చూడాలని వరాహరూపియై తవ్వుకుంటూ విష్ణువూ బయల్దేరారూ చూడలేక పోయారు. పంచారామాలలో తెల్లని పాలశిలతో ప్రతిష్ఠ చేసినవి జ్యోతిర్లింగములు, పాలరాయికాక ఇంకే రాతితో చెయ్యాలి జ్యోతిర్లింగాలనూ? జ్యోతిర్లింగము వెలసినదారామములో. కనుకనే ఇవి ఆరామాలు !

జ్యోతిర్లింగశిల్పాలు చాళుక్యులు ఉండవల్లి గుహ స్తంభము మీద, పల్లవులు కైలాసనాథాలయ గూడులో, నెలనాటి చోళులు గంగైకొండ చోళపురాలయము గూడులో, వెలనాటి చోళులు చందవోలు శివాలయ లింగము ( 8అడుగుల ఎత్తూ రెండడుగుల వ్యాసమూ గలది) గా, పశ్చిమ చాళుక్యులు అలంపురం ఆలయాల మీద శిల్పించారు. కాని జ్యోతిర్లింగాలకు ఆలయాలు తెలుగునాట పంచారామాల్లో ఉన్నాయి. గుంటూరు జిల్లా చేబ్రోలులో ఒక ఆలయమున్నదట రెండంతస్థులది. రెండంతస్థుల ఆలయాల రహస్యమిది.



## లేఖలు

# ఫ్రాన్సిస్ థామ్సన్

భారతి సంపాదకులకు,

మహాశయా—

ఫ్రాన్సిస్ థామ్సన్ మహాకవి పేరను లండనులో స్థాపింప బడిన సాంస్కృతిక సంఘముయొక్క కార్యకలాపాలను తెలియ జేయుచు మార్చినెల భారతిలో ప్రకటించినందుకు నా తరఫున, మా సొసైటీ తరఫున కృతజ్ఞతాభి వందనములు తెలియ జేస్తున్నాను.

ప్రతిదినం మా కార్యాలయానికి అసంఖ్యాకంగా భారతి పాఠకుల జాబులు వస్తున్నాయి. థామ్సను కవి యొక్క ఇతర విషయాలు తెల్సుకొనవలెనని, సొసైటీ కార్యకలాపాల వివరాలు కావలెనని, తదితరములైన అనేక విషయములు కోరుతూ వ్రాసిన భారతి పాఠకులకు మా ధన్యవాదాలు. వారు చూపిన శ్రద్ధా, అభిలాషలు మమ్మల్ని ఆశ్చర్యపరచినవి. ప్రతి ఒక్కరికి వేరువేరుగా జవాబులు ఇచ్చుటకు వ్యవధిలేని కారణము వల్ల వారిలో అత్యధిక సంఖ్యాకుల ప్రశ్నలకు సమాధానములు వచ్చునట్లుగా ఈ జాబు వ్రాయుచున్నాను.

1. థామ్సను మహాకవి జీవిత విశేషాలు వివరంగా ముందుముందు ఇంకా వ్యాసాలు వ్రాసి భారతికి సమర్పిస్తాను. వారికి నచ్చిన పక్షంలో ప్రచురింపబడవచ్చు.

2. నవంబరులో జరిగిన ప్రదర్శనం వివరాలు తెలియ జేసే వ్యాసం కూడా వీలైతే వ్రాస్తా. ప్రస్తుతం ఆ ప్రదర్శనానికి సంబంధించిన క్యాటలాగు ప్రింటు అగుచున్నది.

3. థామ్సను రచనలు తర్జుమా చేయుటకు కాపీ రైటు గతించిన కారణమున ఎవరి పర్మిషను అవుసరము లేకనే తర్జుమా చేయవచ్చు.

4. థామ్సను కవి రచనలు తెలుగులో తర్జుమా చేయ బడినవి నేను ఇంతవరకు చూడలేదు. హవుండ్ ఆఫ్ హెవెన్‌ను లోగడ శ్రీ చెట్టి మాస్టరుగారు తెనిగించిరనియు భారతి ప్రచురించినదనియు వినికిడి. వివరములు తెలియవు.

5. ఈయన జీవితముపై ఆధారపడి ఇంగ్లీషులో రెండు నాటకములు వ్రాయబడినవి. ఒకటి లండనులోను మరొకటి న్యూయార్కులోను జయప్రదముగ ప్రదర్శింప బడినవి.

తెలుగులో నాటకములు వ్రాయు విషయమై కూడ ఎవరి పర్మిషను తీసుకొన నక్కరలేదు. గాని మా పరిశోధనల ఫలితముగా దొరికిన అనేక నూతన విషయముల దృష్ట్యా ఏమేము ప్రచురింపబోయే పుస్తకము వచ్చు వరకు ఆగిన నాటకమునకు కావల్సిన అనేక ఇతర విషయములు లభ్యము కాగలవు.

6. హవుండు ఆఫ్ హెవెన్ ప్రచురింపబడి 75 సం॥ నిండిన సందర్భమున జూలై 1964 లో ఇక్కడ ఒక బ్రహ్మాండమైన ప్రదర్శనము జరిపించుటకు ఏర్పాట్లు అగుచున్నవి. ఈ కవితకు అనువాదములు, వ్యాఖ్యానములు, కవికి సంబంధించిన చిత్రములు యావత్ప్రపంచమునుండి సేకరించ బడుచున్నవి. ప్రచురింపబడిన ప్రతి తర్జుమా, వ్యాఖ్యానము ప్రదర్శనములో ఉంచబడును. వీటి క్యాటలాగు కూడ ప్రకటింపబడును. చిత్రకారులు తమ చిత్రములకు ఖరీదు నిర్ణయించి పంపవలెను. అమ్ముడుపోగా మిగిలిన వాటిని తిరిగి తగు కాలములో పంపివేయబడును.

7. రీసెర్చి విద్యార్థులు, తదితర మిత్రులు తమకు అత్యవసరముఅగు ఒకానొక పుస్తకము, భారతదేశములో ఎంత ప్రయత్నించిన దొరకని కారణమున, దానిని సేకరించి గాని, లేక వారికి కావల్సిన పుటలు కాపీచేసిగాని పంపించవల్సిందిగా అనేక జాబులు వచ్చినయి. మారుమూల గ్రామమైన బిలాస్‌పూరులో ఉంటూ నేను ఈవిధమైన కష్టముల అనుభవించినవాడ నవుటచేత వీరి యిబ్బందులను బాగుగ అర్థం చేసుకోగలను. గాని దురదృష్టవశమున సర్వ సహాయములకు అర్హతగల యీ నా మిత్రులకు సేవ జేయుటకు తగు వ్యవధి నాకు లేదు. వివిధ లైబ్రరీలు పనిచేయు కాలము నేను ఉద్యోగము చేయు కాలము ఒకటి అవుట వల్ల వీరి పుస్తకముల విషయమై వాకబు చేయుటకు కూడ వ్యవధి లేదు. గాని ఈ విషయములో వీరి పని జరుగునట్లుగా ఒక సలహా ఇవ్వగలను. ఈ క్రింది చిరునామాకు వారు తమకు కావల్సిన పుస్తక వివరములు తెలియజేయుచు వ్రాసిన యెడల వారి

పుస్తకమును ఎక్కడినుండి అయినను సేకరించి వారికి పంప గలరు. రానుపోను పోస్టు ఖర్చులు వారు భరించవలెను. సాధారణ ముగా ప్రభుత్వము గుర్తించిన ఒక లైబ్రరీ లేక విద్యాలయ ప్రధానోపాధ్యాయుడి ద్వారా మీరు అర్జీ పెట్టుకొనవలెను.

The librarian
National central library
Malet place
London W. C.

వివరములు పంపిన మీకు అవసరమగు పుటలను ఫోటో స్టాటు కాపీలు తీసి వీరు మీకు పంపగలరు. చెన్నపట్నంలో ఉన్న British Council వారు కూడ ఈ విష యములో తగు సలహా ఇవ్వగలరు.

ధావ్సను కవి పట్ల చూపించిన శ్రద్ధాసక్తులకు, నాకు ఇచ్చుచున్న ప్రోత్సాహమునకు, భారతి పాఠకులకు వారితో పరిచయ భాగ్యము గల్గు అవకాశము కల్పించిన భారతి సంపాద కులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

(లండన్) —జి. వి. కృష్ణమూర్తి.

# విశ్వనాథవారి యతిగీతము

ఆర్యా,

శ్రీ విశ్వనాథవారి యతిగీతమును గూర్చి నేను మార్చి సంచికలో కొన్ని విషయములను తెలియబరచిన తదుపరి ఏప్రిల్ సంచికలో శ్రీ దేవరెడ్డి వెంకటరెడ్డిగారు మఱికొన్ని సంగతులు తెలిపిరి.

వారి లేఖ నాకు వచ్చినది.

కాని ఆయన వ్రాసిన రెండు విషయములతో నే నేకీభవింప లేకున్నాను.

మొదటిది—"నిజ మారసినచో ఒకటో రెండో యతి దోషములు కవిసమ్రాట్టులకు గాక, యతిప్రాసైక బుద్ధులగు అల్ప కవులకు పడవు గదా !" అని నే నన్న దానిపై ఆయన ఇట్లా అన్నారు.

"ఆహా ! ఏమి వైచిత్రి ! యతి దోషములు కవి సమ్రాట్టులకే పడతాయట !! అల్ప కవులకు పడవట !!! ఈ వీరి ప్రవచనము తెలుగు సాహిత్యమునకే నూతనముగా నున్నది. కవిసమ్రాట్టులైనవారు విధిగా యతిదోషములు పాటింప వలెనా ?"

విధిగా యతిదోషములు పాటింపవలె నంటినా నేను ? యతిదోషములు కల్గినచో, ఎవరికి కల్గునో, ఎందుకు కల్గునో నేను చెప్పితి నంతే. యతులు, ప్రాసలు మాత్రమే ఆలోచించి వ్రాయు కవులకు అసలు తద్దోషములు కలుగు నవకాశమే లేదుగదా ! (ఇచ్చట నేను 'అల్పకవి' అన్న దానికి 'యతి ప్రాసైక బుద్ధులు' అన్నది విశేషణము. అల్ప కవులనేక విధములుగా నుండవచ్చును. ఇక్కడ నా పరిగణనలో ప్రస్తుత మైనవారు యతిప్రాసైక బుద్ధులు). ఇక యతిప్రాస లక్షణ ములు జీర్ణించుకొని తత్ప్రత్యేక దృష్టిరహితముగా పద్యములు వ్రాయువారిలో దోషము లెవరికి గల్గును ? ఒకటి—కొన్ని యతిప్రాస విశేషములు తెలియనివారికి. రెండు—సర్వ విశేష ములు తెలిసియు ఒక ఆవేశమున పొరబడినవారికి. ఈ రెండవ తరగతికి చెందిన దోషములు విశ్వనాథవారివని నా తాత్పర్యము. ఇట్టి దోషములు చేయుదురు మహాకవులన్న నా వచనము నూతన ప్రవచనము కాదు. నిదర్శనములు చూపుదును.

శ్రీనాథుం డెన్నో యతి దోషములు చేసినాడు—

"హరవిలాసము" మొదటి నాల్గాశ్వాసములలోనే ఈ క్రింది జారుపాటులున్నవి.

1. ద్వితీయాశ్వాసము— ఉ. ...... నదీ ముఖంబునం
25 వ పద్యము— బయ్యర వట్టె మేఘములు నచ్చుగఁ జా .......
2. 30 వ పద్యము—చ. దినములు రేఁ బవల్ దధిమధు ప్రచురాన్న ......
3. 37 వ పద్యము—ఉ. స్నానముచేసి ధౌతపరి ధానముఁ గట్టి .....
4. 45 వ పద్యము—గీ. బ్రమసి తప్పిన పసరంబు వెదకినట్లు
5. 98 వ పద్యము—కం. ప్రాగల్భ్యంబున నిధాన నవ సిద్ధులకై
6. తృతీయాశ్వాసము—కం. సమధిక విఘ్నంబ యనుచుఁ
35 వ పద్యము దలపోసియు
7. 61 వ పద్యము— ఉ. పంకజరేణు గంధియగు పల్వలవారిఁగ రేణు విచ్చె ని శ్శంక మదావళంబునకు గంధ గజంబును .....
8. చతుర్థాశ్వాసము— ఉ. మండలీసము
9 వ పద్యము— త్రేధ విశీర్ణ సంహతుల నేలు మహీధర వల్కలంబులన్

"శృంగారనైషధము" న నీ క్రింది దోషము లున్నవి.

9. ద్వితీయాశ్వాసము— మ॥ .... శ్రీ సుధా

129 పద్యము    నవ దిగ్వారణ సోదరుండవు
జగచ్ఛ్లాఘ్యుండవు.

10. తృతీయాశ్వాసము — తే. తగవుగా దింపులోననేక
140 వ పద్యము—    ఉరగర్షా.

(ఈ పై దోషములు అట్టెటు మార్చి సరిచేయుడు మన్నను ఎంతో మార్చినగాని కుదరనివి. ఐనను ఆ మార్గము న్యాయమైనది కాదు.)

ఈ దోషములు శ్రీనాథుఁడు చేయుటకు కారణమేమి? అదే కారణము మహాకవు లందరి జారుపాటులకును కారణము.

ఇక—ఆయన వ్రాసిన విషయములలో నేను ఏకీభవింప లేని సెండవది—

"వర్ణను, ప్రాసములును అలంకారతుల్యములనియు నవి విడిచిపెట్టిన బాధ లేదనియు నేటి కవులు కొంద రందురు. కాని, వీనివలన తెలుగులోని ఛందోరీతులకు ఎంత మాధుర్యము, శ్రావ్యత—సంపాదించినవో చూడవలసినదని నా ప్రార్థన" అను "తెలుగులోని ఛందోరీతులు" గ్రంథము నుండి ఉదహరించిన మాటలు.

యతిప్రాసల పరమార్థము మాధుర్యము, శ్రావ్యత. నిజమే. కాని, కవిత్వ పరమార్థము మాధుర్యము, శ్రావ్యత కాదు. ఎవని కవిత్వములోని శ్రావ్యత పాఠకునికి మనోల్లాసము కల్గించునో, ఆ కవికి తత్సంపాదనార్థక యతి ప్రాసలు, విఱుపులు ప్రధానము లగును. అంతేకాని భావవైశిష్ట్య ప్రధానుడగు కవికి అవి వట్టి నియమములే కాని ఆవశ్యకములు కావు. శబ్దమునకు అర్థ వ్యంజకతలో పర్యవసించుటయే పరమార్థమైనచో నా చెప్పినది సమన్విత మగును. తిక్కనాదుల కవితలో లీనమై చదువువో యతిప్రాసల విషయ మెవరికి తట్టును? మఱొక్క ప్రబలోదాహరణ మిత్తును. కొన్ని ఏళ్ల క్రితము "భారతి" లో "కళాదాస" వ్రాసిన—దూత మత్తేభము—లో యతిప్రాసలు పాటింపబడలేదు. ఆ పద్యముల శైలీ ప్రవాహతకు గాని అర్థప్రధానతకుగాని కించిద్భంగము కలుగలేదు.

కావున అర్థలీనతానావశ్యకములయ్యు, సంప్రదాయముగా ననుసరింపబడు యతిప్రాసములలో ఒక్కింత జాఱుపాటు కవితకు కల్గించు లోటేదియును లేదు కావున అది పట్టించుకొను పని లేదని నా తాత్పర్యము. శ్రుతి పేయత ప్రవాహమగు పద్యములలో యతి ప్రాసాదుల భంగము శ్రావ్యతాభంజక మగునెడ మాత్రమే విమర్శనీయము.

నైయుక్తిక స్వభావ ప్రధానములగు వాక్కులు, వాఙ్మయ చర్చలో అప్రశస్తమని విశ్వసించుటచే జేసి—"ఒక సామాన్య పాఠకుఁడు వెలువరించిన కొన్ని ప్రశ్నలకు—నే ననునది ఏమియు లేదు.

(మచిలీపట్టణం)— ఎ. రామమోహనరావు.



# గ్రంథ విమర్శలు

## ప్రసంగ వ్యాసావళి

ఆరుగురు కవుల ప్రసంగ వ్యాసాల సంపుటి. ప్రచురణ: సంగీత సాహితీ సదస్—గుంటూరు 2. మూల్యం : రెండున్నర రూపాయలు.

దేశకాల పరిస్థితుల్లో పుంఖానుపుంఖంగా వస్తున్న మార్పుల యొక్క ప్రభావంవల్ల సమాజ స్వరూపంతో బాటుగా కళల స్వరూపం గూడా మారిపోతున్న ఈనాడు రచయిత అంతర్ముఖుడై తన సాహిత్యాన్ని గురించి తానే ఆలోచించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. అలాంటి ఆలోచనకు పూనుకోకుండా యిచ్చ వచ్చిన రీతిలో రచనా వ్యాసంగాన్ని సాగించడం గుడ్డెద్దు చేలో పడిన చందమేనని ప్రత్యక్షంగా గాక పరోక్షంగా, ఘాటుగా గాక సున్నితంగా హెచ్చరింపదలచుకున్నారు—గుంటూరు సంగీత సాహితీ సదస్సు నిర్వాహకులు శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మగారు. ప్రశ్నావళి తయారు చేశారు. (1) మీరీ సాహిత్యాన్ని సృష్టించడానికి హేతువేమిటి ? (2) మీ సాహిత్యం ద్వారా మీరు సాధింపదలచుకున్న ప్రయోజనం ఎట్టిది ? (3) మీరు ఆశించిన ప్రయోజనాన్ని సాధించడానికి ఆయా వస్తువులనే ఎన్నుకోడంలో గల ఔచిత్య మేమిటి ?—అంటూ తన సందేహాలను బయటపెట్టి పై ప్రశ్నలకు సదుత్తరాలు చెప్పవలసిందని అర్థిస్తూ ఆయన పేరు, ప్రతిష్ఠ గలిగిన కవుల్లో నుంచి ఆరుగురిని మాత్రం ఎన్నిక చేశారు.

మనిషిని యిబ్బందికి గురిచేసే క్లిష్ట పరిస్థితుల్లో ఆత్మపరిశీలనకు పూనుకోవలసి రావడం మొదటిది ! చర్చావేదికపైకి ఆహ్వానింపబడిన కవులు ఈ యిబ్బందిని గుర్తించక పోలేదు. ఆంతర్యాన్ని బట్టబయలు చేసే సత్యపీఠంపైన నిల్చున్నట్టుగా ఉందన్నారు, 'సూర్పార్తి శ్రీ'. ఇది ఎవరి సాహిత్య దృక్పథాన్ని గురించి వారు బిగ్గరగా ఆలోచించుకోవడమే నన్నారు 'ధనకుదరం'. ఈ గోష్టి విధానము, దాని ఉద్దేశమూ అపూర్వమన్నారు ఆచార్య పిల్లలమర్రి. ఆఖరున ప్రసంగించిన కారుమంచి వెంకటేశ్వరరావుగారు—"వ్రాసేటప్పుడు మీరు ఆ పద్ధతులనే ఎందుకు ఎన్నుకున్నారు ? రచనలో మీ ఆవేదనకు మూలకారణం ఏమిటి ? మీ రచనకు ప్రేరణంటూ ఏమైనా ఉన్నదా ? వెరశీ పై మూడు ప్రశ్నల సారాంశాన్ని ఒక్కమాటలో గుదిగుచ్చుకుంటే ఇంతమంది మానవాళి ఉండగా మీరే ఎందుకు వ్రాశారు?— అని ప్రశ్నించడానికి మొగమాటపడి స. సా. స. వారు అడగవలసిన ప్రశ్నలను డొంకతిరుగుడుగా అడిగినట్టున్నారని సత్యాన్ని తేటతెల్లంగా చెప్పేశారు !

ప్రశ్నావళిని తయారుచేయడంలో శర్మగారెంతటి గడుసరితనాన్ని కనబరిచారో, సమాధానా లివ్వడంలో ఉపన్యాసకులంతటి చిత్తశుద్ధిని కనబరిచారు. కవులు, భావుకులు, సాహిత్య తత్వవేత్తలు అయిన ఉపన్యాసకులు తమ తమ ప్రసంగాలకు ఉపోద్ఘాతంగా సాహిత్య లక్షణాలను గురించిన ప్రాచీన అర్వాచీన నిర్వచనాల నన్నింటినీ ప్రస్తావించి, స్వాభిప్రాయ విశేషాలతో సహా వాటిని గురించి ముచ్చటించారు. సాహిత్య సృష్టితో ఏమాత్రం సంబంధం ఉన్నవారికైనా పాఠ్యగ్రంథంగా ఉపకరించే ఈ పుస్తకంలో వారికి సలహాలుగా హెచ్చరికలుగా మార్గదర్శకం కాగల సూక్తులు పుష్కలంగా ఉన్నాయి.

తాము సాహిత్య సృష్టికి పూనుకోడానికి వెనుకనున్న లౌకిక కారణాలను వివరించి 'సూర్పార్తి శ్రీ', సాహిత్యంవల్ల తా మాశించిన ప్రయోజనం మానవత్వానికి దోహదం చేయడమే నన్నారు. కావ్యం యశస్సు కొరకు, అర్థగ్రహణ కొరకు, వ్యవహారజ్ఞానం కొరకు, అశుభ పరిహారం కొరకు, సద్యఃపర నిర్వృతి కొరకు, ప్రియురాలి మాదిరిగా మనోజ్ఞంగా మహోపదేశం చేయడం కొరకు—అంటూ శ్రీ ధనకుదరం వేంకటాచార్యులు సాహిత్య సృష్టికి హేతువుల్ని, ప్రయోజనాల్ని ఒక్క గుక్కలో చెప్పేశారు. "మనిషి తన భావములను ఎంత ఎక్కువమందిలో ప్రవేశింపజేసి, వారి అనుభూతులలో జోడించి, ఎంత ఎక్కువ కాలం నిలుపుకుని తన భావాలకు అమరత్వం కల్పింపగలడో అంతవరకు సఫలీకృతు డైనట్లు. సాహిత్యకారుని విషయంలో గూడా అంతే ! ఈ రకమైన స్వార్థం ప్రతి సాహిత్యకారునిలోనూ ఉంటుంది" అని శ్రీ బొద్దులూరి నారాయణరావు సాహిత్యసృష్టికి మరొక నిగూఢమైన హేతువును పేర్కొన్నారు. సాహిత్యమంటే ఏమిటి, దాని ప్రయోజన మేమిటి అన్న ప్రశ్నలకు సాధికారపూర్వకంగా సమాధానాలు చెప్పి, తమ జీవితానికి, సాహిత్యానికి ఉన్న అనుబంధాన్ని గురించి వివరించి చిట్టచివర పిల్లలమర్రి వేంకట హనుమంతరావుగారు నేటి సాహిత్యాభివృద్ధి పట్ల నిస్పృహ ప్రకటిస్తూ, నిర్భీక విమర్శ వినా సాహిత్యానికి ఆరోగ్యం చేకూర్చడానికి మార్గాంతరం లేదన్నారు.

తమ తమ సాహిత్య దృక్పథాలను వివరిస్తూ వాటికి అనుగుణ్యంగా తమ సాహిత్య సృష్టి ఎలా సాగిందో, ఎలా సాగుతున్నదో వివరిస్తూ కవులు తమ ప్రసంగాలను ముగించారు

ప్రసంగ వ్యాసావళి 112 పేజీల చిన్న పుస్తకం. పరిణామంలో చిన్నదైనా గుణంలో గొప్పదైన పుస్తకం. ఎందుకు గొప్పదంటే అందుకు కారణం కోసం మళ్లీ పిల్లలమర్రి వారి వాక్యాలనే ఉదహరించడం సమంజసం.

"కవితకు అంతస్సనీ ఆకృతినీ రెండు అంగాలు. అంతస్సు ప్రధానమైనది. ఈనాడు ఆకృతిలో అనంత వైవిధ్యం పొటమరిస్తూ ఉండటం సంతోషదాయకం. కానీ, అంతస్సులో పూర్వ కవులు సంపాదించుకున్న ఆత్మశుద్ధీ, శుద్ధ సత్యం నేటి రచయిత లెందరినో వారివారి రచనలను బట్టి చూస్తే మృగ్యం గావడం శోచనీయం. జంతువుకన్నా ఏవిధంగా మానవుడు ఉన్నతుడు అని ప్రశ్న వేసుకున్నామో, సామాన్య మానవునికన్నా సాహిత్యకారుడు ఏవిధంగా మిన్న అని ప్రశ్న వేసుకోవలసే ఉన్నది..... అచ్చుయిందల్లా సాహిత్యం కాదు. పద్యాలలో లేనంత మాత్రాన కవిత కాకనూ పోదు. గుణంలో, శిల్పంలో, రసపోషణలో కొంత శ్రద్ధ నేటి రచయితలు వహిస్తే సాహిత్యమార్గం సుసంపన్న మౌతుంది. ఇలాంటి సాహిత్య సదస్సులు తరచూ పలుచోట్ల జరుగుతూ ఉండడం వల్ల, కవి పండితుల రచనంతో గూడిన సంకలన గ్రంథాలు వెలువరించడంవల్ల గూడా అభ్యుదయాన్ని ఆశించవచ్చు."

అలాంటి సంకలన గ్రంథమే ప్రసంగ వ్యాసావళి. ఇలాంటి మంచి పనికి పూనుకున్నందుకు సంగీత సాహితీ సదస్సువారిని సాహిత్యాభిమాను లందరూ హృదయపూర్వకంగా అభినందించగలరు.

## తుషార బిందువులు

కథల సంపుటి. సంకలనం : కె. ఆర్. కె. మోహన్. ప్రచురణ : శ్రీముఖ పబ్లికేషన్స్—ఫోర్టు రోడ్, మచిలీపట్నం 1. పుటలు: 156. మూల్యం: రు. 2.00

ఈ సంపుటిలో తల కొకటి చొప్పున ఎనిమిది మంది వ్రాసిన ఎనిమిది కథలున్నాయి. కథకుల్లో ఒకరిద్దరు మినహాగా మిగిలినవా ళ్లందరూ నవ యువ రచయితలు గావడం ప్రత్యేకత. అంతకు మించిన ప్రత్యేకత ఈ పుస్తకంలో కాన రాకపోవడం విచారాన్ని కలిగించే విషయం. ఎంతో కొంత జీవిత చిత్రణకు పాల్పడిన కథలు రెండు మూడు మాత్రం.

చివరి కథ (కంచి వాసుదేవరావుగారి పరిష్కృతం)లో యితఃపరం బెరుగనని భద్రాద్రి రామయ్యనే నమ్ముకున్న భద్రయ్య యిష్టదైవాన్ని దర్శించి తిరిగి వస్తూ పడవ మునక వల్ల గోదారి పాలుగావడం హృదయాన్ని కదిలించే సంఘటన.

మొదటి కథ (కె. ఆర్. కె. మోహన్‌గారి దైవోపహతులు) లో ఒక కుష్ఠురోగి జీవితం వర్ణితం. ఒకనాటి దినచర్యను వివరించడంలో విస్తరించి ఆశ్రయహీనుడైన కథానాయకుడు అరణ్య ప్రవేశం చేయడంతో ముగిసే ఈ కథలో శిల్పము, చమత్కారము కనిపించవు. ఆరవ కథ తొలగిన తెర. రచయిత జి. వి. కృష్ణారావు (ప్లేటో తత్వశాస్త్రవేత్తలైన కృష్ణారావుగారు కాదు.) జైలునుంచి విడుదలై వచ్చిన శ్రీకి నాగులు తన భార్యను పెడదారి త్రొక్కించిన రౌడీ రంగన్న పైన పగబూని, వాడిని కడతేర్చాలన్న నిర్ణయానికి వచ్చిన తరువాత, పూర్వ జీవితంలో తనూ అలాంటి తప్పిదానికే పాల్పడిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని పశ్చాత్తాపం జెందడం ఇందులోని యితివృత్తం. సంపుటిలో మిగిలిన కథలన్నీ ఏదో ఒక విధంగా 'ప్రేమ' అన్న ముడి ప్రత్తిలోనుంచీ వడికిన దారాలు. ఇలాంటి కథలు చదివినవారికి—దేశమంటే కళాశాలలేననీ, విద్యాభ్యాసం మాట దేవు డెరుగు గానీ అక్కడి వాతావరణం ప్రేమ పురాణాలకు ఆలవాలమనీ, ఆ ప్రేమ సాధారణంగా నూటికి తొంభై తొమ్మిది 'కేసు' ల్లో భగ్న మౌతుందనీ కొన్ని భ్రమలు కలగడం సహజం. మంచు తెరలలాంటి ఈ భ్రమలు ఎప్పుడు విచ్చిపోతాయో తెలియదు.

అలనాటి కవి సమయాలకు మల్లే, ఈనాటి యువ కథకులకు గూడా కొన్ని నియమాలు ఉన్నట్టున్నాయి. నాయకీ నాయకుల తల్లిదండ్రులు అయితే కర్కశహృదయులు గావడం, కాకపోతే అల్లరిపిల్లలకన్నా చిలిపివాళ్లు గావడం అలాంటి నియమాల్లో ఒకటి. రెండవ కథ (ముక్కామల వేంకటేశ్వరరావుగారి 'పాపం, పెళ్లయింది!') లో వాళ్లూ వీళ్లూ కూడా కూడబలుక్కుని కళాశాల రంగస్థలంపైన నాటకంలో పాత్రధారులకు - జరిగిన పెళ్లినే నిజమైన పాణిగ్రహణ మహోత్సవంగా మార్చేస్తారు.. విచిత్రం, కాదా విపరీత మేమిటంటే ప్రిన్సిపాలుగారు గూడా ఇలాంటి పెళ్లి తమ కళాశాల ఆవరణలో జరగడానికి సమ్మతిస్తారు ! అభూత కల్పనైతే గావచ్చు గానీ యిది కథగా చలామణి గావడం ఎలాగో అనూహ్యం. మూడో కథ—అమృత హృదయ. రచయిత జి. ఆంజనేయులు. నెల్లూరు కాలేజి లెక్చరరు రఘు కట్టుకున్న పెళ్లాం ఇంటిలో ఉండగా తనింకా అవివాహితుడనని చెప్పి, అదే కాలేజీలో ట్యూటరుగా పనిచేస్తున్న కమల శీలానికి కళంకం ఆపాదిస్తాడు. తల్లితండ్రులతో బాటుగా, భార్యా సహితంగా ఆ లెక్చరరుగారు కాపుర ముంటున్న ఊరు గూడా మరొకటి మరొకటీ గాదు. సాక్షాత్తూ ఆ నెల్లూరు పట్టణమే ! అతగాడి కుటుంబ స్థితిగతులను గమనించేపాటి ఓపరికం లేకుండా, అంత తొందరపాటుగా కమల ప్రేమలో పడిపోవడం మహదాశ్చర్యకరమైన విషయం. వాడుకోదలచుకున్న కలాన్ని, కట్టుకోదలచుకున్న చీరను ఒకటికి పదిసార్లు పరీక్షించిన తరువాత గానీ కొనడానికి యిష్టపడని ఈ వాస్తవిక ప్రపంచంలో భూమికి పది నిలువులెత్తున అట్టడుగు భాగం బొత్తిగా లేకుండా కట్టిన ఈ మిథ్యా ప్రేమ సౌధాలు కూలిపోతే అందుకు విచారించేవా ళ్లెవరూ ఉండరు. ఇలాంటి ప్రేమకు మరొక చక్కటి నిదర్శనం 'నందశ్రీ' గారు రచించిన 'మూగ మనసులు'. కోనేటి గట్టుపైన చెట్టు క్రింద కూర్చుని రచనా వ్యాసంగం సాగించే కథకుడు—మధు. గుడికి ప్రతిరోజూ వచ్చి వెళ్లే అమ్మాయి జయలక్ష్మి. (బి. ఎస్సీ. చదువుకుంటున్న నవనాగరిక యువతి) ఈవిడ "ఉండబట్ట లేక" మధును పలకరిస్తుంది. అతగా డొక విషాద వీణ. అందుకు కారణం ఇదివర కొకసారి తాను రోగశయ్యపై ఉండి అప్పట్లో ప్రేమించిన నర్సు రాజ్యలక్ష్మి చనిపోవడం. ఆ లక్ష్మికి ఈ లక్ష్మిని సబ్‌స్టిట్యూట్‌గా భావించి ఎందుకు సరిపెట్టుకోగూడదని మధును ప్రశ్నించడం అనవసరం !

# గ్రంథ విమర్శలు

అంతపనీ జరిగేలోగా మళ్ళీ మధుకు జబ్బు ముంచుకరావడం విధిచేసిన కుతంత్రం! జయలక్ష్మి ఒక్కతె మినహాగా ఆ గుడికి ఇంకెవరూ వచ్చి వెళ్లరా? మధు ఒక్కడు తప్పితే ఆసుపత్రిలో ఇంక రోగులే లేరా? పెళ్ళి నిర్ణయం చేశారు గనుక జయలక్ష్మికైతే తల్లితండ్రు లున్నట్టే తోస్తుంది గానీ, మిగిలినవాళ్ళ కిద్దరికీ రక్తబంధువు లెవరూ లేరా? ఉంటే వాళ్లు వీళ్ళ బాగోగుల్ని గురించి పట్టించుకోరా? ఇవన్నీ పాఠకుణ్ణి కలవరపెట్టే సందేహాలు.

'ముందు మాటలో' యువ రచయితలకు ప్రోత్సాహం అవసరమన్న కె. ఆర్. కె. మోహన్‌గారి అభిప్రాయంతో ఏకీభవించనివారు లేరు. కాన్నైతే సాహిత్యానికి ఓ చివరనుంచీ అనదగిన మాటే అది! మరో చివర డబ్బు పెట్టి పుస్తకం కొన్న పాఠకుడికి ఏమాత్రం సంతృప్తి కలుగుతుందన్న సందేహం! కానీ పుస్తకంపైన రెండు రూపాయలు వెచ్చించే పాఠకులంత ఎక్కువగా లేరని, ఈనాటి పుస్తక వ్యాపారంలో లోకల్ లైబ్రరీలపైన, ఉన్నత పాఠశాలల గ్రంథాలయాల పైన ఆధారపడి జరుగుతోందనీ చెబితే ఆ వాస్తవాన్నయినా ఎవ్వరూ కాదనలేరు. నెంబరు నమోదుచేసి, స్టాకు రిజిస్టరులో పేరు వ్రాసి, బీరువా కెక్కించిన తరువాత రెండేళ్లకి యిష్యూ రిజిష్టరును పరిశీలిస్తే ఏ పుస్తకం ఎన్నిసార్లు పాఠకుల చేతుల్లోకి వెళ్లిందో తెలుస్తుంది. స్థూలంగా పుస్తకం యొక్క విలువను గణించడానికి ఈ లెక్క ఎంతవరకు ఉపకరించగలదన్నది విజ్ఞు లాలోచింపదగిన విషయం.

## గడ్డిపూలు

కథల సంపుటి: ప్రచురణ : యువజన సాహితి, కల్వకుర్తి. సంకలనం : తాండ్ర జనార్దనరెడ్డి. ప్రతులకు : దామోదర్ రెడ్డి 14—2—351/3 గోషామహల్, హైదరాబాదు. పుటలు : 151. మూల్యం రు. 1.50.

ఈ సంపుటిలో ఏడు కథ లున్నాయి. ఏడూ ఏడుగురు వ్రాసినవి. (సంపత్ రావు, అమినేనిపల్లి నారాయణరెడ్డి, సుధాకరరెడ్డి, దామన్న, చల్పత్‌రావు, శ్రీనివాసాచార్య, లక్ష్మీనాథ్) కథకుల పేర్లు యిదివరకూ పత్రికల మూలంగా పరిచితమైనవి గావు. కనుక యివన్నీ వారి క్రొత్త ప్రయత్నాలనే భావించవచ్చు. ఐనా కథనంలో తొట్రుబాటులేని ఈ కథా సప్తకంలో నిజమైన మానవ జీవితం ప్రతిబింబించడం ప్రత్యేకించి పేర్కొనదగిన విశేషం. నిశితమైన జీవిత పరిశీలన, చెప్పదలచుకున్న విషయాన్ని గురించి ఒక నిశ్చితమైన అభిప్రాయం—ఈ రెండు గుణాలు కథకునికి అత్యవసరమన్న విషయంలో అభిప్రాయభేదాలకు ఆస్కారం ఉండదు. ఈ కథల సంపుటికి సంపాదకులైన తాండ్ర జనార్దనరెడ్డిగారు పై రెండింటితోబాటుగా, ఎవరో ఆలోచించి పెట్టిన పద్ధతుల్లో గాకుండా, స్వంతంగా ఆలోచించే ప్రయత్నం గూడా కథకులకు అవసరమని తమ 'ఒక మాట' లో సూచించారు. ఈ సంపుటిలోని కథల్లో పై మూడో సుగుణం గూడా పుష్కలంగా కనిపిస్తున్నదనే చెప్పవచ్చు.

బ్రహ్మాండమైన మేడలు, పోర్టికోలో వచ్చి నిలిచే కారులు, నైలాన్, షిఫాన్ యిత్యాదిగా చీరలు, అరగంటకొకసారి దుస్తులు మార్చుకొస్తామని చెప్పి గదిలోకి వెళ్ళే స్త్రీ పురుషులు, 'టీ' తయారుచేసుకొచ్చే మలయాళీ కుర్రవాళ్లు—మొదలైన హంగులకు నోచుకోకుండా అచ్చమైన పల్లెటూరి వాతావరణంలో తమ ఆకృతిని మలచుకున్న కథలివి. కథకు రంగస్థలంగా పల్లెటూరుని ఎన్నుకోడంలో మరొక చిక్కు గూడా ఉంది. పల్లెలో కళాశాల లుండవు. అందువల్ల సర్వ లక్షణ శోభితమైన ప్రేమగాథలు ఉద్భవించే అవకాశం హుళక్కి. పట్టణాల సంగతేమిటో గానీ పల్లెల్లో ప్రేమ ప్రాణావసరమైన సమస్యగాదు. అక్కడ అంతకంటే ప్రాణాంతకమైన సమస్యలు పెక్కు లున్నాయి.. కథకుడు మానవజీవితంపట్ల శ్రద్ధ, ఆరాధన కలిగినవాడైతే దేశీయుల దృక్పథాన్ని అలాంటి జీవితసమస్యలపైకి మళ్లించవచ్చు .....

దండిగా అప్పులు చేసిపెట్టి యింకా పప్పు కూడే తినాలనే తండ్రులు, మడికయ్యలైనా తెగనమ్మి కూతుళ్లకు దర్జాగా సారెలు పెట్టాలనే తల్లులు, పుట్టింటివారి నట్టింట జిల్లేళ్లు మొలచినా తమకు వెట్టు పోతలు జరిగితే చాలు ననుకునే అక్క చెల్లెళ్ళు, మగడు ప్రాధేయపడి అడిగినా ఆ రొంపిలోకి రాలేమని చెప్పి పుట్టింట భీష్మించుకుని కూర్చునే భార్యలు, వరకట్నం పూర్తిగా చెల్లించని కారణంగా బావిలో దూకి చనిపోయిన కోడళ్ళు, కుల విద్యలు కూడు పెట్టడంలేదన్న కోపంతో ఎలాంటి పనికైనా పాల్పడే ఉక్రోషపు మనుషులు, ఎలాగైనా అప్పు చెల్లించి పెదకాపుగారి పిడికిలి నుంచి విడివడాలన్న పూనికతో పడరాని కష్టాలు పడి, తీరని రోగాలు తెచ్చుకునే కూలీలు, తెల్లవారే సరికి రచ్చబండపైన ఏడుస్తూ ప్రత్యక్షమయ్యే దిక్కులేని పసికందులు, ఇలాంటి సజీవమైన పాత్రలు ఈ సంపుటిలోని కథల్లో కనిపిస్తాయి.

నగ్నజీవిత దృశ్యాలను చిత్రిస్తే చాలదు. ఆహ్లాదకరమైన కథాకథనం గూడా అవసరం. 'క్రియేషన్' గా ఉంటూ 'రిక్రియేషన్' యివ్వగలిగినదే కళ—అన్న సిద్ధాంతం దృష్ట్యా చూచినా ఈ కథలెంతో సంతృప్తిని కలిగిస్తున్న మాట నిజం. "హాస్యం, విషాదం, శృంగారం, కొంటెతనం, కోపం, అమాయకత్వం, వర్ణన, ఛలోక్తి, జీవితాన్ని గురించి నిర్వచనాలు చెప్పడం, వ్యక్తిత్వ ప్రకర్ష, కవిత, ఏడుపు, నవ్వు" మొదలైనవన్నీ కథ కుండవలసిన హంగులే నన్న ఒకానొక సుప్రసిద్ధ కథకుని అభిప్రాయాన్ని బట్టి చూచినా ఈ కథలు ఆశాభంగం కలిగించవు. ఆలోచనాశీలం గలిగిన పాత్రలద్వారా ప్రకాశంగానో, స్వగతాలుగానో కథకులు పలికించిన మాటలు కొన్ని మళ్ళీ మననం చేసుకోదగినవి యిందులోఉన్నాయి.

## అగ్నిశిఖలు - మంచుజడులు

కవితా సంపుటి. రచయిత : కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు. ప్రచురణ : అమరసాహితి, 14—3—112, ఘోషామహల్, హైదరాబాదు. పుటలు : 64. మూల్యం : రు. 2.

పత్రికల ద్వారా యిటీవల తరచుగా గేయాలు వ్రాస్తున్న వారిలో కమ్మిశెట్టి వేంకటేశ్వరరావుగా రొకరు. "అగ్నిశిఖలు..." అన్న ఈ కవితా సంపుటిలో 'గీతం రాయాలి నేను నవగీతం' అంటూ నవగీతాలు వ్రాయాలన్న ఆకాంక్షను ఆయన గాఢంగా వ్యక్తపరిచారు. వ్రాయదలచుకున్న నవగీతం జీవన మధుభాండాన్ని మధింపగా ఉద్భవించే మృదుల మధుర నవనీతం లాగా ఉండాలన్న నిశ్చితాభిప్రాయం గూడా ఈయనకు ఉంది.

జ్వలిస్తున్నది గుండెలో దావానలం
స్రవిస్తున్నది గొంతులో హాలాహలం
ఎడతెగక మార్మోగు నాలో భయదమై
నిదుర నెరుగని నీరధుల కోలాహలం'

అన్న ఆత్మనివేదాన్ని బట్టి చూస్తే ఏదో చెప్పాలన్న ఆవేదన, చెప్పేదాకా మనసును ఊరుకోనివ్వని అలజడి గూడా ఈయనలో ఉన్నాయి.

ఈ కావ్యంలో 'అశ్రు గంగ' అన్నపేరులో ఒక్కగేయం ఉంది. మొత్తంగా కావ్యాన్నే అశ్రుగంగగా పేర్కొనవచ్చు. ఎందుకంటే వాడిపోయిన ప్రసూనానికి వసంతాల ప్రసక్తి దేనికి, మునిగిపోయిన భగ్న నౌకకు తీరమెందుకు, దూరమెందుకు, మూగవోయిన శిథిల వీణకు రాగభావ విచారమెందుకు?' అంటూ హిమపాతంలో మరణించిన విరి కోసం, గ్రీష్మంలో ఆవిరైన ఝరికోసం, భగ్న నౌకల కోసం, శిథిల వీణలకోసం యింకా ఎడారిలో ఒంటరి తెరువరికోసం, కొడిగట్టిన దివ్వెలలాగా కొన ఊపిరితో ఉన్న జీవులకోసం కన్నీరు వర్షించి, చివరి కొకమాట—

స్వేచ్ఛగా హృదయాన్ని రోదించనీ
కన్నీరు వరదలై ప్రవహించనీ......
ప్రవహించలేని అశ్రుకణాలు
గుండెను దహించు అగ్ని కణాలు
మనసు మాటలు వినకు ఏనాటికి
కట్టివేయకు సుమీ కన్నీటిని —

అంటూ అశ్రుగంగాభిషేకంవినా కలుష హృదయాలు పునీతం కావడానికి మార్గాంతరం లేదని చెబుతారు రచయిత.

చీకటి, అశ్రువులు, తుఫాను, యిసుక, ఎడారి, ఆశ, నిరాశ, నిశీథిలాంటి పదాలు విచ్చలవిడిగా కనిపించడం ఆధునిక కావ్యాల లక్షణమైతే ఆ లక్షణం ఈ కావ్యానికి శైతం అక్షరాలా వర్తించింది.

మహాప్రస్థానంలో శ్రీ శ్రీ గేయాలకు యించుమించుగా ప్రతి ధ్వనులలాంటి గేయాలు కొన్ని ఈ కావ్యంలో ఉన్నాయి. అక్కడి 'భిక్షువర్షీయసి' యిక్కడ 'వృక్షవర్షీయసి' అయింది. శ్రీ శ్రీ తమ అద్వైతంలో 'వాసంత సమీరం నీవై, హేమంత తుషారం నేనై, అంటే, యిక్కడ కవి తన ప్రాక్పశ్చిమాలలో 'అందుకోలేని శిఖరాగ్రాన నీవు, క్రుంగిపోయిన యిరుల కూపాన నేను' అన్నారు. 'దాహం దాహం దాహం దాహం ఆరని దాహం తీరని దాహం' అన్న గేయం మహాప్రస్థానంలో 'గంటలు' అన్న గేయాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

ఆ కోవలో అగ్రేసరుడైన కవియొక్క ప్రభావం ఆ తరువాతి వారిపైన ప్రసరించడం సహజమే! ఆ మాటకేమి గానీ, వేంకటేశ్వరరావుగారి ఊహాశక్తికి నిదర్శనాలైన చక్కటి గేయాలుకూడా ఈ కవితా సంపుటిలో ఉన్నాయి.

యుగ యుగాలుగా మధించిన
మానవ మేధస్సులో ఆవిర్భవించిన
హాలాహలం, పీయూషం ఏకమైన వేళ
దానవత్వం రోసి, మానవత్వం మాసి
దైవత్వ మందుకోలేక
పైశాచికాకృతి వహించెనా నేటి మానవుడు —

—అంటూ కవి చెందిన నిర్వేందలోనూ, జీవన పథంలో కొన్ని మజిలీలు పయనించిన తరువాత, దిశలులేని తావున దిక్సూచికి అర్ధమే గానక, కాల మహాంబుధిలో చుక్కానికి అర్ధమే తోచక, ఒకచోట ఆగిన మానవుడు తన మొదటి మజిలీ గురించి తలపోతలలో ఉక్కిరిబిక్కిరై పోయే 'బాల్యం' అన్న గేయంలోనూ

అగాధ శూన్యంలో జీవితం నిరాధార సేతువు
వెదక్క హేతువు—నెత్తిమీద గూడుకట్టుకుందిటీతువు.
హృదయం, మేధ కలియని ధ్రువాలు
జీవిత రథాన్ని చెరోదారి లాగే వారువాలు —

అంటూ జీవితానికి తన వ్యాఖ్యానం వినిపించడంలోనూ రచయిత భావనా పటిమ ద్యోతకమౌతుంది.

మీదుమిక్కిలి ఈ కవి ఆశావాది. నిరాశా నిస్పృహల నివురులోపల ఈయన ఆశావాదం నిప్పులా దాగివుంది—గాలి వీచి నివురు చెదరినప్పుడల్లా తళుక్కుమని మెరుస్తుంది.

ఏమైనను ముగియ బోని
దీవిచిత్ర కాలయాత్ర
ఏనాటికి పగిలిపోని
దీ జీవన వజ్ర పాత్ర —

అంటూ మానవుడి అమరత్వం పట్ల విశ్వాసాన్ని ప్రకటిస్తున్న ఈ యువ కవి భావిలో భావ మహోదధిని మరింతగా మధించి కవితామృతం పంచి పెట్టగలరని ఆశించవచ్చు.

—ఎమ్. ఆర్.

## నేను, పైరుపంట, గీతాదర్శము

మూడు పద్య గ్రంథాలు. రచయిత: తుమ్మల సీతారామ మూర్తిగారు. వెల : వరుసగా 80, 150, 200 నయా పైసలు. ప్రకాశకులు : గ్రంథకర్త, అప్పికట్ల. గుంటూరు జిల్లా.

చక్కని పలుకుబళ్లతో, తిన్ననైన అన్వయశుద్ధితో సరళమైన శైలిలో పద్యము అల్లగలిగిన కొద్దిమందిలో తుమ్మల సీతారామమూర్తిగా రొకరు. వారి వలెనే వారి కవితాకన్య బాహ్యాడంబరాలూ, అలంకారభావాలూ లేనట్టిది. 'అభినవతిక్కన' అన్న పెద్ద బిరుదుల నుపేక్షించి "తెనుగు లెంక" గా నిలువ నుబలాటపడే సీతారామమూర్తి గారి భావ మాధుర్యమును మెచ్చని తెలుగువా డుండడు.

# గ్రంథ విమర్శలు

''నేను'' సీతారామమూర్తిగారి జీవిత కవితానిష్ఠలను గూర్చిన 150 దాటిన పద్యాల సంకలనము. స్వర్గీయ కాటూరి వెంకటేశ్వరరావుగారి స్మృతికి ఉడుగర. ఈ పద్యాలన్నీ చిన్నవి. కందములూ, గీతములూ, ఆటవెలదులూను. వీటిలో 'మడికి నొక్కపూట బడి కొక్కపూటగా దాటినాడ జిన్నతనము నేను' వంటి అటుకులూ, 'తెల్లనేల .... బుట్టు మానవుండు కొసరి కొసరి యింత గోంగూర దినని చో నేమి మెతుకు వాని దేమి బ్రతుకు' వంటి శనగలూ, 'యెనిమి దేండ్లు మాత్రమే యిది (కవిత) నా కంటె జిన్న' దన్న జీడి పప్పు పలుకులూ, 'వాపుగాదు బలుపు వలయు నాకు' వంటి బూంది రవ్వలూ, 'వేడు నట్టివాడు కాడు తుమ్మలకవి' వంటి బటానీ గింజలూ ఉన్నాయి. చక్కని మిక్శ్చర్.

''పైరుపంట'' సీతారామమూర్తిగారి ఋజురేఖాన్వయ రచనకు చక్కని లక్ష్యము. సంక్రాంతి ముచ్చటలు, వరినాటు, జడికారు, గ్రామ జీవితపు మెఱుపులు. ఆ మంచి రోజులు కథకాని కథ. తక్కినవి ప్రకీర్ణకాలు, తుమ్మలవారి సౌహార్ద్రకమైన గడుసుదనముతో నిండినట్టివి.

''కవులు ప్రజల్ పరస్పర వికాసములన్ మది నిల్పి సత్యమున్ శివమును సుందరమ్ము నగు జీవనమున్ గడియించి దేశ వైభవమున కండ దండలుగ వర్ధిల్లు చుందురుగాక ! విశ్వమానవ నవభామసీమ ''సహనావవతు''ల్ రవళించు గావుతన్'' అన్నది వారి చిరకాలపు కోరిక.

''గీతాదర్శము'' భగవద్గీతకు చిన్న పద్యాలలో తెలుగు. తుమ్మలవారి గమనాలనకావ్యకన్య చెప్పిన గీతావచనాల కూడలి. భగవద్గీతను పద్యాలలో చెప్పడములోని చిక్కులు వీరి చిత్ర ప్రయోగములు ''నైక బాహువులను గాక'' వంటి వాటివల్ల తెలుస్తాయి. అయితే ఇది మాటకు మాట తెలుగు కాదు, భావార్థము ననుసరించి కొంత మారి వర్తించిన రచన. ఇదీ పై సత్యానికి ఉదాహరణే. తుమ్మలవారిది తెలుగు జాతీయము. భగవద్గీత సంస్కృతపు నుడుల దూరాన్వయాన్ని దగ్గరచేసి గీతను తెలుగులో కుదించి యున్నది. ఈ అనువాదము వేదాంతశాస్త్రపు కసటు తెలుగు బాటలో సాగిన వైచిత్రిని గుర్తించుకోవడములో అందగిస్తుంది.

—శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

## అపరాజిత

నాటకం. రచన : కందికొండ సత్యనారాయణశాస్త్రి, కాశ్యప పబ్లికేషన్సు, మచిలీపట్నం. వెల : 2.00. ప్రభాకర్ వనజను ప్రేమిస్తాడు. ఆమె చూలాలు అని తెలియగనే తప్పుకొంటాడు. కానీ ఇరవై రెండేండ్ల వరకూ ఆమెను గూర్చిన వ్యథలోనే జీవితాన్ని సాగిస్తూ వస్తాడు. పారిస్‌కు రాయబారిగా వెళ్లదగినంత హొదా పెరిగిపోతుంది. వనజ ప్రసవించిన వెనుక ఆమె జీవితం అనాథల సేవకు అంకితవవుతుంది. ఆ బిడ్డ మోహన్ పెద్దవాడవుతాడు. చివరికి అంతా ఒక విచిత్రమైన సన్నివేశంలో కన్పిస్తారు.

రంగం మీద మాత్రం కథ యిట్లా జరగదు. చివరి ఘట్టంలోనే కన్పించి పూర్వ జీవితగాథ నంతా సంభాషణల తోనే ప్రదర్శిస్తారు.

ఇందులో దుష్యంతుని పాత్ర ప్రభాకర్‌లో మూర్తీభవించినట్లు చూపగల్గడం ఒక ప్రత్యేకత. క్రొత్త పద్ధతిలో ప్రయోగించిన ఈ నాటకం చదవడానికి బాగుంది. నటులు ప్రతిభావంతులైతేనే తప్ప ఈ నాటకాన్ని ప్రదర్శించడం కష్టం. సుదీర్ఘమైన స్వగతాలు భావగర్భితాలైనందున మంచి నటనా నైపుణ్యాన్ని ప్రదర్శించడానికి నాటకం విలువైన అవకాశాల నిస్తుంది.

ప్రాచీన వ్యక్తిత్వముల పోలికలతో ఆధునిక పాత్రల సృష్టి నాటక శిల్పమునకు క్రొత్తదనాన్ని ఆపాదిస్తున్నది.

ఇందులో ''ఏలూరు కాల్వ, ఆ కాల్వ ప్రక్కన పొడుగాటి పార్కు, బెజవాడలో ''బిజీ'' గా తిరుగుతున్న అందమైన ఆడవాళ్ల ముఖాల'' ను గూర్చిన ప్రస్తావన అప్రస్తుతము, అనుచితము.

కె. సభా.

## సహదేవ

తిరుపతి ఆంధ్ర వెటర్నరీ కాలేజి హాస్టలు వార్షిక సంచిక. ఇందులో విద్యార్థుల రచనలు— ఫోటోలు ఉన్నవి. ఏడాది పొడుగునా వారి విహారాలు, కళారంగంలో సాధించిన ఫలితాలు పొందు పరచబడి ఉన్నవి. గెటెప్ ముద్రణ చక్కగా ఉన్నాయి. విషయపుష్టి బరువుగా లేదు. మంత్రులూ నాయకుల ఫోటోలు మామూలే.

## జాతినాడి

సంపాదక వర్గం : శ్రీ అయితరాజు రంగారావు, కుమారి యం. కె. లలితారెడ్డి, శ్రీ దేవులపల్లి దేవదాస్, గాంధీ వైద్య కళాశాల, హైదరాబాదు. కళాశాలలో లలిత కళలను ప్రోత్సహించే సదుద్దేశముతో వెలువడిన ఈ సంచికలో కథలు వ్యాసాలు గేయా లున్నవి.

## తొలిచిగుళ్లు-గేయకవితలు

ప్రచురణ : కలం స్నేహితుల వెన్నెల బృందావన్, ఏలూరుశాఖ, పవరుపేట, ఏలూరుశాఖ, వెల : 20 పైసలు. కవిత్వంలోని యౌవన దశను సూచించే చిన్నచిన్న గేయా లున్న విందులో.

## హిందూధర్మ రక్షకులు

శ్రీ కె. యల్. నారాయణ. పబ్లికేషను: అనుపమ పబ్లికేషన్సు, తెనాలి. వెల : 0.63. మునునూరి వీరులు చరి

్రతతో పాటు గ్రంథకర్త ఉపన్యాసమున్న దిందులో. గ్రంథాలయము లందుంచ దగిన గ్రంథ మిది.

## సాధక గురువులు

రచయిత : వి. ఆర్. రాగం, వెల : రు. 0.30.

శ్రీమద్భాగవతైకాదశ స్కంధమున 7, 8, 9 అధ్యాయములలో శ్రీ కృష్ణపరమాత్మ ప్రియభక్తుడగు నుద్ధవున కొకయ్యె తివ్యా మూలమున వివరించిన అద్భుతాంశము లివి.

పై రెండు గ్రంథముల ప్రకాశకులు శ్రీ సీతారామ సంకీర్తన సంఘము, శిరామనామ క్షేత్రము, గుంటూరు—4.

## వివేక విక్రమము

వెల : రు. 0.50. రచన : కవిరత్న యామిజాల పద్మనాభస్వామి, 8, బి. తిలక్ స్ట్రీట్, త్యాగరాయనగర్, మద్రాసు—17. శ్రీ వివేకానందస్వామి జీవితసార సంగ్రహము నకు పద్యరూప మిది.

## ఆడపిల్లల పెళ్ళిళ్లు
## తలిదండ్రుల అగచాట్లు

రచన : కె. వి. ఎస్. సూర్యనారాయణరాజు, వెల : రు. 2.00. ప్రచురణ : స్నేహలతా వరకట్న నిషేధ సంఘము. 2—1—402, నల్లకుంట, హైదరాబాదు—20. వరకట్న నిషేధమును గూర్చిన వ్యాసావళితోపాటు వావిలాల గోపాల కృష్ణయ్యగారి తొలి పలుకు లున్నవీ గ్రంథమున.

## శ్రీ రమణ చరితామృతము
## (పద్యకావ్యము)

రచన : చిల్లర వేంకటరమణయ్య బి. ఏ., బి. ఇడి., 20/126 మూలపేట, నెల్లూరు. వెల : రు. 0.50. భగవాన్ రమణమహర్షి పావన జీవనగాథలోని మహాద్భుత ఆధ్యాత్మిక విశేషాంశములందు లిఖితములు.

## వేదాంత భేరి
## (ప్రణవ సంచిక)

శ్రీ శుక బ్రహ్మాశ్రమము. కాళహస్తి, చిత్తూరుజిల్లా. వెల : రు. 0.75. మహాత్ముల, మహర్షుల, ఆధ్యాత్మిక విజ్ఞాన జిజ్ఞాసువుల వ్యాసములిం దున్నవి. ఎక్కువ భాగము ప్రణవమును గూర్చినవి.

## విహారి

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక. వెల : రు. 0.50. మెయిన్‌రోడ్, తెనాలి. గోపీచంద్ ముఖచిత్రంతో, వారి జ్ఞాపకాలతో ప్రఖ్యాత రచయితల కథలతో, వ్యాసాలతో అలంకృతమైన ప్రథమ సంచిక యిది. ఎడిటర్ : ఎస్. హనుమంతరావు.

## శ్రీ గోరా అభినందన సంచిక

సంపాదకులు : శ్రీ వి. నాగేశ్వర్, శ్రీ అడ్డుమిల్లి పూర్ణచంద్రరావు, వెల : రు. 1.00. గోరా షష్టిపూర్తి సన్మాన సంఘంవారు సమర్పించిన ఈ సంచికలో శ్రీ గోరాగారిని గూర్చిన అనేకమంది ప్రముఖుల వ్యాసా లున్నవి. వాటిలో "ఆస్తికుడు" అనే శీరికతో "నే నెరిగిన కొద్దిమంది నిజమైన ఆస్తికులలో గోరాగా రొకరు" అంటూ ఆరంభించిన చలంగారి వ్యాసం మకుటాయమాన మైనది.

## ఇంద్ర ధనుస్సు

రచన : చిత్రభాను, చిత్రభాను ప్రచురణలు, విజయనగరం 2. వెల : 75 న. పై. లలితమైన పదజాలములతో చిన్న చిన్న గేయా లున్న విందులో.

## జయభేరి

రచన : చౌడూరి గోపాలరావు. చిరునామా, వెల ప్రచురించబడలేదు.

## శ్రీనివాసల హరి

రచన: పొన్నాడ కోటేశ్వరరావు, 16—1—553/21 సైదాబాదు, హైదరాబాదు 24. వెల : 75 న. పై. శ్రీ తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి వైభవోన్నతిని గూర్చిన పద్యకావ్యమిది.

## శ్రీ శంకరాచార్యులు

రచన : పురాణపండ కామేశ్వరరావు. ప్రతులకు : పురాణపండ "చిత్ర", రాజమండ్రి—విక్రమహాలు, తూ. గోదావరి. వెల : 1.50. శ్రీ శంకరాచార్యుల జీవితచరిత్ర, చక్రధారి కథ లున్నవి ఇందులో.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The AndhraPatrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor: S. Sambhu Prasad.